# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

* కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------------ కూపన్ ------------------------

జూన్ చతుర నవల ఆ మనిషి

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

# ఏరిన ముత్యాలు

★ శారీరక శ్రమవల్ల మానసిక బాధలు దూరమవుతాయి.

— బైబిల్

★ శ్రామికునికే విశ్రాంతిలోని సుఖంతెలుస్తుంది.

— జె.కె.జె.రోమ్

★ భగ్న హృదయాలకు దివ్యౌషధం సంగీతం.

— యం.హంట్

★ చేతిలో డబ్బున్నవాడిని, శరీరంలో బలం ఉన్నవాడిని సంఘం ఏమీ చెయ్యలేదు.

★ నేను సమాజానికి ఏమైనా చేశానా?... అని ప్రశ్నించుకుంటే మన స్వంతానికి స్వార్థంతో చేసుకున్నదే కనిపిస్తుంది. కాని ఆ ప్రశ్న మనసులో నిలిచివుంటే మనం సమాజానికి ఏమైనా చేయగలం.

— సిమ్స్

★ స్వేచ్ఛగా చర్చించుకొనే సమాజంలో మానవ ప్రకృతి కారణంగా విభిన్నపక్షాలు వుండి తీరతాయి. దానితో అభిప్రాయభేదాలు, కక్షలు ఏర్పడతాయి కూడా.

— థామస్ జఫర్సన్

★ ప్రతి వ్యక్తి ఇంకొక వ్యక్తిని హృదయపూర్వకంగా గౌరవించగల సమాజమే సుఖవంతమైన సమాజం.

— గేటే

★ ఏదో ప్రయత్నంవల్ల ఏకాస్తో సాధించినట్లు అవుతుంది. ఒక రాత్రి విశ్రాంతికి అర్హత వుంటుంది.

— లాంగ్‌ఫెలో

★ విరామకాలం ఖరీదయిన, అందమైన వస్త్రంలాంటిది. చిరకాలం ధరించుటకు పనికిరానిది.

★ విశ్రాంతి కొరకు ఆరాటపడిన మానవులు అలసిపోతుంటారు.

— లారెన్స్ స్టైరెన్

★ కళ్ళు పెరికినా, కంఠం నరికినా నేను చావను. కాని నాలోని దేవునిపై విశ్వాసాన్ని వమ్ముచేస్తే వెంటనే మరణిస్తాను.

— గాంధీజీ

★ దృఢ విశ్వాసానికి సరయిన ఆధారం కావాలి. లేనిచో అది మూఢనమ్మకమవుతుంది.

— గాంధీజీ

★ విశ్వాసం జీవితాన్నిస్తే అవిశ్వాసం మృత్యువునిస్తుంది.

— రామకృష్ణపరమహంస

★ పరీక్షించిగాని మనిషిని విశ్వసించకు. విశ్వసించిన వాడికి నీ ప్రాణం ఇయ్యి.

— తిరుక్కురళ్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ



అబ్బ నోరూరుతోందిగదూ? 'కేకు టోపీ'!



నూడిల్స్‌తో తయారైన అద్భుతమైన తలపాగ'

# నోరూరించే టోపీలు

తలపై పెట్టుకునే టోపీ నోరూరించడమేమిటా అని ఆశ్చర్యపోతున్నారు కదూ! మరి అది మామూలు టోపీ కాదు... కోడిగుడ్లలోని తెల్లని సొన, పంచదార కలగలిపి చేసిన చక్కని కేక్. దానిపై అందంగా పోతపోసిన క్రీమ్... ఆ పైన అక్కడక్కడా అమర్చిన ఎర్రని స్ట్రాబెర్రీలు... ఇలాంటి రుచికరమైన పదార్థాలతో తయారైన టోపీల్ని చూస్తే ఎవరికి మాత్రం నోట్లో నీరూర దు?

క్షణక్షణానికి కొత్తపుంతలు తొక్కుతున్న ఫ్యాషన్ ప్రపంచంలో చూపరులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తేలా ఒక్కసారిగా ప్రవే

చేపపొలుసుతో తయారైన మాస్క్, తలపైన చేపలు, రొయ్యల్ని ధరించిన 'మత్స్య కిరీటధారిణి'



శించాయి ఈ టోపీలు. మోడల్స్‌ను విశేషంగా ఆకర్షిస్తున్న ఈ విచిత్ర టోపీలకు రూపకల్పన చేసింది ఆస్ట్రేలియాకు చెందిన 'అన్నేటిల్బి'.

మోడల్‌గా పనిచేసిన 'అన్నే' ఆ వృత్తిలో ఓ నూతన ప్రక్రియను ఆవిష్కరించాలనే ఉద్దేశ్యంతో లండన్‌లోని 'సెంట్రల్ స్కూల్ ఆఫ్ ఆర్ట్ అండ్ డిజైన్' సంస్థలో ఫౌండేషన్ కోర్సును పూర్తి చేసింది. తర్వాత పాలిటెక్నిక్ కాలేజీలో తనకత్యంత ప్రీతి పాత్రమైన 'మిక్స్‌డ్ మీడియా' కోర్సు చేస్తున్నపుడు ఆహార పదార్థాలతో టోపీలు, ఉడుపులు రూపొందించాలనే ఓ సరికొత్త ఊహ ఆమెలో మెదిలింది. వెంటనే తన ఊహకు ఓ రూపాన్ని కల్పించి ఫైనల్ ఇయర్ 'డిప్లమాషో'లో ప్రదర్శనకు పెట్టింది. ఆ ప్రదర్శనలో ఆమె తన మిత్రుడైన ఓ మెజీషియన్ తాలూకు నిలువెత్తు చిత్రాన్ని పళ్లు, బిస్కట్లు, బ్రెడ్, కేక్ వంటి వాటితో అలంకరించి, అధ్యాపకుల్ని సహాధ్యాయుల్ని ఆశ్చర్యంలో ముంచెత్తింది.

ఆహార పదార్థాలతో వివిధ రకాల టోపీలు, గౌనులు తయారుచేయటం మొదట్లో అనేక విమర్శలకు గురి అయ్యాయి. అయినా తర్వాత తర్వాత విమర్శించిన వారే వాటి అందానికి ముగ్ధులై ప్రశంసలు కురిపించారు. ఆధునిక ప్రపంచం ఆమె వినూత్న కళను చేతులు చాచి ఆహ్వానించింది. అన్నే కలలు ఫలించాయి.



బీన్స్‌తో అల్లిన టోపీ, పచ్చని ఆకులతో చేసిన గౌను బఠాణీలతో హారాలు ధరించిన 'పత్రహరిత సుందరి'



బ్రెడ్డు ముక్కల్నే గౌనుగా బిస్కెట్లనే హారాలుగా ధరించిన అతివ

# చెత్త కొత్తిబ

## మర్యాద పాఠాలు

సోఫాలో కూర్చుని ఆరోజు పేపర్ సీరియస్‌గా చదువుకుంటున్న నేను 'దభీ'మని టీపాయ్ మీద ఏదో పడడంతో ఉలిక్కిపడి తలెత్తిచూశాను. ఎదురుగా నిలబడి ఉన్నాడు శివుడు! వాడి ముఖం ఎప్పటిలాగే ధుమధుమలాడుతూనే ఉంది.

టీపాయ్ మీద చూద్దునుగదా ఓ అందమైన పాకెట్.

''పాండురంగం పంపాడా?'' పాకెట్ చేతిలోకి తీసుకుంటూ అడిగాను.

'ఊఁ...'' మూలిగినట్టుగా అన్నాడు శివుడు.

పాకెట్ విప్పుతూనే నా ముఖం వెయ్యివోల్టుల బల్బులా వెలిగిపోయింది. అందులో నాకెంతో యిష్టమైన, నేనెప్పట్నుంచో కావాలనుకుంటున్న 'ఎలక్ట్రానిక్ ఫారెన్ షేవింగ్ సెట్' ఉంది.

పాండురంగం టూర్ వెళ్ళినప్పుడల్లా నాకోసం ఏదో ఒకటి మరిచిపోకుండా తెస్తుంటాడు. డబ్బివ్వబోతే, 'అది నా గిఫ్టురా... డబ్బిచ్చి మన ఫ్రెండ్‌షిప్‌ని అవమానించకు' అంటూ సున్నితంగా తిరస్కరిస్తాడు. ఆ రకంగా పదిపదిహేను రోజులకొకసారైనా ఏదో ఒక విలువైన వస్తువు 'గిఫ్ట్' రూపంగా వాడినించి నాకందుతూనే ఉంటుంది. ఈ కలికాలంలో కూడా ఇలాంటి ఫ్రెండ్ నాకు దొరకడం నిజంగా నా అదృష్టమేననాలి.

ఆనందంతో నా హృదయం నిండిపోయింది.

తలెత్తి శివుడివంక చూసి చిరునవ్వు నవ్వాను.

వాడి ముఖం ముటముటలాడుతోంది. కనీసం మర్యాదకోసం కూడా చిరునవ్వు నవ్వలేదు. నాకెందుకో మనసు చివుక్కుమంది. అసలు శివుడితీరే అంత! చాలా పొగరుబోతులా బిహేవ్ చేసే ఈ కుర్రవెధవని పన్లోపెట్టుకున్నందుకు అసలు మా పాండురంగం గాడినే నిందించాలిముందు. టూర్‌నుంచి వచ్చిన మర్నాడే తను అలసటగా ఉండడంవల్ల కాబోలు సాధారణంగా ఎప్పుడూ వీడితోనే 'గిఫ్ట్ పాకెట్లు' పంపుతాడు వాడు. అయినా వాడెంత ఆప్యాయంగా పంపుతాడో వీడంత 'రఫ్'గా నా ముఖాన వాటినికొట్టి పోతుంటాడు. మంచీ మర్యాదా ఉండదు. ఏమన్నా అందామా అంటే కుర్రవెధవ... పట్టుమని పదహారేళ్ళయినా లేవు. అదీగాక వాడు మా సొంత నౌఖరేం కాదుగదా?...

''నే పోతున్నా!'' ఖంగున మ్రోగిన శివుని కంఠం నా ఆలోచనలకి బ్రేక్‌వేసింది.

పసివెధవ! వీడికి మనమన్నా కొంచెం మంచీ మర్యాదా నేర్పిద్దాం అన్పించడంతో ''ఒరేయ్ శివా... పెద్దవాళ్ళతో ఇలాగేనా వ్యవహరించేది? వినయంగా, విధేయంగా ఉండాలి. అణకువగా మాట్లాడాలి. అప్పుడు నిన్నంతా బుద్ధిమంతుడు అంటారు. లేకపోతే 'రౌడీవెధవ' అంటారు...''

శివుడేం మాట్లాడలేదు. కోపంగా చూశాడు.

ముఖపత్ర చిత్రం యం.రమేష్

''అలా కోపంగా చూడకు. నువ్వు చిన్నపిల్లాడివి. పద్ధతిగా ఎలా ఉండాలో నేను నేర్పిస్తాను. కాసేపు నువ్విలావచ్చి నా స్థానంలో కూర్చో! నువ్వెలా మాట్లాడాలో నేను నటించి చూపిస్తాను'' అన్నాను.

శివుడు ఠీవిగా వచ్చి సోఫాలో కూర్చుని పేపర్ చూస్తున్నట్లు నటించడం మొదలెట్టాడు.

నేను అప్పుడే బయటనుంచి వచ్చినవాడిలా వచ్చి, వాడి ఎదుట చేతులుకట్టుకుని వినయంగా నిలబడి, ''అయ్యగారూ నమస్కారమండీ'' అన్నాను.

బడి దాన్నింత దూరం నా కోసం మోసుకొచ్చావ్. ఇంద ఈ పది రూపాయిలు పెట్టి సినిమా చూడు...'' అంటూ నా చేతిలో కరెన్సీ నోట్ పడేసినట్లు నటించాడు.

ఆ దెబ్బతో నాకు దిమ్మతిరిగిపోయింది. నేనింకా తేరుకోకముందే

''ఉండవేయ్! కొంచెం కాఫీ తాగిపోయివ్ గాని....'' అని నాతో అని కిచెన్‌వైపు చూస్తూ ''ఏమేవ్ శివుడొచ్చాడు. ఓ కప్పు కాఫీ పంపు'' అంటూ ఆర్డర్ జారీ చేశాడు.

అప్పటికిగానీ నా తప్పు నాకు తెల్సిరాలేదు.




వెంటనే వాడు నేనూహించని విధంగా, ''ఆ నమస్కారం! బావున్నావుటోయ్?'' అన్నాడు హుందాగా.

వాడి నటనకి నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

వాడికి మర్యాద నేర్పాలిగనుక అణకువగా, ''బావున్నానండీ, మా అయ్యగారు ప్రేమతో ఈ బహుమతిని మీకు పంపారు. దయచేసి స్వీకరించండి'' అంటూ టీపాయ్ మీద ఏదో వస్తువు పెట్టినట్లుగా నటించాను నేను.

వెంటనేవాడు తడుముకోకుండా

''అలాగా! చాలా సంతోషమోయ్... ఎండన

అంతేకాదు శివుడెందుకు చిర్రుబుర్రులాడేవాడో కూడా అప్పుడే అర్థం అయింది.

అప్పటికి ఎన్నోసార్లు బహుమతులు పట్టుకొచ్చినా నేనెన్నడూ వాడి చేతిలో కానీ పెట్టిన పాపాన పోలేదు, కనీసం ఓ కప్పు కాఫీకూడా ఇవ్వలేదుమరి!

-ప్రతాపచంద్ర

# కోరిక నెరవేరే!

లక్ష్మణరావుకి ఉద్యోగం వచ్చిందిగానీ పూర్తిగా సంతృప్తి చెందలేకపోయాడు. కారణం... పాడేరు డిపోలో పోస్టింగ్ ఇవ్వడమే. అతని స్వస్థలం అనకాపల్లి. లక్ష్మణరావు రిక్రూట్ అయింది విశాఖ డివిజన్‌లో కాబట్టి ఆ డివిజన్ పరిధిలోగల విశాఖపట్నం, అనకాపల్లి, నర్సీపట్నం డిపోలలో ఏ డిపోలో ఇచ్చినా అతడు వర్రీ కాకపోయేవాడే. మూడింటిలో ఏ




ఒక్కదాన్లో పోస్టింగ్ ఇచ్చినా లక్ష్మణరావు డైలీ అప్ అండ్ డవున్ చేయడానికి వీలుండేది. 'తలచినది జరిగినచో దైవం ఎందులకు?' అన్న సూక్తికి సరిపోయేలా లక్ష్మణరావుకి పాడేరు డిపోలో వచ్చింది ఉద్యోగం. అతని స్వస్థలానికి పాడేరు బాగా దూరం కాబట్టి అప్ అండ్ డవున్ చేయడానికి వీలుండదు. పైగా పాడేరు పూర్తిగా ఏజన్సీ. అక్కడ వాతావరణం లక్ష్మణరావుకి పడదు. అలాగని రాకరాక వచ్చిన ఉద్యోగాన్ని వదులుకోనూలేడు. బి.ఎ.లు, ఎం.ఎ.లు చదువుకొన్నా ఉద్యోగం రాక ఎంతో మంది ఏడుస్తున్న దేశంలో పదోక్లాసు చదివిన తనకి ఉద్యోగం వచ్చిందంటే అది ఆర్.టి.సి. చలవే. ఆ సంస్థ లేకుంటే తనకి గవర్నమెంట్ ఉద్యోగం రావడం అసాధ్యం. కాబట్టి ఉద్యోగం వదులుకోవడమంత తెలివితక్కువతనం మరొకటి వుండదు. ముందు ఉద్యోగంలో జాయినయి తర్వాత ట్రాన్స్‌ఫర్‌కోసం మార్గాలు వెదకడం ఉత్తమం అని ఉద్యోగంలో చేరిపోయాడు. ఎం.పి.గారిచేత రికమండేషన్ చేయిస్తే ట్రాన్స్‌ఫర్ అవుతుందని ఒక పరిచయస్తుడిని వెంటపెట్టుకుని ఎం.పి.గారి దగ్గరకి వెళ్ళాడు. సదరు ఎం.పి.గారు అయిదువేలు ఖర్చవుతుందని చెప్పించారు. లక్ష్మణరావు హడలిపోయాడు. ఈ కష్టాన్ని ఎలా అధిగమించాలా? అని విచారంగా కూర్చున్న లక్ష్మణరావుకు బ్రహ్మాండమైన ఆలోచన ఒకటి వచ్చింది.

అంతే... మర్నాటినుంచీ డ్యూటీలో కొద్దిగా బ్రాందీ త్రాగి సీసా టేబిల్‌మీదే పెట్టుకుని నిద్రపోసాగాడు. సూపర్‌వైజర్స్ అతనిమీద ఎంక్వయిరీ పెట్టి సస్పెండ్‌చేశారు!

లక్ష్మణరావు ఇంట్లోవాళ్ళు అతనిమీద కారాలు మిరియాలు నూరసాగారు. లక్ష్మణరావు మాత్రం అవేమీ పట్టించుకోకపోగా కాలరెగరేసుకొని మరీ తిరగసాగాడు.

రెండు నెలలు గడిచాయి. లక్ష్మణరావు సస్పెన్షన్ కాలం పూర్తయింది. అతనికి పనిష్మెంట్‌గా డిపార్ట్‌మెంట్ ఒక ఇంక్రిమెంట్ కట్‌చేస్తూ, అనకాపల్లికి ట్రాన్స్‌ఫర్ చేసేసింది.

లక్ష్మణరావు ఆనందానికి అవధులులేవు. అతనికి పోయిన ఇంక్రిమెంట్ విలువ మహా అయితే యాభైరూపాయలు వుంటుంది. ఎం.పి.కి అయిదువేల లంచం ఇచ్చి ట్రాన్స్‌ఫర్ చేయించుకోవడంకంటె ఇలా సస్పెండ్ అయిపోవడమే చవక - అనుకున్నాడతను.

లక్ష్మణరావు సర్వీస్‌లో ఇప్పుడు ఎలాంటి రిమార్కులు లేవు. ఎందుకుంటాయి? అతను రిటైర్ అయ్యేవరకూ అనకాపల్లి డిపోలో చేయాని కోరుకుంటున్నాడాయె. పైగా అతనికసలు బ్రాందీ అలవాటేలేదు... ఆ వాసనే పడదు.

-కొల్లిమల్ల




# ఉపవాసం

మా ఇంట్లో గంభీరమైన నిశ్శబ్దం పేరుకుపోయింది! మా నాన్నకి ఇంతలో ఏమయిందోగానీ అసలు సంగతి ఎవరికీ తెలీదు.

నిన్న రాత్రి ఆఫీసునుంచి వచ్చేవరకు బాగానే వున్నారు. ఈరోజునుంచే ప్రారంభమయింది ప్రాబ్లమ్.

అలవాటుగా టిఫిన్‌కి బదులు చేసే పెరుగన్నం తినలేదు. సర్లెమ్మని మేమంతా ఊరుకున్నాం. కానీ మధ్యాహ్నం లంచ్ కూడా చేయలేదు. ఇంట్లో ఎవరిమీధయినా అలిగారేమోనని మాలో మేము చర్చించుకున్నాం. కుటుంబసభ్యులెవరూ ఆయనతో ఏ వాదనా చేయలేదు. ఆయన ఎవర్నీ కోప్పడనూలేదు. మరి...?

ఆకలి తీసుకొచ్చే నీరస ప్రభావం ఆయన ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది. 'భోజనం చేయ'మని అమ్మ ఆయన్ని వందసార్లయినా బ్రతిమాలివుంటుంది...

'ఎందుకు భోజనం చేయనంటున్నారని?' అక్కయ్య యాభైసార్లయినా ఆయన్ని అడిగివుంటుంది... అందరికి ఆయన చెప్పే సమాధానం ఒక్కటే...! 'ఎందుకో ఈవేళ ఏమీ ముట్టబుద్ధేయలేదు' అని! ఆ మాటల్లో కొంత నాటకీయత కనుపించడం గమనించాను.

నాన్న నిరాహారదీక్ష వెనక ఏదో కారణం ఉండేవుంటుంది. ఆ కారణం తెలుసుకోవాలనే కుతూహలం ఎక్కువయింది నాకు. 'గొప్పలు చెప్పుకోవడం' కాదుగానీ మా ఫాదర్‌నుంచి ఈతరంవాళ్ళు నేర్చుకోవలసింది చాలా వుంది. ముఖ్యంగా పొదుపు విషయంలో... మా నాన్న గురించి తెలిసిన ఎవరైనా ఆయన్ని బాగా తిడతారు. స్వార్థం, పిసినిగొట్టుతనం మిళితమైన రూపమే మా నాన్నగారని వాళ్ళంతా అంటారు. కాని అదే మాపాలిట వరమయింది. ఆయనలో ఆ గుణాలు లేకపోతే ఈనాడు మాకు ఇంత ఆస్థి వుండేదికాదు అనుభవించడానికి.

"నాన్నగారూ, మీరు నీరసంగా కనిపిస్తున్నారు. మీరు అట్లా వుండటం మేం చూడలేం. మీ నిరాహారదీక్ష వెనక అసలు కారణం చెప్పనిదే ఇకనుంచి నేను కూడా పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టదలుచుకోలేదు" భీష్మప్రతిజ్ఞ లాంటిది చేసి ఆయనముందు కూర్చున్నాను.

"అబ్బెబ్బె... నువ్వెందుకురా అన్నపానీయాలు మానేయడం..." కంగారుపడ్డారు నాన్నగారు.

"మరయితే సంగతి చెప్పండి... ఎందుకీ నిరాహారవ్రతం?"




ఆయన చెప్పక తప్పిందికాదు. "ఏ... ఏ... ఏంలేదురా, రేపు ఆఫీసు స్టాఫ్ వనభోజనం అంటూ యాభై రూపాయలు బలవంతంగా వసూలుచేశారు. ఆ యాభైరూపాయలూ గిట్టుబాటు అయ్యేలా రేపు అక్కడ తినాలని ఈ ఉపవాసం..." గిల్టీగా చూపులు దించుతూ చెప్పేరాయన.

**అప్పారావు**



# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'
లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య
పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో
గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి
శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది.
''చతుర''లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి.
నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక
నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు
తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి
ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది
ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన
నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు
తుంది.

ఎడిటర్
**చతుర**
'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

చతుర

సంపుటి: 15 సంచిక: 5 జూన్: 1992

"సరిగ్గా అయిదేళ్ళలో భూమికి ప్రళయం సంభవించ బోతోంది. ప్రపంచం మొత్తం ఆ ప్రళయంలో నామరూపా ల్లేకుండా పోతుంది. ఆ దృశ్యాన్ని నేను కళ్ళారా చూడగలు గుతున్నాను..." అని కళ్ళు మూసుకుని ఆ స్వామిని చెబుతుంటే గజగజ వణికిపోయారు భక్తజనం.

ఆ నిశ్శబ్ద నిశీథిలో ఆమె కంఠం ఖంగున మోగుతుంటే వారి గుండెలు గుబగుబలాడుతున్నాయి.

"... అయితే దాన్నించి తప్పించుకునేందుకు ఒకే ఒక్క మార్గ ముంది..." అంటూ ఆమె ఓ దేవరహస్యాన్ని వారి చెవిలో ఊదింది. అప్పటికి ఊపిరి పీల్చుకోగలిగారు వారు.

ఆధునికత రాకెట్ స్పీడ్‌లో ముందంజవేస్తున్న ఈ అణుయు గంలో కూడా ఇలాంటివి బాహాటంగానే ఎలా కొనసాగిపోతున్నాయో వివరించే... వి వి న మూర్తి రచన 'ఆ మనిషి ఈ నెల 'చతుర' సమర్పణ.

# ఆ మనిషి

—వివిన మూర్తి

"మీరు నా కథ రాయాలి" అన్నాను.

మా బావగారు కుర్చీలో కూర్చుని ఏదో ఇంగ్లీషు నవల చదువు కుంటున్నారు. మా రాణికి ఆయన భర్త. విశాఖప ట్నం పోర్టులోపని. పిల్లలంతా పెరట్లో అల్లరి చేస్తున్నారు.





అమ్మా, అక్కయ్యలిద్దరూ వంటింట్లో పనుల్లో ఉన్నారు. నేను వీధిగదిలో వారగా కూర్చునున్నాను.

"నీ కథలో ఏముంది శాంతా?" అన్నారు పుస్తకంలోంచి తల ఎత్తి.

ఒక్కమారుగా దుఃఖమూ ఆశ్చర్యమూ నన్నావరించాయి.

"నా బతుకులో ఏమీలేదా? ఎన్ని కష్టాలు పడ్డాను. పాతికేళ్ళు నిండలేదు. నా యీడువాళ్ళింకా పెళ్ళీ పెటాకులూ లేకుండా హాయిగా చదువుకుంటున్నారు- నేనిలా..."

నా గొంతు గాద్గదికమయిపోయింది.

ఏడవకూడదనుకుంటాను. ఎవరిముందూ కన్నీళ్ళు పెట్టుకోకూడదనుకుంటాను. అన్నీ అనుకోడమే! ఏదీ నా వశంలో ఉండదు.

"శాంతా" అన్నారాయన శాంతంగానూ, ఇబ్బందిగానూ! సంబాళించుకున్నాను.

"ఇలాంటి ఘోరం ఎవరికయినా జరుగుతుందా నా గుండెమంట చల్లారాలి, నా కసితీరాలి. ప్లీజ్ వ్రాయండి-" అన్నాను.

ఆయన కథలు వ్రాస్తుంటారు. అవి పత్రికలలో వస్తుంటాయి. నేను చదువుతుంటాను. అర్థమౌతున్నట్లే ఉంటాయి. అర్థంకావు. ఎందుకో నేను ఎన్నడూ ఆలోచించలేదు. ఎప్పుడయినా కలిసినప్పుడు మా మేనమామ లాంటి వాళ్ళు తమ కథలు రాయమని సరదాగా అడుగుతుంటారు. నేనూ అలాగే అడిగానా? నన్నా వాళ్ళతో సమంగా జమకట్టాలా?

"దేనిమీద నీ కసి? దేనిమీద నీ గుండె మంట?" ఆయన ప్రశ్నించారు.

ఆ ప్రశ్న నాకు అర్థం అయిందనే అనుకున్నాను. మరింత ఉద్రేకంగా అన్నాను.

"నాకు జరిగిన అన్యాయం మీకు పూర్తిగా తెలును "

"తెలును"

"అయినా అడుగుతున్నారు. నా కాపురం ఎలా ముక్కలయిందీ. అయినా..." మాట్లాడుతూనే ఉన్నాను. వంచిన తల ఎత్తకుండా వింటున్నారు. ఎంతసేపు అలా మాట్లాడేదాన్నో! శంకరంగాడు వచ్చి మీదపడ్డాడు. ఛళ్ళున ఒక్కటి అంటించాను. చుర్రుమన్నట్టుంది. బాకా విప్పాడు.

"ఎందుకే అలా కొట్టేసా"వంటూ అక్క అరిచింది. "ఇదే వరస. పిల్లల్ని ఇలా కొట్టి చంపేస్తోంది" అంటూ అమ్మ అక్కతో చెప్పటం మొదలుపెట్టింది.

"ఏం చెయ్యనూ? ఈ వెధవ ఇలా బట్టల్తో వచ్చి నామీద తగలడితే విప్పలేక, అవి తడప లేక నేను చస్తున్నాను. నీకేం ఏదో కట్టి పంపిస్తావు నా మీదకి" అంటూ ఆవిడకి జవాబిస్తూనే వాడి గుడ్డలు ఊడదీశాను. బట్టలు విప్పుతూంటే వాడు మరింత బాకా పెంచాడు. పూర్తిగా విప్పి వాడిని తోసేస్తూ మరొకటి చరిచాను.

అప్పటికే లేచి నించున్న మనిషి వెంటనే వాడిని ఎత్తుకున్నారు. వీపుమీద అయిదువేళ్ళూ తట్టుతేలాయి. కొబ్బరి్నూనె తెచ్చి రాస్తూ బుజ్జగించారు. వాడు మెడకి వేలాడుతూ గుండెలమీద పడుకున్నాడు. మధ్యలో వెక్కుతున్నాడు.

అంతసేపూ ఆయన్ని చూస్తున్నాను. ఆ కళ్ళలో తడివుంది.

"చిన్న దెబ్బ తగిలినందుకే అంతలా అయిపోతున్నారూ" అన్నాను.

"చిన్నదెబ్బా కొట్టావు" వీపు రాస్తూ అన్నారు.

"నాకు తగిలిన దెబ్బ మీకు బాధగా లేదు"

ఆయన సూటిగా చూశారు. నేను తలతిప్పుకుని తప్పించుకోబోయాను.

"చూడమ్మా! నేను చెప్పేది నీకెలా అర్థమవుతుందోగానీ కేవలం కష్టాలూ, కన్నీళ్ళూ సాహిత్యోపయోగంగా... అంటే... నువ్వనే కథలుగా నేను భావించను"

"అర్థం పర్థంలేని చిన్నపిల్లల ప్రేమలు పనికొస్తాయి"

"ఒక్క కథయినా నేనలాంటిది రాశానా శాంతా?" చిన్నగా నవ్వారు.

"ఏమో! నాకు గుర్తుండి చావదు" నిజానికి అంతలా గుర్తుంచుకొనేలా ఏదీ చదవలేదు. కాలక్షేపానికి చదువుతానంతే!

"నీది బాధకాదని ఎవ్వడూ అనడు. అది వ్యక్తిగత కష్టం. వ్యక్తుల కష్టాలకు కొన్ని సామాజిక కారణాలుంటాయి. వాటికి పరిష్కారం కూడా కొన్ని సామాజికమైన మార్పుల్లో ఉంటుంది. ఆ కారణాలు విశ్లేషించాలి. ఆ పరిష్కారాన్ని సూచించాలి. అందుకే నేను వ్రాశాను"

ఆయన ఏమన్నదీ నాకు అర్థంకాలేదు. సామాజిక కారణాలా? అంటే?

"అయితే నా బ్రతుకిలా అవటానికి కారణం ఏమిటి?" అయోమయంగా అడిగాను.

"అదే నా ప్రశ్నానూ"




"మీరే చెప్పండి" అన్నాను వెంటనే.

ఆయన ఇబ్బందిగా తన కుర్చీలో కదిలారు.

రెండేళ్ళుగా ఆయనని నేనలా ఇబ్బంది పెట్టాను. రాస్తానని అనలేదు. ఇప్పుడు ఆ బాధ కొంత వెనక బట్టింది. ఇన్నాళ్ళూ నేను పుట్టింట్లోనే ఉన్నాను. నాబోటి ఆడదానికి ఏముందింక? 'నీకు తెలివితేటల్లేవు" అన్న గొంతుతో మా పెద్దదినా అంది. అమ్మా వినుగేసినపుడు అంది. 'నీ కష్టాలకు నువ్వే కారణం' అని. వాళ్ళలాగా మా బావగారు ఎన్నడూ అనలేదు.

"మరీ మూర్ఖుడు లెద్దూ" అనస్తమానూ అనేది అమ్మ. "మొగుడిని బట్టే ఉంటుంది ఆడదాని బతుకు" అనేది పెద్దక్క నన్ను దగ్గరకు తీసుకుని "దేనికైనా పెట్టిపుట్టాలి" అనేది అమ్మమ్మ. ఇలా వీళ్ళంతా అన్నట్టు "నీ బాధలకు నీ మొగుడే కారణం" అనీ బావగారు ఏనాడూ అనలేదు.

నేనూ కారణమేమిటీ అని ఎప్పుడూ ఆలోచించలేదనే గుర్తు.

కారణం ఆయన చెప్పకపోయినా నాకు తెలియకపోయినా నాది బాధ కాదా? రాత్రిళ్ళు నిద్రపట్టదు. అన్నం సహించదు. సరిగ్గా జడవేసుకోబుద్ధెయ్యదు. ఒక్కోసారి ఆ సంఘటనలు గుర్తొస్తే కడుపంతా కోరేసినట్టయిపోతుంది. రాత్రిళ్ళు పిడికిళ్ళతో తల మొత్తుకోబుద్దేస్తుంది. పగలల్లా వీధిగుమ్మం దగ్గర కూర్చుని వచ్చేపోయే వాళ్ళను చూస్తుంటాను. వాళ్ళెవరో గుర్తుండదు. వీధికొసన ఏదో ఆకారం కనపడుతుంది. తేరిపార చూస్తుంటాను. అలా ఆ ఆకారం నడుచుకుంటూ ఆ కొనదాకా వెళ్ళిపోతుంది. ఒక్కో ఆకారం నవ్వుతుంది. ఒక్కోమారు నేనూ నవ్వుతాను. ఆడామగా అన్న పట్టింపు ఉండదు. ఆ వీధిలో పుట్టాను. పెరిగాను. ఎవరూ కొత్తవాళ్ళు కారు. పుట్టిళ్ళకొచ్చిన వాళ్ళు పనిగట్టుకుని మరీ వస్తారు. నేనూ వాళ్ళూ కలిసి అట్లతద్దికి ఎన్ని ఆటలు ఆడాం! సంక్రాంతికి ఎన్ని ముగ్గులు వేశాం! శివరాత్రులకు ఎన్ని జాగారాలున్నాం. వాళ్ళంతా వాళ్ళ ఇళ్ళలో సంతోషంగా వుంటారు. వెచ్చగా పడుకునుంటారు. తీరా నా దగ్గరకి వచ్చేసరికి వాళ్ళ మొహాల్లో నవ్వులు మాయం. అయ్యో అన్నట్లు చూపులు. తప్పుదన్నట్లు సానుభూతి. "చక్రం తిరుగుతుంది. నీ ఆకూ పైకి వస్తుంది అంటారు. 'ప్రతి వాళ్ళకీ ఓ పై ముంటుందే శాంతా' అంటారు. 'పిల్లల్ని చూసుకో, మనసు తిప్పుకో అంటారు. అన్నీ అన్న వాళ్ళు వాళ్ళ మొగుళ్ళతోటే లోకమన్నట్లు వెళ్ళిపోతారు. ఇలా గుమ్మం దాటగానే వాళ్ళ సినిమా కబుర్లు మొదలు. సుహాసిని గురించో, చిరంజీవి గురించో చెప్పుకుంటారు. నా దరిద్రపు మొహాన్ని వదిలెయ్యగానే వాళ్ళ కళ్ళలో వెలుతురు నిండుతుంది. మొహాల్లో నవ్వులు పండుతాయి. నేనలా వీధిగుమ్మం దగ్గరే ఉంటాను. వచ్చేపోయేవాళ్ళను చూస్తూనే వుంటాను.

మా అమ్మ అనేకసార్లు చెప్పింది.

'లోపలికి రావే'

'పిల్లలకి చద్దన్నాలు పెట్టు'

'కూర తరుగూ'

'స్నానాలు చేయించూ'

'పొడర్లు రాయి'

'బట్టలు తొడుగూ'

'అక్షరాలు దిద్దించూ'

'లెక్కలు చెప్పూ'

'ఆ బట్టలు కుట్టూ'

'యీ బట్టలు ఆరేసుకో

ఎప్పుడూ కాదన్లేదనే గుర్తు. ఎప్పుడైనా చేశాననే గుర్తు. చెయ్యకుండా ఎలా అవుతుంది. చేసేవుంటాను. కానీ అమ్మ చెయ్యలేదంటుంది. అలా డైరెక్టుగా అనదు. 'పిల్లలన్నా యినా చూసుకోకపోతే ఎలాగే?' అంటుంది. ఆదిలో ఉన్న ప్రేమ ఆఖరిదాకా ఉంటుందా? అమ్మ మారిపోయింది. అన్నింటికీ వినుగే! నాకు జవాబివ్వబుద్ధవదు. ఒక్కోమారు ఏడిచేస్తాను. దగ్గరకు తీసుకుని 'ఏదో అనేశాను. పిచ్చిదాన్ని' అంటుంది. 'ఫో! కాస్సేపు వీధిగుమ్మంలో కూర్చో! పక్కింటి శారద పురుటికి వచ్చింది. కనిపిస్తే పలకరించు' అని పంపిస్తుంది.

నా వీధిగుమ్మం, అలవాటు ఓరోజు హఠాత్తుగా తెగిపోయింది. ఎన్నాళ్ళబట్టి నాన్నగారు

అమ్మ దగ్గర వినుక్కున్నారో! ఆవిడ ఆయనకీ నాకూ చెప్పలేక ఎంత తన్నుకుందో! ఆరోజు నాకు బాగా గుర్తు.

మిట్టమధ్యాహ్నం ఎండలో చెమటలు కక్కుతూ సైకిలుమీద బియ్యం మూటతో వగురుస్తూ వచ్చారు నాన్నగారు. గుమ్మం దగ్గర నిలబడి చూస్తున్నాను. స్టాండువేసి మూటదించాలి. పాపం! పనిచేసే వయసు కాదది. తప్పటంలేదు. ఇద్దరున్నారు కొడుకులు! ఒక్కడూ ఊళ్ళో లేడు. పోనీ ఉద్యోగాలు వెలగబెడుతున్నారా? ఒకడు తాడేపల్లిగూడెంలో టాక్సీ తిప్పుతున్నాడు. ఇంకోడు పెద్దాపురంలో ఫొటోస్టూడియో నడుపుతున్నాడు. ఎవరి సంసారాలు వాళ్ళవి. ఏ పండక్కో పబ్బానికో వచ్చి పదోపరకో చేతిలో పెట్టిపోతారు. 'ఆ ఏడిసేదేదో ఇక్కడే ఈ పిఠాపురంలోనే ఏడవచ్చుగదా! ఇంటద్దయినా మిగులుతుంది. మనిషికి మనిషి ఆసరాఅవుతారు' అంటారు నాన్నగారు. 'పోన్లెద్దురూ! చాకిరీకి నామీదా తెచ్చిపొయ్యటానికి మీమీదా ఎక్కనక్కరలేదు వాళ్ళు' అంటుంది మా అమ్మ.

నేనారోజున ఆయన్ని చూసి అలా జాలిపడుతూనే వున్నాను. స్టాండు వెయ్యలేకపోతున్నారు. చటుక్కున సైకిలూ దానితోబాటు మూటా పడిపోయాయి. వీధరుగుమీద చతికలబడిపోయారు. నావేపు చూశారు. చాలా గాభరా వేసింది. కాళ్లూ చేతులూ ఆడలేదు. నోటమాట రాలేదు. ఆయనకి ఏమయినా అయితే? ఒక్క క్షణం కళ్ళు చీకట్లు కమ్మాయి. గట్టిగా గుమ్మం పట్టుకున్నాను పడిపోతానేమోనని!

ఒక్క ఊపున లేచి నా దగ్గరకి వచ్చారు "సిగ్గులేనిదానా! అలా వీధిగుమ్మం పట్టుకుని వీధిన వచ్చేపోయే మొగవెధవలను చూస్తూ యికిలించటానికి సిగ్గులేదటే నీకు. నీకిలాంటి బుద్ధులుండబట్టే నీ బతుకిలా కాలింది. ఫో! లోపలికి పోయి చావు"

ఎవరో ముళ్ళతొడుగుతో మొహంమీద చరిచినట్లయింది. ఒక్క సెకను బిత్తరపోయాను. సిగ్గుతో చితికిపోయాను. వెనక్కి తిరిగి ఇంట్లోకి పరుగెత్తాను. నా తలను గోడకేసి బాదుకుంటూ ఏడవనారంభించాను. అమ్మ వచ్చి నన్నెలా ఆపిందో తెలీదు. ఏమంటున్నానో తెలీదు. ఆవిడ ఏం అర్థం చేసుకుందో తెలీదు. ఆవిడ నాన్నగారిని వినుక్కొంటోంది. "మీకెందుకండీ! నేను చూసుకుంటాను మీ మానాన మీరుండండీ అని చెవినిల్లు గట్టుకుని పోరాను. అది మాత్రం ఏం చేస్తుంది చస్తుందా! దానికి రావల్సిన కష్టాలేనా అవి! ఇరవైఏళ్ళకే ముగ్గురుపిల్లలు! పాతికేళ్ళవకుండానే అన్నీ ముచ్చట్లూ మూలపడ్డాయి. ఎంత అపురూపంగా చూసుకున్నామూ! ఆ దెయ్యాల కొంపలో పడేశాం. తప్పు మనదీ! దాన్నెప్పుడయినా నోరు తెరవనిచ్చామా. నాలుగురోజులు పోతే అన్నీ సర్దుకుంటాయని నోరు నొక్కేశాం. తప్పు మనదీ. అదెప్పుడయినా మగాళ్ళను కళ్ళెత్తి చూసేరకమా! తండ్రయియుండీ ఏంటా మాటలు" అంటోంది.

"కన్నపిల్లల్ని కూడా అనకూడదా? అది దాని పిల్లల్ని కొట్టి చంపెయ్యటం లేదూ? ఏదో పొరపాటున ఓ మాట వచ్చింది. అందుకోసమని తలబద్దలు కొట్టుకోవాలా? అంతే ఎవరికెవరు? చేసిపెట్టాలి. బరువు మొయ్యాలి మనమిద్దరమూనూ. దాని రాతకి అదొక్కతే ఏడుస్తోందా. అంతా ఏడుస్తున్నాం. దాని ఏడుపు మనం చూస్తునాం. మన ఏడుపు అది చూడనక్కరలేదా? అయ్యో ఎండలో వచ్చాడూ. కాస్త సైకిలు పట్టుకుంటే తప్పా అనుకోవాలా లేదా? వీధి మొహం ఎరగనిదా? ఘోషా పాటించేస్తోందా... ఇలా సాగుతున్నాయి నాన్నగారి మాటలు.

ఆ తర్వాత నేను వీధిలో నించోలేదు. రాత్రింబవళ్ళు మంచం. బూజుపట్టిన పాతయింటి వాసాల్లోకి చూస్తుంటాను. పొగచూరిన పైకప్పు. తాటిదూలాలు! ముక్కకంపుబట్టలు. అన్నమానూ అవే దృశ్యాలు.

నల్లటి ఆ మనిషి. ఆ కళ్ళు. దాని కాళ్ళు. దాని ఒంటికి నలుగుపెట్టాను. చెప్పిందల్లా చేశాను. దాని తిట్లు... కంపరమెత్తిపోతుంది. ఆ బూతులు రామరామ.

శరీరమంతా ఆవేశం ఆవహిస్తుంది. నిస్సత్తువ. పడుకున్న మంచానికి మేకులతో దిగ్గొట్టేసినట్లుంది. తెంపుకుని లేచిపోవాలనిపిస్తుంది. దేన్ని తెంచుకోటం! ఈ చేతుల్నా? కాళ్ళనా? మొహాన్నా?

"ఇదంతా బాధకాదా? ఇది లోకానికి అక్కర లేదా?" రెండేళ్ళబట్టీ అడిగి అడిగి విసుగెత్తి ఆయన కనపడగానే పట్టుకున్నాను.

"నువ్వు రాయి శాంతా! అవసరమైతే మారుస్తాను" అన్నారాయన.

"నేనా?"

"అవును... నువ్వే"

"ఇష్టంలేకపోతే చెప్పండి. ఇలా వదుల్చుకోకండి"

"అదికాదమ్మా..." ఏదో చెప్పబోయారు.

"నేను మీకు లోకువగా ఉన్నాను"

"ఛ అలా ఎందుకుంటుంది? సీరియస్‌గానే చెపుతున్నాను బాధలు అనుభవించిన దానివి నీవు. నీ ఆవేశం నాకు ఉండదు. కథలకు ఆవేశమే ప్రాణం. నన్ను ఆవేశపరిచేవి వేరు. నిన్ను ఆవేశపరిచేవి వేరు. నీ కథ నేను రాయలేను. నువ్వే రాయాలి"

"మీరెంత సీరియస్‌గా చెప్పినా యస్సెల్సీ చదివిన నా మొహానికి కథలా?"

అసలు నాకు కుదురుగా పొందికగా మాట్లాట్టమే రాదన్నాను. భాష తెలీదన్నాను. వ్యాకరణం రాదన్నాను. కథ ముక్కూమొహం తెలీదన్నాను.

నేనన్నవన్నీ ఆయన కొట్టిపారేశారు.

"లోకంలో అనేకమంది గొప్ప రచయితలకి భాషలోనూ వ్యాకరణంలోనూ గొప్ప పాండిత్యం లేదు" అన్నారు.

"ఆవేశాలు నిత్యనూతనం. సమాజ పరిస్థితులు మారినప్పుడల్లా ఆవేశాలు మారుతూనే వుంటాయి. వాటి వ్యక్తీకరణకోసం భాష మారుతూనే ఉంటుంద"న్నారు.

"వ్యాకరణం నేర్చుకున్నాక మాట్లాట్టం నేర్చుకున్నావా నువ్వు? నువ్వు మాట్లాడుతున్నట్లే రాస్తావు. నీ మాట అర్థమవుతున్నకొద్దీ అదీ ఓ వ్యాకరణమే అవుతుంది శాంతా"అన్నారు.

"కథలు రాసేవాళ్ళకి నాలుగు చేతులూ మూడు తలలూ ప్రత్యేకంగా ఉండవు. ప్రత్యేకంగా జన్మఎత్తరు. రాయి అదే వస్తుంది"అన్నారు.

ఇలా ఓమారు నాతో ఆయన వాదించారు. నన్నొదుల్చుకోటానికే ఆయన ఈ ఎత్తు ఎత్తారు. నాకామాత్రం అర్థమవుతూనే వుంది.

అయినా నా బుర్రలో ఆయన ఓ ఊహ వదిలారు. అది నన్ను దొలిచేస్తోంది. రాయాలి. నా గొడవంతా చెప్పాలి. నా బాధంతా రాయాలి. నా గుండెలో నున్నదంతా కక్కాలి. నేను పడిన అవమానాలు అన్యాయాలూ రాసితీరాలి.

కానీ ఎలా? ఎక్కడ మొదలుపెట్టాలి? ఎక్కడ? ఎక్కడ? నా పుట్టుకతోటా? పెంపకంతోటా? పెళ్ళితోటా? కాపురంతోటా? ఆ మనిషిని గూర్చి వినటంతోటా? చూడటంతోటా?

"నీ ఇష్టం" అన్నారు బావగారు.

"పుట్టుక, పెంపకం, కాపురం వీటికీ ఆ మనిషికీ సంబంధముందా?"

ఆయన నవ్వారు "నువ్వు రాయి"



**మా**ది పండూరు. ఉండేది పిఠాపురం.

మా నాన్నగారు గోవిందరాజు. సుగర్‌మిల్లులోపని. నాకు ఇద్దరు అన్నలు. పెద్దన్నయ్య సత్యనారాయణ. పెద్దాపురంలో ఉంటున్నాడు. వాడి అత్తారిది కాండ్రకోట. వాడికి ముగ్గురు ఆడపిల్లలు తర్వాత ఇద్దరు మగపిల్లలు. మా వదిన అదోరకం మనిషి. ఎప్పుడూ పేదరుపులు అరుస్తూంటుంది. అదిలేదు ఇదిలేదు అంటూ ఉంటుంది. పైగా ఆవిడకి అహంకారం జాస్తి. మా అమ్మకీ ఆవిడకీ పడదు. నోట్లో నాలుక లేనట్టుండే అమ్మని కూడా వీధిన పెడుతుంది పెద్ద వదిన. మా పెద్దన్నయ్య ఆవిడుంటే ఒకలా ఉంటాడు. లేనప్పుడు ఒకలా ఉంటాడు.

చిన్నన్నయ్యా సూర్యం. చాలా బుర్ర ఉన్నవాడు. వాడి పెళ్ళాం పైకి కనపడదు. అన్నింటికీ మొగుడుని ముందుకు తోసి తాను వెనకాల వుండి తమాషా చూస్తుంటుందని మా అమ్మమ్మ అంటుంది. మన బంగారం మంచిదయితే కంసాలిననటమెందుకూ అంటుంది అమ్మ. వాళ్ళిద్దరూ తోడుదొంగలేనర్రా అంటుంది మా పెద్దక్క. పోతే వాడు పేదరుపులు అరవడు. వాడిని ఏది అడిగినా అమీ తుమీ తేల్చడు. నానుస్తూ నా కొంపతీస్తూ అన్నట్టుంటాడు. వాడూ వాడి పెళ్ళామూ వందలకొందలు బట్టలకు తగలేస్తారు. అంతా లెక్కల ప్రకారం ఏడాదికోమారు అమ్మకూ నాన్నగారికీ బట్టలు పెడతాడు. పండగరోజు వస్తాడు. ఆరోజు ఉంటాడు. వెళతాడు. ముందొచ్చి ఇంట్లో సామానులూ గట్రా ఉన్నాయా? అని అడుగుతాడు పెద్దన్నయ్యా. తీరా లేవంటే వాడు చేసేదేం ఉండదు. చిన్నన్నయ్యా అడగడు. అడుగుతారేమో అన్నట్లు వీధరుగు పట్టు కువదలడు. అన్నీ అమ్మా నాన్నగారే చూసుకోవాలి. అదీ చిన్నన్నగాడి తంతు.

పోతే మా పెద్దక్క వాణి. దాన్ని అనపర్తి ఇచ్చారు. పెద్ద బావగారికి పొగాకు కంపెనీలో పని. ఇద్దరు మగపిల్లలు. ఓ ఆడపిల్ల. 'అతగాడికి పేకాటపిచ్చి. దానికి మొగుడి పిచ్చి' అంటుంది అమ్మమ్మ. ఇంట్లో కథాకార్యం అయినప్పుడూ పెద్ద పండగకూ వాళ్ళు వస్తారా- నా మొగుడిక్కి అది పడదూ ఇది తినడూ అని మొదలెడుతుందది. ఆయన పేకాటలో కూర్చుంటే అరగంటకోమారు కాఫీ పంపిస్తూంటుంది. కొడుకుల్లో ఒకడిని ఎప్పుడూ తండ్రి దగ్గరే ఉండమంటుంది. ఆయనకి ఏ అవసరమున్నా వాడు హాజరుగా ఉండాలిట. డ్యూటీవేసిన కొడుకు ఆ పేకాటనించి పక్కకి తప్పుకుని ఏ పిల్లల్తోనయినా ఆటల్లోపడితే చూడాలి తమాషా. డ్యూటీలోలేని రెండోవాడు వెంటనే వచ్చి అమ్మకు ఊదేస్తాడు.అది డ్యూటీ వేసిన వెధవాయిని పిలిచి నాలుగు బాదుతుంది.

"మగాడు పగలు రెక్కలు ముక్కలు చేసుకుని వస్తాడు. ఏదో కాస్సేపు ఈ వెధవ సంసారాన్ని మొయ్యాలేక రెస్టు తీసుకుంటే పిల్లలన్నాక పెళ్ళామన్నాక కనిపెట్టుకుని ఉండాలి. లేకపోతే ఆ ప్రాణి ఎలా బ్రతుకుతాడు? వెధవ చచ్చినాళ్ళు- పాడుపొట్టకు ఇంత తినేసి రోడ్లంట అలమండం తిరగటానికా నన్ను కట్టుకున్నదీ మిమ్మల్ని కన్నదీనూ" అంటూ మొదలెడుతుంది.

అమ్మ దాన్నేం అనదు. దాని సంసారం, దానిష్టం. మనమీద వాలిపోటంలేదుగదా! మనకెందుకొచ్చిన గొడవ! అన్నట్టూరుకుంటుంది. ఏడుస్తున్న కుర్రాడినీ ఏడవనివాడినీ పిలిచి యిన్ని పప్పులో, యింత బెల్లంముక్కో చేతిలో పడేసి పంపేస్తూంటుంది.

చిన్నక్కకీ పెద్దక్కకీ పడదు. అది ఊరుకోదు.

"నువ్వు బావగారిని గారాబం చేస్తున్నావు. ఆయన ఎలాగూ పనికిరాకుండా పోయాడు. నీ పిల్లల్ని కూడా ఆయన పక్కన ఏడవమంటావేం? వాళ్ళూ తగలడాలా?" అంటుంది చూసి చూసి.

"నువ్వు చిన్నదానివి. నీకేంతెలుసుననే వాగుతున్నావు? మగాళ్ళుపడే కష్టం తెలుసా? ఆడాళ్ళుండాల్సిన హద్దులు తెలుసా? సంపాదించేవాడికి స్వతంత్రం లేకపోతే వంటింట్లో ఏడిసేదానికెక్కడినుంచొస్తుందే! మగాడికేం - పుటుక్కున తెంపుకుపోతాడు. ఆ తర్వాత నీ మొహం ఎవడూ చూడడు! అడుక్కున్నా ఎవడూ పెట్టడు. పుట్టింటిమీద పడితే ఎవడూ పెట్టి పోషించడు. ఆడది ఎన్ని ఏడిసినా దాని మాట చెల్లదు. మొగుడి గడపదాటితే దానికి విలువుండదు. తెలివితక్కువ మనుషులు మొగుడిని బయటపెట్టి తాము బయటపడతారు! తెలివయినవాళ్ళు అన్నీ కప్పిపుచ్చుకుని కాపురం నిలబెట్టుకుంటారు" అంటుంది. ఒక మాటకి వంద పేరుస్తుంది పెద్దక్క. దాని మాటలకి ఓదానికీ ఓదానికీ పొంతన ఉండదు. ఈ క్షణాన అన్న ముక్క మరో క్షణానికి మారిపోతుంది.

"దీనివి మొదట్నించీ ముదినాపసాని మాటలే! అసలు దాని నోట్లో నోరుపెట్టకే అంటే వినవు నువ్వయినా" అని చిన్నక్కను పక్కకి

తీసుకుపోతుంటుంది అమ్మ.

"అది అందని కాదే నా బాధ! పిల్లల్నిలా తగలెట్టేస్తోంది - వాళ్ళేమయినా బాగువడ తారా? చూస్తున్నానుగదా - యింతలేసి లేరు. తండ్రి పక్క కూర్చుంటారా? ఏముక్క వెయ్య మంటావురా అని ఆయన అడగటమూ వాళ్ళు చెప్పటమూనూ"

"నువ్వు చెప్పింది నేను కాదంటంలేదే! ఏంచేస్తాం చెప్పు" అంటుందమ్మ.

అమ్మ ఏం మాట్లాడుతున్నా ఏదో పనిచే స్తూనే ఉంటుంది. వంటగదిలోనే మాట్లాడు తుంది. కూర తరుగుతూనో, మజ్జిగ చిలుకు తూనో, బియ్యం ఏరుతూనో, పొయ్యి మెత్తు తూనో, గిన్నెలు తోముతూనో, నీళ్ళు తేరుస్తూనో, వంట వండుతూనో ఉంటుంది. ఎవరికీ పని చెప్పదు. చేస్తే వద్దనదు.

"పోన్లేవే - మీ యిళ్ళలో మీకెలాగూ తప్ప దు" అంటుంది. మా ముగ్గుర్లో చిన్నక్కే పని మంతురాలు. దానికి చిన్నప్పట్నుంచీ అమ్మ కొంగు పట్టుకు తిరగటం అలవాటు. అమ్మ అన్నదల్లా అవుననటం దాని అలవాటు. 'అ మ్మకూచి' అంటుంది దాన్ని పెద్దక్క.

"మనం చెప్పాలి" అంటుంది చిన్నక్క.

ఈ ముక్క అంతకుముందు అనేదికాదని నా అనుమానం. 'చాలా మారిందే ఇదీ' అంటుంటుంది అమ్మ. పెళ్ళయ్యాకనే అది నేర్చుండాలి.

"అది విననీ వినకపోనీ! మనకి న్యాయంగా తోచిందీ ధర్మంగా కనిపించినదీ చెప్పా ల్సిందే" అంటుంది. అది చెప్పేవుండదు. యిది వినీవుండదు.

మా చిన్నక్క కాస్త తెలువు. అందుకనే నాన్నగారికి అదంటే ముద్దు అంటుంది పెద్దక్క. అందుకే దానికి గీరనీ అంటుంది. ఈ రకమయిన దీనుతో అది చిన్నక్కతో యుద్ధంచే సింది. అమ్మను ఏడిపించింది. దాన్ని నాకూ ఎక్కించింది. కట్నం గురించి పట్టించుకో కుండా దాన్ని పెళ్ళాడారు చినబావగారు. 'అందుకే దానికి మరీ గీర పెరిగింది. కిందుంటే వంటలూ పైనుంటే వానలూ ఉండ కుండా తయారయింది' అని పెద్దక్క బాహా టంగానే అంటుంది. దానికి జరిపినట్టు మనకి జరపలేదే శాంతా అంటుంది.

ఏమాటకి ఆమాటే చెప్పుకోవాలి. పెద్దదయి నందుకు దానికి అన్ని ముద్దు, ముచ్చట్లూ జరిగాయి. యిప్పటికీ దాన్నీ బావగారినీ పండ క్కి పిలుస్తారు. ఆనవాయితీ ప్రకారం మూడో పురుడు వాళ్ళే పోసుకోవాలి మాకలాంటి పట్టింపులు లేవండన్నయ్యగారూ అని దాని అత్తగారు అనేశారు. మావాళ్ళు బారసాలలు చేశారు. ఏడాదికేరకంగానయితేనేం నాలుగు చీరలు పెట్టారు.

నేను ఎదిగేనాటికి మా యింటి పరిస్థితి నాకు తెలుసు. అన్నయ్యల చదువులకన్నా అక్కల పెళ్ళిళ్లకీ, ముద్దుముచ్చట్లకీ ఎక్కువ పెట్టారు. నా పెళ్ళవకముందు నన్ను బతిమి లాడి పెద్దక్కకి పెట్టిన సందర్భం నాకు తెలు ను.

"అయ్యో దానికి కొనలేదా? ఎవరయినా వింటే నన్ను రాక్షసి అనుకుంటారు. అత్తారిళ్ళ ల్లో అందరికీ విలువ తగ్గొచ్చు - నాకేం తగ్గదు. నేనేం మీ పిల్లను కాదా? నాకూ మానెయ్యలేకపో యారా?" అంది అమ్మతో.

"నన్నేడిపించటానికే చేశారే శాంతా. ఇష్టం లేపోతే మానెయ్యొచ్చుగదా! అమ్మానాన్నా సంగతి నీకు తెలవదులే! సంసారమేర్పడ్డాక తెలుస్తుంది" అంది నాతో.

దాని మాటలు అమ్మా నేనూ అదెల్సాక చెప్పుకోమనా దాని ఆలోచన! ఎవరేమను కుంటేనేం! అది అనేది అనేసెయ్యడమే దాని తత్వం.

మా చిన్నక్క మా యిద్దరికన్న నదురుగానే ఉంటుందేమో! అలాంటిదేదో అమ్మకూ నాన్న గారికీ కూడా ఉందేమో! నేనలా అనుకోలేదు. తెల్లగా ఉంటేమాత్రం చామనచాయముందు దిగదుడుపేగదా! ముఖం తీరూ తెన్నూ ము ఖ్యం. నేను కాస్త పేలగానూ పొట్టిగానూ ఉంటా నట! లావుగా పొడుగ్గా ఉన్నవాళ్ళేం బావుంటా రు. గేదెల్లా ఉంటారు. నా కళ్ళు చాలా చురుగ్గా ఉంటాయని చిన్నబావగారు అనేవారు. మా రాణి ఎదురుగా ఆ మాట అనేవారు. అది ఉడుక్కోటం దాన్ని బ్రతిమిలాడ్డం!




చిన్న బావగారికి విశాఖపట్నం పోర్టులో పని. ఆ వూరు వెళ్ళినప్పుడు అక్కడ మూడు కొండలమీదనున్న గుడి, మసీదూ, చర్చి చూపించారు. ఓడలు ఎక్కించారు. సముద్రాన్ని చూసిన రోజు నేను మరిచిపోలేను. ఎంత నీరో! అంత నీరు ఒకచోట ఎలా ఉందో! అసలు గట్లు లేకుండా నీరు ఎలా ఉంటుందో! ఆ అలలు అలా ఎలా వస్తాయో! కొండమీంచి లైటు స్తంభంనుంచి వచ్చే వెలుతురు ఎంతసేపు చూసినా తనివి తీరదు. ఆ యిసకలో పరుగెడుతూంటే చల్లనిగాలి తగుల్తూంటే ఎంత బావుందో! అప్పటికి నాకు పదకొండో ఏడు! యింకా గౌనుల్లోనే వున్నాను.

"ఏమే శాంతా! ఎలా ఉందే సముద్రం" అన్నారు బావగారు.

"యిక్కడే వుండిపోవాలనిపిస్తోంది" అన్నాను.

అమ్మా, పెద్దక్కా లేరు. లేపోతే 'అలా పరుగెత్తకూడదు. యిలా కూర్చోకూడదు' అంటూ ప్రాణం తినేసేవారు. చిన్నక్కా అలాగే అనేదేమో! దానికీ పెళ్ళయిన కొత్తేమో... బావగారిముందు కొత్తగా ఉండేది. ఆ తేడా కొట్టొచ్చినట్టు కనిపించేది. అదేంటో అప్పట్లో తెలిసేది కాదు.

చిన్నబావగారికీ మా నాన్నగారికీ అస్సలు పోలిక ఉండదు. చినబావగారు ఎప్పుడూ ఆడాళ్ళతో కూర్చుని వాళ్ళు చెప్పేవన్నీ వింటుండేవారు. మా అమ్మ కొంచెం ఘోషా పాటించేది. 'అదేంటండత్తయ్యగారూ! మా అమ్మలాంటివారు. రండి! కూర్చోండి' అంటూ చనువుగా మాట్లాడేవారు. మాట్లాడించేవారు. అమ్మకు యిన్ని మాటలు వచ్చునా? యిన్ని ఆలోచనలున్నాయా అని మాకు ఆశ్చర్యం కలిగేది.

ఓరోజు నాకు బాగా గుర్తు... అమ్మ బావగారి ముందు ఏడుస్తోంది. అది ఏడుపా అంటే కాదేమో! గొంతుక కదిలిపోతోంది. కొంగు నోటికి అడ్డుపెట్టుకుని బుర్ర అటూ ఇటూ తిప్పుతోంది. నాన్నగారి గురించే ఏదో చెపుతోంది. కొన్నిరోజులముందే ఓ గొడవయింది. మా రెండో చిన్నాన్న వచ్చాడు. మా నాన్నగారికీ వాళ్ళకీ ఏవో భూములున్నాయి. తమ్ముళ్ళు అలా యిలా చేస్తున్నారని అమ్మతో అనేవారు నాన్నగారు. అయినా వాళ్ళు వచ్చినప్పుడు గారెలూ బూరెలూ వండమని ఆర్డర్లు వేసేవారు. మా అన్నయ్యలచేత దగ్గరుండి పక్కలు వేయించేవారు. కాళ్ళు గడుగు నీళ్ళనుంచి ప్రతీదీ చెప్పి చేయించేవారు. ఇంట్లో ఎంత మందున్నా అమ్మ చిన్నాన్నలు వస్తే అలిసిపోయేది. మా నాన్నగారు మంచినీళ్ళు కూడా ముంచుకుని తాగే మనిషి. అలాంటిది తమ్ముళ్ళు వస్తే తలుపు జారెయ్యటానికి గూడా అమ్మనో, మమ్మల్నో పిలిచేవారు. వాళ్ళు వెళ్ళాక ఫిర్యాదులు మొదలుపెట్టేవారు.

"ఆయన్ని ఎప్పుడయినా అడ్డానా ఆపానా నాయనా! ప్రేముంటే చూపించుకోమను! శక్తుంటే యిచ్చుకోమను! ఆడదాని వంటిమీద ఉన్న కాస్త నరుకూ ఊడ్చెయ్యటం ఏం న్యాయం? ఇంత చేసినా నాకు విలువ ఉందా? అయ్యో వదినా నువ్విలా చేసావు - అన్నమాట వాళ్ళన్నారా? నలభైఏళ్ళబట్టి కాపురం చేస్తున్నాను. వాళ్ళవాళ్ళముందు పరాయిదాన్నే యిప్పటికీ ఎప్పటికీను" అంటూ ఆరోజు ఏడిచేసింది.

చినబావగారు ఏమన్నారో గుర్తులేదు. ఏమీ అనలేదేమో! ఆయన తత్వం నాకెప్పుడూ అంతుపట్టదు. అన్నీ కావాలన్నట్టే ఉంటారు. తడీపొడిగా మాటాడతారు. అక్కడో ప్రశ్నా యిక్కడో జవాబుగా ఉంటారు. అయితే ఆయన మా పెద్దక్కను కూడా మొదట్లో మాట్లాడించేవారు. దాన్నీ దాని ధోరణినీ చూసి జడిసిపోయారేమో! ఆ తరువాత పలకరింపు మాటలు తప్ప మరేం ఉండేవికావు.

మొగుడూ పెళ్ళాం అంటే అక్కా, చిన్నబావగారూలా ఉండాలి అని ఊహ వచ్చిందగ్గర్నుంచీ అనిపించేది. నేనేం చదువుతున్నానో, ఎలా మార్కులు వస్తున్నాయో, నా ఫ్రెండ్సెవరో, వాళ్ళతో నా సమస్యలేమిటో అన్నీ అడిగేవారు. మా యింట్లో ఆడపిల్లల చదువులగురించి, వాళ్ళ సరదాల గురించి అడిగేవారెవరూ లేరు. మా అమ్మా, నాన్నా కూడా ఆడపిల్లలెలా ఉండాలని వాళ్ళనుకునేవారో మమ్మల్ని అలా ఉంచేవారు నల్లగాజులు, నల్లచీరా అంటే మా

చిన్నక్కకి చాలా యిష్టం. దాని వంటిమీద అవి బావుంటాయని ఎవరో దానితో అన్నారు. మా అమ్మమ్మ 'హవ్వ హవ్వ' అని నోరు నొక్కుకుంది. 'యింకా నయం' అంటూ అమ్మ గాభరాపడింది. నాన్నగారి దగ్గరకయినా మేం వెళ్ళకూడదు. దూరంగా నిలబడే కబుర్లు చెప్పాలి అనేది అమ్మమ్మ. అన్నయ్యలు సినిమాలు చూసొచ్చేవారుట. రాత్రిళ్ళు ఆ కథలు చెపుతుండేవారుట. మగపిల్లలూ, ఆడపిల్లలూ అలా కబుర్లు చెప్పకూడదని మా పెద్దక్కను తిట్టిపోసేదిట  చిన్నక్క నాటికి ఆవిడ గొంతూ, ధాటీ తగ్గాయి. నాకు ఊహ తెలిసేసరికి పరిస్థితి మారింది. మా క్లాసు కుర్రాళ్ళు ఎవరయినా నోట్సుకోసం వచ్చేసరికి మా పెద్దక్క అక్కడే నిలబడి వంద ఆరాలు తీసేది. వాళ్ళు వెళ్ళాక నన్ను చంపేది  'అమ్మమ్మ చూస్తేనా! చంపేసును  అన్నయ్యలతో మాట్లాడితేనే నాకు పెళ్ళిచేసేసేది. అంతే ఎవరి అదృష్టం ఎవరికొస్తుందీ' అనేది.

చినబావగారు నా చిన్ని చిన్ని సరదాలు పట్టించుకునేవారు.

'చూడమ్మా శాంతా! ప్రతిదానికీ ఉడుక్కోకూడదు! అర్థంచేసుకోవాలి' అనేవారు.

అయితే ఆయన ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్టుండేవారు. అదేంటో నాకు తెలిసేదికాదు. మా చిన్నక్కకయినా తెలుసో లేదో! చిన్నక్కతో ఆయన సరదాగా ఉంటే అందరికీ అనూయేమో అనిపించేది.

చినబావగారు మా అమ్మను మాట్లాడించటం ఎంత వింతో నాన్నగారితో మాట్లాట్టం అంతకన్న వింత. నాన్నగారు పిల్లల్నెప్పుడూ ఎత్తుకోలేదని  చాలా గొప్పగా అమ్మమ్మ అస్తమానూ చెప్పేది. 'నోళ్ళు మూసుకుని చావండి! అతనికి తెలిస్తే చంపేస్తాడు! బరితెగించిపోతున్నారు' అంటూ భయపెట్టేసేది.

ఆయన ఇంట్లో ఉన్నంతసేపూ ఆయన అవసరాలు చూడాలనేది.

ఇలా ఆయన గురించి మమ్మల్ని ఆవిడ ఎంత భయపెట్టినా నాన్నగారు మాచేత సేవలు చేయించుకునేవారు కాదు. ఏ పకోడీలో, జిలేబీలో పొట్లాలు తెచ్చేవారు. మేం నిద్రపోతున్నా లేపి తినిపించాల్సిందే! ఆయన ఎదురుగా మేం తినేవాళ్ళంకాదు. "తిన్నారా?" అని అడిగేవారు వీధిగదిలోంచే! ఉన్నంతలో మాకు లోటు లేకుండా పెంచేవారు. ఆయన్ని చూసి మేం భయపడేవాళ్ళంగాని ఏనాడూ ఆయన భయపెట్టలేదు. మా అన్నయ్యలను ఎంత దారుణంగా కొట్టేవారో నేను చెప్పలేను. వాళ్ళూ అంతే! అన్ని దెబ్బలూ తినేసి ఏదో ఒకటి పట్టుకుపోయి అమ్మేసి సినిమాలు చూసేసేవాళ్ళు. మా అమ్మమ్మ వాళ్ళను కొడుతుంటే విలవిల్లాడిపోయేది. 'అంతలా పిల్లలంటే యిష్టంలేనివాళ్ళు ఎందుకు కనాలి?' అని మా అమ్మమీద పడిపోయేది. ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టుకుని ఓ మూల కూలబడిపోయేది. అంత దారుణంగా అన్నయ్యలను కొట్టిన నాన్నగారు మమ్మల్ని ఒక్కసారి కూడా కొట్టిన గుర్తు నాకు లేదు. అయినా ఆ దెబ్బలు చూసి నేనూ, చిన్నక్కా జడుసుకుని జ్వరాలు పడేవాళ్ళం.

అలాంటి మా నాన్నగారు ఎవరయినా స్నేహితులు వచ్చినప్పుడుతప్ప ఎవరితోనూ నవ్వటం మేం చూడలేదు. రాత్రింబవళ్ళు చక్కెరమిల్లుకు అంకితమయిపోయేవారు. ఆయన చేసిన పనిని పై ఆఫీసరు మెచ్చుకున్నప్పుడో, దానిలో తప్పులు ఎంచినప్పుడో ఆయన గొంతు వినిపించేది. ఆయనకు ప్రమోషను యివ్వకుండా జూనియర్‌కి యిచ్చినప్పుడు నాన్నగారు చాలా బాధపడ్డారు. రాజీనామా యిచ్చారో యిస్తానన్నారో గుర్తులేదు. నెలపైగా అమ్మ అన్నం తిండం మేం చూడలేదు.

మా అక్కలిద్దరూ థర్డ్ఫారందాకా చదివారు. పెద్దక్క పాసయింది. చిన్నక్కది పోయింది. వాళ్ళకు వెంటనే పెళ్ళిళ్ళయిపోయాయి. అన్నయ్యలు యిద్దరూ యస్సెల్సీ దాటలేదు.

నేను యస్సెల్సీ పాసయ్యాను. అలా యిలా కాదు. స్కూలుకి ఫస్టు వచ్చాను.

ఆ రోజులు నేనెలా మరిచిపోతాను?

"వాళ్ళిద్దరూ రాత్రింబవళ్ళు చదివినా గట్టెక్కలేదు  యిది యిట్టే పాసయింది" అంది అమ్మమ్మ. ఆవిడ నేను పాసయినందుకు ఎక్కువ ఆనందపడిందో, అన్నయ్యలవి పోయినందుకు ఎక్కువ బాధపడిందో నాకు తెలియ

దు. మా అమ్మమ్మ మా యింట్లోనే ఉండేది. కోడళ్ళతో పడేదికాదు. ఆవిడ నోరు ఊరుకోదు. ఏదో అంటుంది. పడుతుంది. 'నాకు ఎవరూ లేరనుకున్నారా పీనుగుల్లారా మీ కుళ్లు కనుర్లు పడటానికి! కొడుకులు చేతగాని చవటల యితే అయ్యారు. మీరు గీచిన గీటు వాళ్ళు దాటకపోవచ్చు. నాకు కూతురూ, అల్లుడూ ఉన్నారు. నా అల్లుడు రాజా! ఫామేదా ఉన్నవా డు. నన్ను నెత్తిన పెట్టుకుంటారు వాళ్ళు. యిక్కడేదో బావేసుకుందామని వుంటున్నాను! అక్కడికే పోతాను. నాకేం లోకమంటే వెరపులే దు'' అంటూ మా యింటికి వచ్చేసేది.

ఆవిడ మా నాన్నగారిముందు ఘోషా పాటించేది. అమ్మ యింట్లోకి రాకపోతే ఆవిడ వంటచేసేది. అమ్మ వంటలయితే మాకు యిష్టం. అమ్మమ్మవి నచ్చేవి కావు. ఆవిడకి ఆనేది కాదు. అది ఒప్పుకునేది కాదు. అన్నీ మాడ్చి బొగ్గులు చేసేసేది. మా అన్నయ్యలు తినకపోతే ఆవిడ కొట్టుకుపోయేది. ''మగబిడ్డ లు రేపు సంసారాలు యీదాల్సినవాళ్లు. ఆడ పిల్లలు వచ్చి పొయ్యిమీద్ది పొయ్యిమీదే మింగే స్తారు. మీ కడుపులు చూడరు తినండ్రా'' అంటూ వడ్డించేది. 'ఛీ - అసహ్యంగా ఉంది' అని వదిలేసిపోతే ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టేను కునేది. ''చక్కగా చేసి పెట్టాను. రుచులు తెలీని పిల్లవెధవలు ఎలా బతుకుతారో రేపు'' అనేది. మా పెద్దక్క ఆవిడ మొహాన వేసి కొట్టేది. మా అమ్మ వాకిట్లో కూర్చుని నెత్తీ నోరూ మొత్తుకునేది.

''యీ మూణ్నాళ్ళూ నన్ను వీధిలో పెట్టి మీరు వీధిలో పడకండి'' అంటూ మా అప్పజె ల్లెళ్ళను బతిమాలేది.

'వాళ్ళకు కొమ్ములిస్తున్నావు. రేప్పొద్దుట ఎవ డింటికో వెళ్ళి ఒద్దికలో ఉండాల్సినవాళ్ళను తింటే తినండి పోతే పొండి భడవల్లారా అనాలి' అనేది అమ్మమ్మ.

ఏమాటకామాటే చెప్పాలి! ఆవిడ మేం తిన కపోయినా బాధపడిపోయేది. అంతా కలిసి ఆవిడ వండిన గోంగూర పప్పుని ఓసారి వది లేసాం! అసలు గోంగూర పప్పు ఎవరొండినా, ఎలా వండినా రుచిగానే ఉంటుంది. అమ్మమ్మ మాత్రం దానిలోకి ఆవేళ అలాంటి రుచి ఎలా తెచ్చిందో! నోట్లో పెట్టుకుంటే బయటకొచ్చే సేలా వండింది. మమ్మల్ని తిట్టి బతిమిలాడీ ప్రయోజనం లేకపోయింది. నాన్నగారికి ఆవిడ వడ్డించేసి తలుపువారన నించునేది. ఆయన ఆ పప్పును ఆకలిగా కంచమంతా అన్నం పెట్టుకు కలిపేసుకున్నారు. ఇంత నెయ్యి వడ్డించేసుకున్నారు. గబగబా రెండు ముద్దలు మింగి చెంబుడు నీళ్ళూ కంచంలో దిమ్మ రించేసి వెళ్ళిపోయారు. అమ్మమ్మ ఒకటే బాధ పడిపోయింది. ఆ రాత్రి కూడా ఎవరూ తినలే దు. ఆవిడా బతిమాలలేదు. ఓ రాత్రివేళ లేచి 'అయ్యో... యిదంతా నావల్లే అయిందను కుందో ఏమో ఆ పప్పును సొమ్ముచేద్దామను కుని పూర్తిగా ఎక్కించేసింది. మర్నాడు ఆవిడ అవస్థ చూడాలి. ముసలిప్రాణమేమో చావసిద్ధ మయింది. రెండు నెలలు మందులు మింగింది.

నా పరీక్ష పాసయినందుకు మా అమ్మమ్మ అలా అంటే అమ్మ మాత్రం చాలా సంతో షించింది. ''నువ్వు బంగారు తల్లివి! నీకు ఎవరో బంగారుపూలతో పూజ చేస్తున్నారు'' అంది. చిన్నక్క చాలా సంతోషిస్తున్నానని రాసింది. పెద్దక్క అదీ రాయలేదు. పెద్దన్న య్య నాకు ఓ చిన్న డిక్షనరీ కొని యిచ్చాడు. చిన్నన్నయ్య అమ్మనీ, నన్నూ సినిమాకు తీసుకె ళ్ళాడు.

మా నాన్నగారు ఏమంటారా అని నేను ఎంతో ఎదురుచూశాను. అమ్మమాత్రం నాన్నగా రు పొంగిపోతున్నారంది. ఆయన వీధిగదిలో కూర్చుంటే ఒకటి రెండురోజులు అటూ ఇటూ తిరిగాను. గుర్తుపట్టారు. ''ఏంటమ్మా?'' అన్నా రు.

''ఏంలేదండి ఏంలేదండీ'' అంటూ అక్క డనుంచి వచ్చేశాను. మా అమ్మ ఆ తర్వాత నన్ను గుచ్చిగుచ్చి అడిగింది. నేను చెప్పలేదు. ఎలా చెపుతాను? ఒక మెచ్చుకోలు నాకు కా వాలి. ఆ వయసుకే అడిగి పొందటం మరీ చిన్నపిల్లల పనని నాకు అనిపించేసింది.

మా నాన్నగారు ఓరోజు పెద్దపెద్ద కేకలతో వచ్చారు. స్కూలుకి మార్కుల కార్డులు వచ్చా యంట. నేను ఫస్టుట. దోవలో అందరూ నిలబె

స్టైయ్యటమేనట. 'రాజుగారూ! మీ అమ్మాయికి ఫస్టు వచ్చిందిట' అనడమేనట!

భోంచేసి అమ్మతో నాన్నగారు చెపుతున్నారు నాకా క్షణాలు కళ్ళకి కట్టినట్లున్నాయి. అమ్మమ్మ పెరట్లో కొబ్బరిచెట్టుకింద మంచంమీద కూర్చు నుంది. రమ్మంటోంది. పేలు చూడాలిట! 'ఫో-



నేను చూడను' అన్నాను. 'ఈ పొగరంతా వాడొచ్చి ముక్కుకి తాడు వేసి కొరడా కర్ర పుచ్చుకుంటే ఎగిరిపోతుంది' అంటూ కేకలు వేసింది. నాన్నగారు రావటంతో ఆవిడ గొంతు తగ్గింది. తల బరుక్కుంటూ సంజ్ఞలు చేస్తోంది. న్యాయానికి నేను నవ్వాలి. ఆవిడ తిట్టాలి. అమ్మ వచ్చి వినుక్కోవాలి. రెండు దొంగదెబ్బలు కొట్టాలి. అలా అవలేదు. ఆరోజు నా మనసు గాలిలో ఎగిరిపోతోంది. నాన్నగారు నా గురించి మాట్లాట్టం నాకు గొప్పగా ఉంది. స్టెతస్కోపు పెట్టుకొని తెల్లకోటు తొడుక్కుని కారులో తిరుగుతున్నట్లు కలలు!

"అందరిలోనూ ఎంత మర్యాద! ముక్కూ మొహం ఎరగనివాళ్ళు కూడా రాజుగారూ! మీ అమ్మాయికి ఫస్టుట- అనడమే" అంటున్నారు నాన్న.

ఆయన నన్ను పిలవరు. ఉక్రోషంగా ఉంది. గోళ్ళు తెగ కొరికేస్తున్నాను.

అలా నేను ఏవేవో అనుకుంటుంటే నాన్న గారి మాటలు పిడుగుల్లా పడ్డాయి.

నాకు పెళ్ళట.

సుబ్బారావు మామయ్యగారని మా చుట్టాల్లో ఒకాయన ఉన్నాడు. "ఏం పిల్లా! నీకో మొగుణ్ని చూడాలి. మాంచి దర్జాగా నాలాంటి మీసాలున్నవాడిని చూస్తాను. నాకు గారెలు చేసి పెడతావా?" అంటూ మొదలెడతాడు. మూడేళ్ళబట్టీ నాన్నగారు, "అలాగే బావా! చూడు ఎవరినయినా" అంటూండేవారు.

అయితే ఆ రోజు నాన్నగారు నిజంగానే నా పెళ్ళి ప్రయత్నాలు మొదలెడుతున్నారని విని నాకు ఏడుపొచ్చేసింది. నువ్వెందుకు చదవాలనుకున్నావంటే నిజంగానే నాకు తెలీదు. చదువంటే నాకెంత పిచ్చో చెప్పాలంటే నాకు యిప్పుడు కూడా వచ్చే కలలు చెప్పాలి. పరీక్షకి టైమయిపోతోందిట! రాత్రంతా చదువుతూనే వున్నానట. నిద్ర వదలటం లేదుట. పరీక్షా కేంద్రానికి దోవ తెలీటం లేదుట! పడిపోతున్నానట! పిచ్చిపిచ్చి కలలు!

మా అమ్మ నాన్నగారితో నెమ్మదిగా అంది 'దాన్నడుగుదాం' అని ఆయనకి చాలా కోపం వచ్చేసింది.

"అది నీమాట కాదంటుందా? నా మాట కాదంటుందా? మా కుటుంబంలో ఆడపిల్లలు పుట్టింటికి పేరు తెస్తారు కాని బరితెగించి పోరు"

నేనిక ఆయన మాటలు వినలేదు.

తలగడ కన్నీటితో తడిసిపోతోంది. ఎలాగైనా చదవాలి. కాలేజీలో చేరాలి. ఎలా? ఎలా?

ఆ తర్వాత అమ్మతో చెప్పాను. 'నాన్నగారు ఏమంటారో?' అంటూ నసిగింది. నేను వాళ్ళ మాటలు వినలేదని ఆవిడ ఆలోచన. నేను వదలలేదు. 'నువ్వు నాన్నగారితో మాట్లాడు' అన్నాను. అలాగే అంది. రెండురోజులు గడిచాయి. మా క్లాస్‌మేట్స్ కాలేజీల గురించి మాట్లాడుకుంటున్నారు.

మా చిన్నన్నయ్య వచ్చాడు, పట్టుకున్నాను. 'ఫస్టు వచ్చావు! ఎందుకు చదివించరూ' అన్నాడు. 'నువ్వు నాన్నగారితో చెప్పు' అన్నాను. వాడికీ నాన్నగారికీ సరిగా మాటలుగూడా లేవు. యింట్లోంచి పారిపోయాడు. మెకానిక్కు అయ్యాడు. టాక్సీ తిప్పుతున్నాడు. పెళ్ళాడాడు. 'నేను చెపితే చదివించేది కూడా మానేస్తారు' అన్నాడు.

'నన్ను నీతో తీసుకుపో! నీ పిల్లల్ని ఎత్తుకుంటాను. చదువు చెప్పించు' అందామనుకున్నాను. అనలేకపోయాను. వాడు అనాలనుంది. అనలేదు.

పెద్దన్నయ్యకి ఉత్తరం రాశాను. ఆవిడగారు నా ఉత్తరం అందనిచ్చిందో లేదో! ఆవిడ అమ్మని అత్తయ్యా అని పిలిచిన పాపానపోదు. "నీకు నోట్లో నాలుక లేదుకాబట్టే నీ కోడలు నెత్తికెక్కింది" అంటుంది అమ్మమ్మ. "నీకుంది గదా నీ కోడళ్ళు వింటున్నారా!" అంది పెద్దక్క ఓమారు. అమ్మమ్మ తంతు ఆవేళ చూడాలి! నా ఉత్తరానికి పెద్దన్నయ్య జవాబివ్వలేదు. తర్వాత వచ్చినపుడు "ఉత్తరం రాశావా?" అన్నాడు మొహం అదోలాపెట్టి.

అన్నయ్యలవల్ల అయేదేం లేదని తేలిపోయింది.

రెండురోజులు అన్నం మానేశాను. అమ్మ బతిమాలింది. అమ్మమ్మ తిట్టింది. చివరకి నాన్నగారితో చెప్పేసింది.

ఆయన పెద్దపెద్ద కేకలు వేశారు మా ఆడపిల్లలమీద ఎప్పుడూ కేకలు వేయలేదు. నిజానికి మేం కూడా అదికావాలి, యిది కావాలి అని ఎన్నడూ పట్టుబట్టలేదు. మా సరదాలు ముఖ్యంగా పెద్దక్కవి పూసలదండలు, రిబ్బన్లూ, జుత్తు పిన్నులూనూ! కాలికి జోడు కొనమని కూడా మేం అడగలేదు. మా సరదాలు ఉన్నంతలో మా అమ్మ తీర్చేది. బట్టలు కొంటే రంగుల కోసం మా పెద్దక్క పట్టుబట్టేది. పెళ్ళయ్యాక మాత్రం అది "యీ ముష్టిచీర కోసమా యిక్కడకు వచ్చాను" అని మొహం మీదే అనేసేది.

మానాన్నగారలా కేకలేస్తూంటే నాకు భయంతో బుర్ర పనిచేయలేదు. అసలేం జరిగిందో తెలీలేదు. ఆ కేకల్లో ఓ మాట అన్నారు.

"యిది కాలేజీకి వెళ్ళి ఏ అప్రదిష్టపనయినా చేస్తే నేనూ నా తమ్ముళ్ళూ నూతిలో





పడిచావాల్సిందే!"

ఆ మాట గుర్తొస్తే యిప్పటికీ కడుపు కోరేసినట్టుంటుంది. ఛీ! వెధవ చదువు కోసం అంత మాట పడాలా అన్న అసహ్యం కలుగుతుంది.

నేను కుళ్ళికుళ్ళి ఏడిచాను.

అమ్మ నన్ను దగ్గరకు తీసుకుంది. నేనింకా చదువుకోసమే ఏడుస్తున్నాననుకుంది. 'నాన్నగారు కోపిష్టి మనిషి. నీ మీద ప్రేమ లేదనుకోకు! చెప్పేలా చెపితే వింటారు, నాకు రాదు. చిన్న బావకి ఉత్తరం రాశాను వస్తాడు'

అమ్మకి అంత ఆలోచన ఉంటుందనుకోలేదు. ఒట్టు వేశాక నమ్మాను.

శనివారం రాత్రి చిన్న బావగారూ రాణీ వచ్చారు అక్క కూతురు లతకి రెండేళ్ళు. ఇంతంత కళ్ళు, దాన్ని మోయటం సరదాలో పడ్డాను. అమ్మమ్మను అంతకుముందే పంపేసింది అమ్మ. దాంతో నాన్నగారు ఒప్పుకుంటారని ఆశకలిగింది.

నేను ఈశ్వరుడికి కొబ్బరికాయ కొడతానని మొక్కుకున్నాను. దానికి మా వాళ్ళు ఏమీ అనరని నాకు ముందే తెలుసు.

బావగారు ఓరోజు పిలిచారు.

"చదువుకుందామని పట్టుబడుతున్నావుట అత్తయ్యగారు బాధపడతున్నారు"

నేనేం జవాబివ్వలేదు.

"మీ నాన్నగారితో మాట్లాడాను"

"ఏంటన్నారు?"

ఆయన నిట్టూర్చారు. "ఆయన బాధలు ఆయనవి"

నాకు అర్థంకాలేదు. నా ప్రశ్న ఒకటే చదువు కోవాలి. అవుతుందా?

"ఒప్పుకున్నారా?"

"చాలా మాట్లాడానమ్మా శాంతా! నీకు డిగ్రీ ఉంటే అంతకన్న ఎక్కువ చదువుకున్నవాళ్ళని తేవాలి. ఆయనకి అంతశక్తిలేదు. అదీ ఆయన మనసులో ఉన్నది"

'మీరు చెప్పించండీ' అందామన్నంత ఉద్రేకం వచ్చింది. అనలేదు. కన్న వాళ్ళూ తోడబుట్టిన వాళ్ళూ ఎత్తుకోని బరువు పైవాళ్ళు ఎత్తుకుంటారా అని అనిపించుండాలి.

"ఆయన ఏమన్నారో తెలుసా!" అన్నాను అన్నాక ఆగలేదు. మాట సాగలేదు. ఏడుపు తన్నుకొచ్చేసింది. ఎంత అడిగినా చెప్పలేదు.

అలాంటి మాట మగాళ్ళముందు అనకూడదని తెలుసు.

ఆరోజే వాళ్ళూ వెళ్ళిపోయారు. వాళ్ళతో నా ఆశాపోయింది. అయితే బావగారే చెప్పారో! మా వాళ్లకే తట్టిందో!

నన్ను టైపులో చేర్చారు.



'నువ్వు టైపులో చేరటమేంటీ' అని అందరూ ఆశ్చర్యపోయారు. మా సైన్సు మాస్టారు దేవదత్తంగారంటే పిల్లలందరికీ ఎంతో యిష్టం. ఆయన పనిగట్టుకుని నాన్నగారిని కలిశారుట. 'పెళ్ళి నేను చేయాలా మీరు చేయాలా' అని అడిగినట్లు చెప్పుకున్నారు.

మా పిఠాపురం మరీ పెద్దదికాదు. మా పేటలో వాళ్ళు ఒకరికొకరు అంతా తెలుసు. టైపుకి వెళ్తూంటే నావేపు మగాళ్ళు చూడటం తెలిసేది. ఎంత భయంవేసేదో చెప్పలేను. రోడ్డు వారనే నడిచేదాన్ని ఎవరో ఏదో అంటున్నట్లు అనిపించేది. కాళ్ళూ చేతులూ వణికేవి. అరిచేతులు చెమట పట్టేవి. మగపిల్లలు ఆడపిల్లలకు పేర్లు పెడతారని మా ఫ్రెండ్స్ చెప్పేవారు. వాళ్ళు ఛీఛీ అంటున్నట్లు చెప్పినా అలా పేర్లు పెట్టడం, వెనకాల పడటం కొందరు గొప్పగా చెప్పుకుంటున్నట్టు అనిపించేది. వెనకాతల ఎవరయినా వస్తున్నట్లు అయితే భయపడిపోయి అమ్మకు చెప్పేదాన్ని. 'రౌడీ వెధవలు పోకిరీ పిల్లల వెనకే పడతారు! నీకేం భయం' అనేది.

ఆడపిల్లలకు అమ్మకన్న దగ్గర ఎవరూ కారు. ఎన్ని భయాలు! ఎన్ని చికాకులు! ఎన్ని సందేహాలు! ఒక్కొటీ గుర్తువస్తుంటే తల్లిలేని ఆడపిల్లలు అసలు ఎలా బతుకుతారూ అని పిస్తుంది. ఇప్పుడు చచ్చిపోదామనిపించినపు డల్లా నా పిల్లలే గుర్తు వస్తుంటారు.

నా టైపు సాగుతూండగానే నా పెళ్ళి ప్రయత్నాలు మొదలయ్యాయి. మావాళ్ళు నా మొదటి పెళ్ళిచూపులకు చాలా హడావుడి చేశారు. అక్కలూ బావలూ వచ్చారు. మేనమామలూ, చిన్నాన్నలూ, అన్నయ్యలూ అంతా సరేసరి!

వాళ్ళది రాజమండ్రిట. వాళ్ళ కుటుంబం ఏమిటో గుర్తులేదుగానీ ఆ అబ్బాయి రైల్వేలో ఫైర్‌మాన్‌గా పనిచేస్తున్నాడు. అంత బాగా గుర్తుండి పోటానికి కారణం మా వాళ్ళ వేళాకోళాలు.. 'నువ్వు బొగ్గులు కొనుక్కోనక్కర్లేదు శాంతా! యిల్లంతా బొగ్గులే!' అనేవారు. 'ఆ అబ్బాయికి కోపం తెప్పించావంటేచూడు! యింజనులో ఎక్కించేస్తాడు' అనేవారు 'వీళ్ళు హనీమూన్‌కి యింజన్లో వెళ్ళిపోతారర్రా' అనే వారు. మా మేనమామలు యిలా వేళాకోళం ఆడుతూంటే నాకన్నా మా చిన్నాన్నలు ఉడికి పోయేవారు. వాళ్ళు తెచ్చారు ఈ సంబంధం. పండూరులో ఏర్పాటుచేశారు పెళ్ళిచూపులు.

మా సీతపిన్ని వరాలపిన్నీ చాలా మంచి వాళ్ళు. ఇద్దరూ ఎలమంచిలిదగ్గర వేమగిరి నుంచీ బయ్యావరం నుంచీ వచ్చారు. నేను యస్సెల్సీ పాసయ్యానుట. మా తమ్ముళ్ళనూ, చెల్లెళ్ళనూ నాలా చదువుకోమనేవారు. మా వరాలపిన్ని పాత సినిమా పాటలూ ఆడాళ్ళ పాటలూ బలేగా పాడేది. అంతా చిల్లో బొల్లో మంటూ వున్నా నాకు సంతోషంగా లేదు.

ఎదురు చూసిన రోజు వచ్చింది.

పెద్దచిన్నాన్న కన్నా రెండో చిన్నాన్న అన్నింటికీ ముందుంటాడు. రెండో చిన్నాన్న బండి కట్టుకుని రోడ్డు మీదకు వెళ్ళాడు. పెళ్ళివారు వచ్చారని వచ్చేస్తున్నారని కబురు పంపించాడు చిన్నాన్న ఎవరో ఒకతను సైకిలు మీద వస్తుంటే.

అంతా తయారయిపోయారు. నేను ఓ గదిలో కూర్చుని ఉన్నాను. దానికి సిమెంటు గచ్చులేదు. చాపమీద కూర్చుని ఉన్నాను. మా పిన్నిలు, అక్కలు నన్ను పట్టించుకుంటూనే ఉన్నారు. కాని నాకు అసలు ఏమీ అవుతున్నట్లు లేదు. అంతా అయిపోయినట్టుంది. నా పరీక్షలు, చదువూ, స్కూల్లో నేను జవాబులిస్తున్నప్పుడు మాస్టర్ల మెచ్చికోళ్ళూ, మా క్లాస్‌మేట్స్‌తో ఫస్ట్ మార్కులకోసం పంతాలు, లెక్కలు చేస్తుంటే రాని లెక్క వచ్చినప్పుడు వచ్చే సంతోషాలూ, రాని పిల్లలకు ఆ లెక్కలను విడమరుస్తుంటే కలిగే ఉత్సాహాలూ, తెలీనిదాన్ని ఇంకా ఇంకా తెలుసుకుంటే పెరిగే ఆనందాలూ... అన్నీ అయిపోయినట్టున్నాయి. మావాళ్ళ మాటలనుబట్టి నా పెళ్ళి నిశ్చయం అయిపోయినట్టే. ఊరికినే వాళ్ళు వచ్చి చూస్తారు. కుర్రాడు బుద్ధిమంతుడు. కాఫీ తాగడు. సిగరెట్టు కాల్చడు. తండ్రి ఎంత చెపితే అంత. ఆయనకి డబ్బు పట్టింపు లేదు. మంచి కుటుంబం కావాలి. పిల్లకి పనీపాటా రావాలి. వద్దులు వేయడం వస్తేచాలు. పదిమంది ఉన్న కొంపలో పిల్లయితే చాలు. అందం కొరుక్కుతింటామా, లక్షణంగా ఉండాలి అంతే! ఇలా మావాళ్ళు వాళ్లలో వాళ్ళను కుంటున్నవన్నీ నా చెవిన పడుతూనే ఉన్నాయి. ఇంకేముంది! వాళ్ళొచ్చి చూస్తారు. నన్ను తీసుకుపోతారు!

మా ఇంటి అరుగులు ఎత్తు.

బండి వచ్చి ఇంటిముందు ఆగింది. పెళ్ళి కొడుకు తండ్రిది కాస్త పెద్ద శరీరం. ఆయన దిగటానికి వీలుగా బండి అరుగుకి దగ్గరగా తిప్పారు. ఆయన ఒకాలు అరుగుమీద వేశారు. రెండో కాలు ఇంకా బండిలోనే ఉంది. ఎడ్లు గబుక్కున కదిలాయి. మనిషి గబుక్కున తూలి పడిపోయాడు.

పెద్ద దెబ్బ తగల్లేదు. కాని కాలు కొట్టుకుపోయింది. గబగబా ఆయన్ని నలుగురూ కలిపి లేవదీశారు. తీసుకొచ్చి మండువాలో కుర్చీలో కూర్చోబెట్టారు.

మా నాన్నగారు "శాంతా! శాంతా! కొబ్బర్నూనె తీసుకురా" అంటూ అరిచారు.

పరుగెత్తుకుని వెళ్ళాను.

"మామయ్యగారు పడిపోయారు. కొబ్బ





ర్నానె రాయమ్మా!'' అన్నారు. నేను రాశాను. పెద్దాళ్ళు ఏమిటేమిటో మాట్లాడుకుంటున్నారు. అంతా జరిగిన దానికి నొచ్చుకుంటున్నారు. అంతా ఆయనని పరామర్శచేస్తున్నారు.

తర్వాత నేను లోపలికి వెళ్ళాను.

అంతవరకూ పెళ్ళికొడుకు అక్కడే ఉన్నాడనుకున్నాను. అతను వీధిలో కూర్చుని ఉన్నాడు. కోపంగా ఉన్నాట్ట. అప్పుడు మా వాళ్ళు అతన్ని బతిమాలుతున్నారుట. మా పిన్నిలూ, అమ్మా వచ్చి ఆ కబుర్లు చెబుతున్నారు.

''కుర్రాడు నిన్ను చూడనంటున్నాడు. పాపం ఏం చేస్తాడూ! తండ్రి కంత దెబ్బతగిల్తే ఎవరికయినా బాధగానే ఉంటుంది'' అన్నారొకరు.

''బాధ పడకే శాంతా! ఇది కాకపోతే ఇంతకన్న మంచిది మీ బాబులు తెస్తారులే'' అంటున్నారొకరు.

''అయినా అదేం కర్మ. శుభమా అని పిల్లని చూడటానికొచ్చి అలా పడిపోవటం! ఎంత ప్రదిష్ట'' అంటున్నారింకొకరు.

కొంతసేపటికి కుర్రాడు చూడటానికొప్పుకున్నాడని పెద్దాయన దేవుడేనని మొహాలు ఇంత చేసుకుని వచ్చి చెప్పారు.

పెళ్ళి చూపులు అయాయి.

''నీపేరేంటి? ఏం చదివావూ?'' అంటూ అడిగారు. వాళ్ళ ఆడవాళ్ళెవరూ రాలేదు. నేనాఅబ్బాయిని **చూశానని** గుర్తులేదు.

వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆ తర్వాత చూడాలి! మా నాన్నగారిమీద పడిపోయారు మామయ్యలూ, చిన్నాన్నలూ. ముందెవరు మొదలుపెట్టారో తెలీదు.

''ఆడపిల్లను, పెళ్ళికూతురిని రప్పించి కొబ్బర్నానె రాయిస్తావా నీకేమయినా ఇంగితముందా! ఇన్ని రకాలు **చూశానని** చెపుతావూ'' అంటూ మొదలెట్టారు.

మామూలుగా అయితే నాన్నగారికి ఊరికినే కోపం వచ్చేస్తుంది. ఆవేళ ఆయన పెద్దగా కేకలు వెయ్యలేదు.

''తప్పేంలేదు. పెద్దాయన! వృద్ధుడు! మన పిల్లని చేసుకోనీ, మానేయనీ ఆ ప్రాణికి సేవచేసింది. ఆ మనసు సంతోషిస్తుంది.

అలాంటివాళ్ళ దీవెన చలవే మనపిల్లకి శ్రీరామరక్ష ''అంటూ కమ్ముకురాబోయారు.

మిగిలినవాళ్ళు వదల్లేదు. ''నువ్వెన్ని చెప్పు, నీది తప్పే? నీ సంగతి మాకు తెలీదేంటి? ఆడపిల్లకు పెళ్ళవదనే నీ భయం'' అంటూ వాదనకి దిగారు.

''పోనెండర్రా చాదస్తం ముండావాడిని! మనపిల్ల మన పిల్ల కాదు కదా! ఈవేళ కాపోతే రేపయినా ఈ సేవలు చెయ్యాల్సిందే. అదే సుఖపడుతుంది'' అనేశారు.

ఎక్కడి వాళ్ళం అక్కడకు పోయాం! వచ్చి మాట్లాడుకోమని ఓ వారం తర్వాత వాళ్ళ నుంచి కబురు వచ్చింది. పొంగిపోతూ మావాళ్ళ ముఠా అంతా బయల్దేరింది. చిన్నాన్నలిద్దరూ, మావయ్యలిద్దరూ, నాన్నగారూ, మధ్యవర్తీనూ.

మా అమ్మమ్మ అంతా వెళ్ళాక మొదలెట్టింది.

''ఇతగాడికి మరీ వెర్రి. ఇంత మందెందుకూ. ఎంత ఖర్చు. ఎంత ఖర్చు. వాళ్ళేమయినా పావలా పెడతారా? రాజమంత్రి వెళ్తే రెండాటలూ చూసి మరీ వస్తారు మేనమామల్ని తీసుకెళ్ళడం లోకరీతి''

అమ్మమాట తప్పించేసింది.

ఓ రాత్రివేళ తిరిగి వచ్చారు నాన్నగారొక్కరూ!

''తప్పిపోయింది, పిల్ల సుఖపడింది'' అన్నారు. అమ్మ అన్నం వడ్డించింది. అమ్మమ్మ ఆయన మాటలన్నీ విని తన వ్యాఖ్యానాన్ని జోడించి నాకు చెప్పటం మొదలెట్టింది.

''మీ బాబుకి పాలేవో నీళ్ళేవో తెలీదు. నేననుకుంటూనే ఉన్నాను. మీ చిన్నాన్నల నిర్వాకం ఏపాటిదో నాకు తెలీదా? ఆ కర్రి మొహాలు ఓ ఆడదాన్ని కూడా తీసుకురాలేదు. ఏం మనుమలో అని! మాట్లాడుకోటాన్కి రమ్మన్న పీనుగులకి కట్నాలూ, కానుకలూ నచ్చలేదు. వంకలేనమ్మ డొంకట్టుకు ఏడిచిందిట! పడిపోయాను అశుభం అన్నారంటాడు మీ బాబు! నిజమేమరి! అని కూడా అంటున్నాడు.

ఇతగాడికి లోకం తెలిసేదెప్పుడు?''

నేను ఆవులిస్తూనే అమ్మయ్యా అనుకున్నాను.

నా ఆవులింతలూ, అమ్మయ్యలూ ఎంతోకాలం నిలవలేదు. ముగ్గురు చూసి వెళ్ళాక, మావాళ్ళు మొదటి పెళ్ళిచూపులంత హడావుడి తర్వాత్తర్వాత మానేశాక ఈ సంబంధం వచ్చింది.

వీళ్ళది నెల్లిపాలెం. మా నాన్నగారూ, చిన్నాన్నలిద్దరూ, పెద్ద మామయ్యా నెల్లిపాలెం వెళ్ళారు

★ ★ ★

ఆ సాయంత్రం వాళ్ళు తిరిగొచ్చారు.

''లాభంలేదు'' అన్నాడు మామయ్య.

''బ్రహ్మాండమయిన సంబంధం'' అన్నాడు రెండో చిన్నాన్న.

మామయ్యకు వాళ్ళలో చాలా లోపాలు కనిపించాయి. ''కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళయినా ఇచ్చారుకాదు. అడిగి పుచ్చుకోవాల్సివచ్చింది. మినపసున్నిలూ, చేగోడీలూ, గట్టిపూరీలూ పెట్టారు. గట్టి పూరీలు తింటుంటే పంచదారంతా మనమొహంమీదా, పక్కవాళ్ళ మొహం మీదానూ. ఆ చేగోడీలు నమలటానికి అరగంట నోట్లో నానబెట్టాల్సివచ్చింది. ఇంటి ముందు నుయ్యీ, పశువులపాకానూ. ఆ నీళ్ళు పోటానికి ఓ కాలవా పాడూ లేవు. నీళ్ళు మురిగిపోయి వాసన. పేడవాసన. ఇంతంత దోమలు. ఆ పెద్దాయన మనిషి ఝాంకారంగానే ఉన్నా ఆవిడ ముందు లొక్కే కాబోలు గడియకోసారి లోపలికి వెళ్ళి ఆవిడతో గుసగుసలాడేవాడు. ఇంటికి గచ్చయినా లేదు. ఆ ఇల్లంతా మెత్తేసరికి, అలికేసరికి మనపిల్ల పనయిపోతుంది'' అంటూ చెప్పుకొచ్చాడు.

చిన్నాన్న అన్నాడూ

''కుర్రాడికి ఉద్యోగముంది రాజమండ్రిలో. మనిషికో అయిదెకరాలు తక్కువ కాకుండా భూముంది. ఇంట్లో గచ్చుల్లేక పోతేనేం, కరెంట్ లేకపోతేనేం. అలా గడుపుకొస్తున్నారు గనకే ఈవేళ నాలుగువేళ్ళూ నోట్లోకి పోతున్నాయి. ఇంటిగుమ్మం ఎక్కిన వాళ్ళకి మూడేసి టిఫిన్లూ, లోటాల్లాంటి గ్లాసుల్తో కాఫీలూ ఎవడిస్తున్నాడూ. పట్నాల్లో ఎవరెలా ఉంటున్నారో ఎవరికి తెలియదూ. కాఫీలు సరే మంచినీళ్ళివ్వరు. (అని మామయ్యవేపు ఓ చూపు చూశాడు) అవన్నీ అటుంచి వాళ్ళేం పరాయివాళ్ళు కాదు. వాళ్ళకీ, మనకీ తరతరాల్నుంచి సంబంధాలున్నాయి. సర్వేశ్వర్రావుగారి పినతాతకి మాపిన మామ్మ తమ్ముడి కూతుర్ని ఇచ్చారు. మా వేలువిడిచిన మేనమామకు మొదటి పెళ్ళాం ఈ సర్వేశ్వర్రావుగారికి బాగా దగ్గరిది. మన గోరింటవాళ్ళ పెళ్ళిళ్ళకి విధిగా వీళ్ళు వస్తుంటారు. ఎక్కడో తెలీని వాళ్ళకిచ్చి వాళ్ళు మనపిల్లనెలా చూస్తారో అని హడలిచచ్చేబదులు తెలునున్నవాళ్ళకిస్తేనే మంచిది''

ఇలా వీళ్ళిద్దరూ తలో రకంగానూ అన్నాక మా అమ్మమ్మ మొదలెట్టింది. ''నన్నోవరూ అడిగేవాళ్ళు లేరుగాని ఈ ముదనష్టపు సంబంధం వదలిపోటమే మంచిది''

''ఈ పల్లెటూరి సజ్జుతో మనం పడలేం'' అంది అమ్మ.

వాళ్ళిద్దరూ ఇలా వాళ్ళలో వాళ్ళు తర్జనభర్జనలయ్యారు. మా నాన్నగారు ఏమీ తేల్చలేదు.

''కట్నం ఎంతో ముందు కనుక్కో'' అన్నారు చిన్నాన్నతో.

''ఎంతయితే మాత్రం చవకలో వస్తున్నారని పిల్ల గొంతు కోస్తావా నువ్వూ?'' అంటూ మామయ్య అడ్డుతగిలాడు.

''పిల్ల గొంతు కోస్తుంటే మేం గాజులు తగిలించుక్కూర్చున్నామా! మా కుటుంబంలో వాళ్ళకి కాల్లో ముల్లు గుచ్చుకుంటే ఊరు ఊరంతా విలవిలలాడిపోతుంది. మేం పిలిచామంటే కర్రలేసుకుని తయారవుతారు మా పండూరివాళ్ళు'' అన్నాడు మా రెండో చిన్నాన్న.

''ముందు కనుక్కోనీ బావా'' అంటూ మా నాన్నగారు తుంచేశారు.

వారం తర్వాత మధ్యవర్తుల ద్వారా అందిన అంకెను మా చిన్నాన్న కార్డులో వ్రాశాడు. ఆరోజు ఫోనుచేసి మామయ్యను రప్పించారు నాన్నగారు.

''పదివేలే'' అన్నాడు మామయ్య.

నాన్నగారు తల అలా ఇలా ఊపి




"అంతకు ఒప్పించవచ్చని మావాడు రాశాడు" అన్నారు.

"నువ్వేమనుకోనంటే నామాట విను బావా! మీ తమ్ముడిని ఇందులోకి దింపకు. మనమిద్దరం వెళ్దాం. నువ్వు నోరు మెదపకుండా కూర్చో. వాళ్ళని అయిదువేలకి ఒప్పించే బాధ్యత నాది" అన్నాడు మామయ్య.

మా చిన్నాన్నను మధ్యలో వదిలేస్తే బాగోదేమోనన్నారు నాన్నగారు. ఆయన అలా తగ్గగానే మామయ్య లేచాడు.

"నువ్వుత్తి వెర్రిబాగులవాడివి" అంటూ మా చిన్నాన్నలూ, తాతగారూ మా నాన్నగారిని ఎలా చూసిందీ, ఏం చేసిందీ ఆకుకి అందకుండా పోకకి పొందకుండా చెప్పాడు.

"లోకంలో ఎన్ని చూట్టంలేదూ! మీవాళ్ళూ నువ్వూ అలా కాదనుకో. ఇంత అడగమని పైవాళ్ళని ఎగసన దోసేవాళ్ళు కుప్పలు తెప్పలు. అవీ ఇవీ చెప్పి అయిన సంబంధాలు చెడగొట్టేవాళ్ళూ ఉన్నారు. అన్నల పీకలు కోసిన తమ్ముళ్ళు లేరా? ఇవన్నీ అనుకోటమెందుకూ?" అంటూ ఆయన మాట్లాడాడు.

మా అమ్మ ఏమనుకుందో ఏమో మామయ్యను వీలు చూసుకొని చాటుకి పిలిచింది.

"ఏంటన్నయ్యా ఇది. ముందేమో వాళ్ళుత్తి పల్లెటూరి సజ్జన్నావూ?" అంది.

"బావుందమ్మా! నువ్వూ నేనూ పల్లెటూరివాళ్ళం కాదా! పల్లెటూరనేముందీ. మనుషులను బట్టి ఉంటుంది. ఆ కుర్రాడికి రాజమండ్రిలోనే కదా ఉద్యోగం. చెప్పుకునేలా చెప్పుకుంటే చెప్పినట్టల్లా వింటాడు. నువ్వెన్ని చెప్పూ పదివేలడిగారంటే ఎవరో ఒకరు ఎనిమిదివేలయినా అనకుండా అడుగుతారా? అవతలవాళ్ళు ఆ ముక్క తేలేరంటే మనమంటే వెర్రిబాగులాళ్ళంగానీ అన్నీ చూసుకోకుండా అంటారా?" అంటూ మొదలెట్టాడు. అమ్మమ్మ తందానతాన పాడిరిది. అమ్మ ఏమీ తేలలేదు.

మంచిరోజు చూసుకుని మామయ్యా, నాన్నగారూ వెళ్ళారు. వాళ్ళు పదివేలకి పావలా తగ్గేది లేదు పొమ్మన్నారు. అదీ మీకు గనక అనీ అన్నారు. మామయ్య వాళ్ళను అయిదుకో, ఆరుకో ఒప్పించేస్తానన్నాడు వెళ్ళేముందు. వచ్చాక

"అబ్బే! వాళ్ళు చాలా నిక్కచ్చయిన మనుషులు. కాలికి వేస్తే మెడకి, మెడకి వేస్తే కాలికి వేస్తున్నాడు ముసిలాయన మహాఘటికుడు. అయినా మాస్టరు ముండాకొడుకు కరణం ముందెందుకు పనికొస్తాడూ. సంబంధం రాజాలాంటిది. కానీ మనకి అందదు" అన్నాడు.

నాన్నగారు మాట్లాడలేదు.

చిన్నాన్నలకీ, నాన్నగారికీ ఈ సంబంధం విషయంలో మాటలు అనుకోపోయినా కొంచెం చెడింది. మా పిన్నిలు మాత్రం కలసినప్పుడు వదల్లేదు.

"అక్కయ్యగారు అలా ఉంటారుగానీ..." అనేశారు.

మా అమ్మ నాకు దిష్టి తీసేసి దరిద్రం వదలిపోయిందంది.

నేను కూడా ఏదో ఒకలాగా సంబంధాలు తప్పిపోవాలని చదువుకోవాలనీ వెయ్యిదేముళ్ళకు మొక్కుకున్నాను.

సరిగ్గా ఏడాది తర్వాత ఈ సంబంధం మా చిన్నాన్నలకి చెప్పిన సూర్యనారాయణగారు మా ఇంటికి వచ్చారు.

"బావా! ఆ కుర్రాడు మన కుర్రదాన్ని తప్ప మరొకర్ని చేసుకోనంటున్నాడు" అన్నాడు మంచినీళ్ళు తాగుతూ.

★ ★ ★

సూర్యనారాయణగారు వచ్చి ఈ ముక్క అనేసరికి మా నాన్నగారి మొహం చాటంతయింది. చెప్పొద్దూ. నాకూ గొప్పగానే అనిపించింది. ఆ అబ్బాయి నన్ను ప్రేమిస్తున్నాడు కాబోలు అనుకున్నాను. ఈ ప్రేమ గురించి నేను చాలా పుస్తకాల్లో చదివాను. మా ఫ్రెండ్ ఓ పిల్ల అన్నమానూ లౌలెటర్స్ వచ్చాయని చెప్పేది. అది చాలా అందంగా ఉంటుంది కాబోలని కొందరంటే దాని మొహం అది గొప్పలు చెప్పుకుంటోందని కొందరనేవారు. నేనో మాలో కాన్ని. ఎప్పుడూ చదువులూ, పరీక్షలూ గొడవ తప్పితే మరేదీ బుర్రకు ఎక్కేదికాదు.

తిరగ్గొట్టేసిన సంబంధాన్ని మళ్ళీ పనిగట్టుకుని ఎందుకు కోరుకున్నట్టూ?

మా నాన్నగారు అమ్మ దగ్గర అననే అన్నా

రు. "నువ్వెన్ని చెప్పూ వాళ్ళిద్దరికన్నా దీని కనుముక్కుతీరు బాగుంటుంది. అందుకే ఆ కుర్రాడు అన్ని సంబంధాలూ కాదని మన వెనకపడ్డాడు. అలాంటి కుర్రాళ్ళు పెళ్లాన్ని చక్కగా చూసుకుంటారు"

మా అమ్మ ఏం మాట్లాడలేదు.

ఆవిడ మనసులోమాట నాన్నగారిముందు తేలలేదు. మామయ్య కూడా నాన్నకి వత్తాసు అయిపోయాడు. వాళ్ళిద్దరు వెళ్ళి మాట్లాడుకు వస్తామన్నారు. ఆవేళ మా అమ్మ మామయ్యను చాటుకి పిలిచి చెప్పబోయింది.

"ఏంటమ్మా! నువ్వు మరీనూ- బావ మన మాట వింటాడా ఏమన్నానా? కాళ్ళ దగ్గరకొచ్చింది కాశీకెళ్ళినా రాదు. ఎవరి కర్మకి ఎవరు కర్తలూ పెళ్ళిళ్ళు మన చేతిలో ఉన్నాయా?" అంటూ మొదలెట్టాడు.

మా అమ్మ నాచేత చిన్నబావగారికి ఉత్తరం రాయించింది. చెప్పొద్దూ... నాకు అమ్మ అర్థం కాలేదు. పెళ్ళి వాయిదావేసి చదువుకోవాలని నా ఆశ. అయితే ఆ అబ్బాయి కోరీ, వేడీ అడుగుతున్నాడంటే నాకూ గొప్పగానూ, అదోలానూ ఉంది. పోనీ అమ్మ ఖాయంగా నా చదువుకోసమే ఇలా చేస్తోందా అంటే అదీ నమ్మకంలేదు. ఆవిడకి ఈ సంబంధం నచ్చలేదేమో మరి! అయితే ఎందుకు నచ్చలేదూ?

చిన్నబావగారు వచ్చిన రోజునే మామయ్యా, నాన్నగారూ, చిన్నాన్నలూ వాళ్ళ ఊరువెళ్లారు. చిన్నబావగారి ముందు అమ్మ తన మనసులో మాట అనేసింది.

"ఈయనతో పడనేపడ్డాను. నా బిడ్డాపడాలా! పెద్ద కుర్రాడు ఉన్నా లేనట్టే లెక్క. ఆ సంతంతా వచ్చి ఈ కుర్రాడిమీదే వాలిపోతుంది. పట్నంలో ఉన్నాడూ నెలకి ఇన్ని రూపాయలు కళ్ళ జూస్తున్నాడూ అని కుటుంబమంతటికీ ఉంటుంది. ఇంట్లో కథా కార్యం దగ్గర్నుంచి భూమ్మీద పెట్టుబడిదాకా ఈ కుర్రాడిమీదే పడుతుంది. అమధ్య ఓ పెళ్ళిలో వీళ్ళ గురించి చాలా విన్నాను"

చిన్నబావగారు అన్నీ విని "శాంతని అడిగారా?" అన్నారు.

"చిన్నపిల్ల దాని మొహం. దానికేం తెలుస్తుందీ?" అంది.

"అలాకాదు" అనేసి ఆ తర్వాత నన్ను పిలిచారు. నాకేం చెప్పాలో తెలీలేదు. ఎంత చనువున్నా 'ఆ అబ్బాయి నాకు బానే ఉన్నాడ'ని చెప్పలేను. అమ్మ మరీ ఇలాంటిదనుకోలేదు. సంసారాలెవరికుండవూ? బావగారికి మాత్రం బరువులు లేవూ? ఆడదన్నాక సంసారం కోసం కష్టపడద్దా' ఇలాంటి ఊహలు ఆయనతో చెప్పలేను.

"నాకేం తెలుస్తుందీ? పెద్దాళ్ళిష్టం" అన్నాను.

అలా తిప్పీ ఇలా తిప్పీ అనేక రకాలుగా అడిగారు. అన్నింటికీ నేను అదేముక్క అన్నాను.

"చూడమ్మా శాంతా! నీకేదో తెలుస్తుందని నేనూ అనుకోటం లేదు. తెలిసేదాకా ఆడపిల్లల పెళ్ళిళ్ళు తలపెట్టడం మంచిదికాదని పెద్దాళ్ళకే తెలీదు. తెలుసుకునేలా పెంచాలని కూడా తల్లిదండ్రులకి తెలీదు. కాని ఇష్టాఇష్టాలు తర్వాత్తర్వాత్త చాలా ఇబ్బందుల్ని తప్పిస్తాయి, కలిగిస్తాయి. ఆలోచించు" అన్నారు విసుగెత్తి.

ఇప్పుడనిపిస్తుంది ఆయనన్నది నిజమేనేమోనని. అమ్మకి ఇష్టం లేకపోయింది. అయినా పెళ్ళి ఆగలేదు. నాకు చదువుకోవాలనివుంది. అయినా సాగలేదు. నిజంగానే నేను ఆలోచించి చెపితే మాత్రం ఈ పెళ్ళి ఆగుతుందా? ఆలోచించడంవల్ల లేనిపోని తగవులు పెరుగుతాయిగాని. అయినా ఈనాటి నా పరిస్థితికీ ఆనాడు ఆలోచించలేకపోవటాన్కీ ఏం సంబంధం ఉందీ... నా మొహం.

ఆ రాత్రికి నాన్నగారు, మామయ్య వచ్చారు. నాన్నగారు ఒకలా వున్నారు. మామయ్య ఇంకోలా ఉన్నాడు.

నాన్నగారు అన్నారు "అంత నిలకడలేకపోవడమేమిటీ? ఎవరో పంగనామాలాయన చెప్పాట్ట ఈ పిల్లని చేసుకుంటే నీకు సిరి ఎత్తుతుంది అని. ఆ కుర్రాడు తండ్రిని తీసుకెళ్ళాడట. నాడీగ్రంథంలో అంతా ఉందిట. మన పిల్ల మూడు జన్మలనుంచీ ఆ కుర్రాడికి పెళ్ళామేనట. తండ్రి కూడా సరేనయితే అన్నా




డు. కట్నంవాళ్ళ శక్తికొద్దీ ఇస్తార్లే అని సూర్యనారాయణగారిని మన దగ్గరకు పంపాడు ఆ పెద్దమనిషి. తీరా వెళితే వెయ్యో, అయిదు వందలో తగ్గుతాంగాని మరీ సగానికీ సగమా అంటాడు ఛా! ఛా!''

మామయ్య తల అడ్డంగా ఊపుతూ, ''నువ్వు మరీ బొత్తిగా అలా మాట్లాడితే ఎలా బావా? వాళ్ళు మగపెళ్ళివాళ్ళు. అమాయకులు గాకపోతే నాడీగ్రంధం గురించీ, జ్యోతిష్యం గురించీ మనకు చెపుతారా? వాళ్ళు చెప్పారుకదా అని మరీ మనం తెగేదాకా తాడు తెంపెయ్యడం మర్యాదా కాదు''

''నువ్వనేదేమిటి? వాళ్ళ నమ్మకాల కోసం మనకు సత్తువ లేకపోయినా ఎగరాలా?''

''ఎగరాలనుకుంటే మాత్రం ఎగరగలవా బావా? నమ్మకాలు వాళ్ళవి కనుక మనం అందులోంచి లాభం చేసుకోవాలనుకోగూడదు. మనం మాత్రం మహాత్ములమా? అనుకుంటాం మరి''

''నువ్వు చిత్రంగా మాట్లాడుతున్నావు?'' అన్నారు నాన్నగారు.

''ఆయనన్నదీ నిజమే'' అన్నాడు చిన్న చిన్నాన్న. పెద్ద చిన్నాన్న మాత్రం ''మనకి ఓపికలేదు. అయ్యేదుంటే అవుతుంది. లేకపోతే పోతుంది. అంతగా ఆ మాట నిజమే అయితే పెళ్ళి మనం ఆపగలమా?'' అన్నాడు.

అలా తర్జన భర్జనలు పడ్డాక వాళ్ళంతా వెళ్ళిపోయారు.అమ్మకి సంబంధం తప్పిపోయిందో లేదో అర్థం కాలేదు. చిన్న బావగారు నాతో అన్నారు.

''ఈ నమ్మకాలు అవీ పిచ్చి శాంతా, నువ్వు అవన్నీ నిజమనుకోకు. నీ మనసు పాడుచేసుకోకు''

''ఒవేళ పెళ్ళయితే?'' అన్నాను.

''అయితే అవ్వచ్చుననుకో. అంతమాత్రాన అవన్నీ నిజమనేంలేదు. మాటవరసకి జన్మలున్నాయనే అనుకుందాం. ప్రతి జన్మలోనూ నువ్వే ఆడదానివీ మనిషివీ అవ్వాలని ఎక్కడుందీ? ఆ అబ్బాయి కూడా ఆడది అవ్వొచ్చు కదా?'' అన్నారు.

ఆయన వేళాకోళం చెయ్యడం నాకన్నలు నచ్చులేదు. నేనక్కడ నుంచి వచ్చేశాను. ఆ అబ్బాయి ఎలా ఉంటాడో నాకు గుర్తులేదు. ఫొటో కూడా లేదు.

ఆ రాత్రి నాన్నగారితో మాట్లాడారు బావగారు.

''మీరేం దిగకండి మామయ్యగారూ. వాళ్ళకంత నమ్మకముంటే వాళ్ళే దిగుతారు'' అన్నారు.

''నా దగ్గరేమయినా ఉంటేకదా దిగటానికి? నేను మాత్రం తప్పుడు పనిచేయను. మనం పెట్టుకునేది మన పిల్లకేగదా. దాని ప్రాప్తం, మన ప్రాప్తం'' అన్నారు నాన్నగారు.

అమ్మమ్మ అందీ ''ఎన్ని చెప్పు శాంతా. నీదీ జాతకమంటే. మొగుడు ఇచ్చిన విలువ ఆడదానికి మరెవరివల్లా రాదు. నీకు ఆ విలువ దొరికింది''

మర్నాడు చిన్నబావగారు తెల్లవారగట్ల బండికి వెళ్ళిపోతుంటే అమ్మ అంది ''ఇంకెందుకులే ఈ ఆలోచనలన్నీనూ. దానికర్మ దానికా కొంప ఎలాగూ తప్పదు. నిన్ననవసరంగా రప్పించాను. ఎవరూ తప్పించలేరు''

మరో మూడునెలల తరవాత మూడుసార్లు ప్రయాణాలు చేశాక మావాళ్ళు ఎనిమిది వేలకి ఒప్పుకున్నారు.

నా పెళ్ళిముందు చాలా తంతయింది.

పెళ్ళి వండూర్లోనా, అన్నవరంలోనా అన్నదానిదగ్గర మొదలయింది. ఒప్పందాలయ్యాక పెళ్ళి అన్నవరంలో చేస్తామని ఒప్పుకువచ్చారు మామయ్య, నాన్నగారూ! తీరా వచ్చాక మా చిన్నాన్నలు చాలా గొడవచేశారు.

''నువ్వు మాతో తెంపేసుకున్నావా? పూర్వోత్తరం ఇల్లు లేదా మనకు. పెద్ద పిల్లల పెళ్ళిళ్ళు అక్కడ చేయలేదా! మన ఊళ్ళో మనం రాజా! అక్కడ మనం నెగ్గుకురాగలమా? మనం నిభాయించగలమా?'' అన్నారు.

''డబ్బుంటే కొండమీది కోతి వస్తుంది. అన్నవరంలో ఉన్న అనుకూలత...'' అంటూ మొద

లెట్టాడు మామయ్య.

చిన్నాన్నలు తువాళ్ళు దులుపుకుని లేచిపో యారు.

"నీ కూతురి పెళ్ళి! మీ మేనకోడలి పెళ్ళి! మీ ఇష్టం!" అనేశారు.

వాళ్ళు పెళ్ళికి రామనేశారు.

మామయ్య ఏదో చెప్పబోతే నాన్నగారు అందర్నీ కసిరేసి బయటకు వెళ్ళిపోయారు.

కార్డు ప్రింట్‌చేయించి పట్టుకొచ్చేవరకు పెళ్ళి ఎక్కడో తెలీలేదు.

పండూర్లో పెళ్ళని కార్డు మా అత్తారికి పంపారు.

పెళ్ళి ఆగస్టు 12న.

వాళ్ళేమంటారో తెలీదు.

★ ★ ★

"మీరు చేస్తారు. అనుభవించేది మా అబ్బాయి. అన్నవరం సత్తెన్నవట్టు ఎలాంటిదో మీకు తెలియనిది కాదు. అయినా భగవంతుడు మీకిలా తోపించాడు. కానీండి! మనమేం అవలేం!" అన్నారుట మా మామగారు. ముందు ఆయన కాస్త పరుషంగానే నాన్నగారిని మాటలన్నారట. మా చిన్నాన్నలు ఇద్దరూ దోసిలొగ్గి 'తప్పు మాదే' అని ఒప్పుకున్నారట.

"మీరు బళ్ళు కట్టుకుని ఊరు ఊరంతా రండి! మా ఊళ్ళో మీకేమయినా లోపాలు జరిగితే మేం బాధ్యులం. పైచోట మేమేం నిలబడలేంకదా!" అన్నారుట.

"అయినా మొక్కులు గట్రా లేవుకదా!" అని మధ్యవర్తులు అన్నారుట. వాళ్ళకి నమ్మకమున్న పంగనామాలాయన దగ్గరకి తీసుకువెళ్ళారుట. ఆయన అంతా విని 'సత్యనారాయణవ్రతం ఎలాగూ చేసుకుంటారుగదా! పట్టుబట్టల్తో కొండకి వస్తామని మొక్కుకోండి. ఆయనా పట్టువిడువులు ఉన్న దేవుడు' అంటూ సర్దారట.

మొత్తంమీద అంతా నవ్యంగా జరిగి పెళ్ళి ప్రయత్నాలు మొదలయ్యాయి. నాన్నగారు ప్రావిడెంట్ ఫండ్‌కోసం నా పెళ్ళికార్డుతో నహా దరఖాస్తు పెట్టారు. పెద్దమామయ్య లేకుండా మా నాన్నగారికి చెయ్యి విరక్కొట్టుకున్నట్టుంది. కార్డులు వ్రాసినా కబుర్లు పెట్టినా మామయ్య రాలేదు.

నాన్నగారు అమ్మని చాలా విసుక్కున్నారు

"చెరిపేసుకుంటే అది చెరిగిపోతుందా! ఎందుకు రాకపోవాలీ!" అన్నారు. అమ్మమ్మ వచ్చి అమ్మనే తిట్టింది. 'విలువ లేకపోయాక నా కొడుకు ఎందుకు రావాలీ! మొగుడికి చెప్పుకోటం నీకు చాతకాలేదు. అతగాడిదేం తప్పుందిలే!' అంది.

ఓరోజు అమ్మ పెళ్ళిబట్టల నిమిత్తం బయలుదేరింది.

మా అన్నయ్యలు పెళ్లిసంబంధం నలుగుతున్న దగ్గర్నుంచీ వస్తూనే వున్నారు వాళ్ళని నాన్నగారు 'ఏమ్రా! ఏంచేద్దామని' అడగలేదు. అమ్మ అడిగింది. పెద్దన్నయ్య 'అలాగే! చేసేద్దాం' అన్నాడు. 'ఎలాగ?' అని అడిగితే 'నాన్నగారున్నారుకదా!' అని మొహం దించుకున్నాడు.

చిన్నన్నయ్య 'అప్పుడే దానికి పెళ్ళేంటమ్మా!' అన్నాడు. నాన్నగారితో ఆ ముక్క చెప్పరా!' అంటే- 'ఇంకా నయం!' అన్నాడు. అన్నీ సెటిలయ్యాక ఓమారు వచ్చాడు. 'ఆహా! అలాగా!' అంటూ ఉండిపోయాడు. అమ్మ అడిగిన వాటన్నింటికీ 'అలాగే! అలాగే!' అన్నాడు.

వాళ్ళేమిస్తారో, ఏంచేస్తారో తెల్సుకురావటానికి అమ్మ బయల్దేరింది. మామయ్య ద్వారా ఎక్కడయినా బట్టలకొట్లో అప్పు పెట్టి బట్టలు కొనిపించుకు రావాలని కూడా ఆవిడ ఆలోచన. ఏమనుకుందో ఏమో, నన్ను కూడా బయల్దేరదీసింది.

పెద్దాపురంలో పెద్ద వదిన చాలా కటువుగా మాట్లాడింది. 'మా దగ్గరేదో ఉందని మీ ఆలోచన. నా పిల్లలు కట్టుకున్న బట్టలు చూడండి! యీ కొంప చూడండి! మీకెలా అడగబుద్దేస్తోందో నాకు బోధపడటంలేదు! అయిన్ని అంతలా తినెయ్యదల్చుకుంటే నాకెందుకు తాళికట్టించారో చెప్పండి! అప్పు ఎవడైనా యిస్తే మాత్రం మేం తీర్చాల్సిందే కదా! అమాత్రం పెళ్ళిళ్ళు చేయలేనివాళ్ళు కనకూడదు'




అంది.

అమ్మ కళ్ళనీళ్ళు పెట్టేసుకుంది. 'నన్నిలా ఉసురుపెట్టావు! యింతకింతా అనుభవిస్తావు. నీ పిల్లలు నీకు కాకుండా పోయినా రోజున తెలుస్తుందా బాధ!' అనేసింది. పచ్చి మంచినీళ్ళు ముట్టనని బయల్దేరిపోతే అన్నయ్య ఏడిచేశాడు. మాతోబాటు బస్టాండుకి వచ్చాడు.

'అదెలాగూ ఏడిపించేస్తోంది. నువ్వు కూడా నన్నిలా అంటే నేను చావాల్సిందే. నేను చేసేది చేస్తానుగదా!' అన్నాడు హొటల్లో టిఫిను పెట్టించి.

చిన్నన్నయ్య దగ్గర కాస్త బానే అయింది. చిన్న వదిన చాలా ఆప్యాయంగా మాట్లాడింది. 'అన్నదమ్ములు చెయ్యకపోతే తోడబుట్టినదాని పెళ్ళి ఎవరు చేస్తారు! మీ చిన్నబ్బాయి చూసుకుంటారు. ఎండనబడొచ్చారు. ముందు కాస్త ఎంగిలిపడండి' అంది. అన్నాలయ్యాక 'ముందిది ఉంచు' అంటూ ఓ రెండొందలు చేతిలో పెట్టాడు చిన్నన్నయ్య.

అమ్మ దాన్ని ముట్టుకోలేదు. "నువ్వేమంటావో చెప్పు! నాన్నగారు మిగిలినది చూసుకోవాలిగదా!"

"ఏం - అన్నయ్యేమన్నాడూ?"

చెప్పింది అమ్మ.

"అలా అన్నాడా! నువ్వు మరీనూ వదిన బుద్ధి నీకు తెలీదా? ఎదురుగా నిలబెట్టి అడుగుతావా?" అన్నాడు.

"ఏంచేస్తాన్నాయనా! పిల్లలు పెళ్ళిళ్ళయ్యాక పిల్లలు కాదని ఎరక్కపోతిని! అందుకే మీ పెళ్ళాలముందే అడుగుతున్నాను" అంది.

"మీకు బుద్ధుల్లేవండీ! నడుం కట్టుకుని అన్నీ చేయాల్సినవాళ్ళు మీరు. రేపో, ఎల్లుండో వెళ్ళి మీ అన్నదమ్ములిద్దరూ కూడబలుక్కోండి. ఆయనకి చెప్పేలా చెపితే వినరేంటి? అక్కయ్యగారు కూడా మాటతీరువ అలా ఉంటుందిగానీ మనసు మంచిదే! పెద్దాళ్ళిద్దరికీ పెద్దాయనే చూసుకున్నారు! ఈ పిల్లని చూసుకోటం మీకు న్యాయం! పోనీ మీ అన్నయ్యకి చెప్పి ఆయన అన్నదానిమీద అంతో యింతో మీ చేతిది వేసి పెళ్ళి జరిపించటం మీ ధర్మం" అంది.

"బావుంది! పెద్దాడు వాడుండగా నేనేంచేస్తానూ" అన్నాడు చిన్నన్నయ్య.

"ఎవరయినా వింటే చెప్పుచ్చుకు కొడతారు! ఎవరు పూనుకుంటే వాళ్ళే పెద్దాళ్ళు. రేపు బయల్దేరండి. మీరు వెళ్ళి తతిమ్మా పనులు చూడండి. అత్తయ్యా... నేను పంపిస్తాన్లెండి" అంది మా చిన్నవదిన. అలా అంటుంటే యిష్టంలేని మంచిమాట వింటున్న మొహం పెట్టాడు చిన్నన్నగాడు.

"అవునోసే శాంతా! నువ్వెందుకే మీ అమ్మగారి వెంటబడ్డావూ?" అని అడిగింది.

"అమ్మ రమ్మంది" అని అంటున్నాను. అమ్మ కంగారుగా అంది

"ఏం లేదూ! పెళ్ళిబట్టలు కొనాలిగదా! తోడుంటుందని తీసుకువచ్చాను"

"ఏం మనుమలోపెంటో! చెల్లి మొహమయినా చూసి కరగకపోయారు బావగారు!" అంది. అమ్మ మొహం చిన్నదయిపోయింది. ఆరోజుకి బలవంతంగా ఉంచేసింది చిన్నొదిన. ఆ రాత్రి అమ్మ సరిగ్గా అన్నం తినలేదు. ఓ రాత్రివేళ ఆవిడ ఏడుస్తున్నట్లు అనిపించింది నిద్రమత్తులో. నిజమో, కలోమరి!

అమ్మను చూసి కాకినాడ్లో మా పెద్దమామయ్య మొహం యింతయిపోయింది.

నిన్ను పెళ్ళికి తీసుకెళ్ళటానికి వచ్చానంది అమ్మ. నన్ను నువ్వొచ్చి పిలవాలిటే అన్నాడు మామయ్య. అమ్మ నానా మాటలూ అంది. "ఏమోరా! యిన్నాళ్ళూ మనమధ్య అలాంటి పట్టింపులు లేవనుకున్నాను. నీ బావగారు నీకేం కొత్తా! అటు వాళ్ళు పీకేస్తుంటే ఆయన మాత్రం ఏంచేస్తారూ!"

"నువ్వు పెళ్ళికి రావటం కాదు. బుట్ట మొయ్యటం కాదు. అవి ఎలాగూ తప్పవు. వంటదగ్గర్నుంచి ప్రతిదానిదగ్గరా నువ్వు నిలబడకపోతే అవదు. బూరెలు మూకుట్లోంచి మూకుట్లోనే మాయం. మా యిల్లు మా యిల్లు అని వాళ్ళు మీదపడి పోతారుగాని కంజాయింపూ వల్లకాడూ ఉండదు. ఉత్తి పల్లెటూరి సజ్జు. యింతకింత అవుతుంది. నువ్వొరగనిదే ముందీ" అంది.





మామయ్య గురించి ఏమాటకామాటే చెప్పుకోవాలి.

చెల్లెలంటే ఆయనకి చాలా ఆపేక్ష. ఆయనకీ అంత పెద్ద ఆస్తీ పాస్తీ లేవు., సెకండరీ గ్రేడు మాస్టారు. రకరకాల వ్యాపకాలు. ఆయన పొద్దుటే కాకీపాంటూ, షర్టూ వేసుకుని స్కూలు పిల్లల్ని పోగేసి డ్రిల్లూ అదీ చేయించేవాడు. దాన్ని రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ అంటారట. అందరినీ కూర్చోబెట్టుకుని శివాజీ, రాణా ప్రతాప్లూ మొదలైన వాళ్ళగురించి కథలూ అవీ బలే చెప్పేవాడు. ఆయన చెబుతూంటే మేం రాత్రిళ్ళు నిద్రోయేవాళ్ళంకాదు. మమ్మల్ని సినిమాలకూ గట్రా నిద్రోతున్నా లేపి రెండో ఆటకు తీసుకెళ్ళేవాడు. రాత్రి పదివరకూ ప్రైవేట్లూ, తిరుగుళ్ళూనూ! పాపం! ఆయన్ని ఎమర్జన్సీలో జైల్లో పెట్టారట! ఆయన ఏదో పత్రిక నడిపి రహస్యంగా యిళ్ళలో పడేయించేవాట్ట. ఆయనకి పిల్లా జెల్లా లేరు. మా చిన్నమామయ్య కొడుకు రాజుగాడిని ఈమధ్య పెంచుకున్నాడు. మా అత్తయ్యగారు కూడా చాలా ఫామేదా అయిన మనిషి. అమ్మమ్మకీ, ఆవిడకీ పడదుగాని అమ్మన్నా మేమన్నా ఆవిడకి చాలా అభిమానం. చేతికి ఎముక లేకుండా పెడుతుంది. సంవత్సరానికొకమారు పుట్టపర్తి వెళ్తారు. సినిమాలు చూస్తారు. మా అమ్మదీ ఆవిడదీ చాలా మంచి స్నేహం.

పెద్దమామయ్య అమ్మనూ నన్నూ తీసుకెళ్ళి బట్టలకొట్లో బట్టలు అరువు యిప్పించాడు. నువ్వేం కంగారుపడక అంటూ ధైర్యం చెప్పాడు. మా చిన్నమామయ్య బాలాజీ చెరువుదగ్గరుండేవాడు. పెద్దమామయ్యావాళ్ళూ పిండాల చెరువు వెనకాతల త్రిపురసుందరి గుడి పక్కన వుండేవాళ్ళు. చిన్నమామయ్య నా యింటికెందుకు వస్తావులే అని నిష్ఠూరమాడాడు. ఓ వెయ్యి రూపాయలు యిచ్చి మీ వదినతో అనకు - అన్నాడు. ఆయనకి తాలూకాఫీసులో పని. వాళ్ళింట్లో మాకు అస్సలు చనువుండేది కాదు. సెలవులకి పెద్దమామయ్య దగ్గరే ఉండేవాళ్ళం. ఓపూట వెళ్ళి చూసొచ్చేవాళ్ళం. చిన్నత్తయ్య మమ్మల్ని రానిచ్చేదికాదు.

మా అమ్మా, నేనూ పిఠాపురం చేరుకున్నాం!

నాన్నగారు నానా అవస్థలూపడి అన్నరోజుకో వారం తర్వాత డబ్బులు కుదుర్చుకుని మామయ్యతో వెళ్ళి యిచ్చొచ్చారు.

వాళ్ళు పల్లకీ కుదర్చమన్నారని మా అమ్మ మొహం యిలా పెట్టుకుంది. ఎక్కడన్నా చిన్నపిల్లలకి పల్లకీలు! యిదేం సజ్జే తల్లీ! అంది.

మనకెందుకు లెస్తూ అన్నారు నాన్నగారు. మామయ్య వచ్చాక ఆయనకి సగం బలం వచ్చేసింది. పెళ్ళిప్రయత్నాలు ముమ్మరమయ్యాయి.

వారంరోజులముందే మేం పండూరికి చేరుకున్నాం. మూడురోజుల ముందు పెద్దమామయ్యావాళ్ళు ఓ రోజుముందు చిన్నమామయ్యావాళ్ళూ వచ్చారు.

"ఎక్కడ పనులు అక్కడే ఉండిపోయాయి. విఘ్నేశ్వరుడు బియ్యమయినా మీదు కట్టలేదు" అన్నాడు పెద్దమామయ్య నడుం బిగిస్తూ.

"ముందు రావొద్దన్నామా బావగారూ" చిన్నాన్న అన్నాడు.

ఆగస్టు 11 మధ్యాహ్నం వాళ్ళ బళ్ళకోసం అంతా ఎదురుచూస్తున్నాం.

★ ★ ★

పదవకుండా బళ్ళు కట్టుకుని రోడ్డుమీదకు వెళ్ళారు. మగపెళ్ళివారు ముందన్నట్టుగా ట్రాక్టరుమీద వస్తామన్నారు. దగా అయిందిట. పొద్దుట టిఫిన్లూ కాఫీలు అయ్యాక బయల్దేరుతామన్నారు. డైరెక్టు బస్సయితే మూడు గంటలు పడుతుంది. బస్సు మారితే నాలుగయిదు గంటలు పడుతుంది. 11 గంటలకు రావాలి. పన్నెండు దాటిపోయింది. ఒంటిగంట కూడా అవొస్తోంది.

ఇక్కడ వంటలయిపోయాయి. గాడిపొయ్యి దగ్గర పెద్దపులిలా ఉన్నాడు పెద్దమామయ్య. వండినవన్నీ ఓ గదిలో పెట్టి తాళం బిగించేశాడు. పిల్లలు గోలగోల పెట్టేస్తున్నారు. మా చినతాతగారు ముక్కుపొడుం బిగించుతూ అక్కడే కూర్చున్నారు.

"వల్లకాదు! మగపెళ్ళివారు రాకుండా యిక్కడ మనం విస్తరి వెయ్యకూడదు. పిల్లలకంటూ ఓ వరస వేస్తే, ఒకరూ ఒకరూ అంతా చేరిపోతారు. నానా అభాసూ అయిపోతుంది" అని అర్డరువేశారు.

నాన్నగారూ ఏ కబురూ రాలేదని కాళ్ళూ చేతులూ తొక్కేసుకుంటున్నారు. ఒంటిగంట దాటాక బళ్ళు రాలేదుగాని కబురు వచ్చింది.

పెళ్ళివారు బస్సు దిగారట. సమయానికి కుజహోర వచ్చేసిందిట. అదేదో గడిచేదాకా బళ్ళు ఎక్కరుట. మూడున్నరదాకా ఉంటాడట కుజుడు. ఈలోగా రోడ్డుమీద సోడాలన్నీ ఊదేశారుట! మంచినీళ్ళ బిందెలు పట్టుకుని వెళ్ళిపోయారు.

ఆ కబురు విని మా చినతాతగారి మొహం యింతయిపోయింది. "ఇంకా భూమ్మీద పంటలూ, ఆకాశాన వానలూ పడుతున్నాయంటే యిదిగో యిలాంటివాళ్ళుండబట్టేమరి! ఎంత పద్ధతి! ఎంత పద్ధతి! మన సాంప్రదాయాలు అలా యుగాలనించీ ఉన్నాయంటే ఇలాంటి మహానుభావులే కారణం..." అంటూ మొదలుపెట్టారు.

మా చిన్నతాతగారు పిల్లల దగ్గర హైద్రాబాద్‌లో ఉంటున్నారు. కొడుకులంతా పెద్దచదువులూ ఉద్యోగాలూనూ. రెండోఆయన భూములు చూసుకుంటూ కాకినాడ్లో వ్యాపారం చేస్తున్నాడు. అన్ని పెళ్ళిళ్ళలోనూ చినతాతగారిదే పెద్దరికం.

"ఏంటో! మరీ యింత చాదస్తాలా? ఓపక్క




మనకీ భోజనాలవలేదు. వాళ్ళూ పిల్లా పాపల్తో అక్కడ అల్లాడిపోతున్నారు'' అన్నారు కొంద రు.

ఆకలాకలంటూన్న పిల్లల గోలతో ఒకరూ ఒకరూ పొయ్యిదగ్గరకి చేరేశారు. పెద్దమామయ్య చివరికి పిల్లలకీ, ముసిలాళ్ళకీ విస్తర్లు వేయించేశాడు. ఈలోగా ఒకరూ ఒకరూ రోడ్డు మీంచి మగపెళ్ళివారూ నడకన వచ్చేశారు. ఆడాళ్ళూ, ముసిలాళ్ళూ మాత్రం అక్కడ ఉండిపోయారు. వచ్చినాళ్ళు భోంచేసేశారు.

నాలుగ్గంటలకి వచ్చారు తతిమావాళ్ళు. పిలుపులకి వెళ్ళారు మావాళ్ళు. అక్కడ మొదలయ్యాయి చిటమటలూ, విసుర్లూనూ! వాళ్ళకి బస్సులు సరిగా దొరకలేదుట. యింటిదగ్గరేమో టిఫిన్లు ఆలస్యమయిపోయాయట. ఎవరో ఒకావిడ బండి ఎక్కుతూ పడిందిట - యివన్నీ ఆ సత్యన్నారాయణమూర్తి పెట్టిన అడ్డులే! ముందు కొండమీద పెళ్ళన్నదీ మీరే! ఆ తర్వాత కాదు పొమ్మన్నదీ మీరే. మీకోమాట నిలకడలేదు అన్నారుట. పోనీ మంచీమర్యాద ఉన్నాయా మీరు తినోదిలేసిన అడుగూ బుడుగూ వంటకాలు మాకన్నమాట అనీ అన్నారు.

మా చిన్నాన్నలిద్దరూ ముఖాలు ముడిచేసుకున్నారు. మొత్తంమీద వాళ్ళు ముఖాలు కడిగీ, చీరలు కట్టీ, పౌడర్లు రాసీ తయారయేసరికి పట్టుకుంది వాన. ఎలాగో అక్కడనుంచి వచ్చి విస్తర్లముందు కూర్చున్నారు. పొద్దుట తిన్న ఉప్మాలు తప్ప ఏమీ లేవుగాబోలు, మాంచి ఆకలిమీదున్నట్టున్నారు. అన్నీ చప్పగా చల్లారిపోయాయి. ఎలాగో తింటున్నారు. ఒకటే గాలి. కట్టిన పందిరి ఎగిరిపోతుందేమో అనిపించేసింది

'ఈ వానేంటీ! ప్రళయంలాగుంది ఆ పిల్ల జాతకం మంచిదికాదు. పైగా సత్తెప్పకు కోపం తెప్పించారు. యింక ఆ పిల్ల అత్తకీ, మామకీ కూడు పెట్టదు' పెళ్ళికొడుకు తరఫున ముసిలావిడెవరో అందిట.

'వాన రాకడ, ప్రాణం పోకడా ఎవరికి తెలుస్తుంది! అన్నం తింటూ తింటూ హరీమన్నవాళ్ళెంతమంది లేరు! బ్రతికున్నంత కాలమూ అందుకే తెలిసీ తెలియని మాటలాడకూడదుట' అంది అమ్మమ్మ.

దాంతో మొదలయింది. ''పెద్దావిడ! ఆవిడ కెళ్ళిన ఏళ్ళు ఎవరికి వెళ్ళాయి! మా పిన్ని ప్రాణాలు పోవాలని శాపనార్థాలు పెడుతుందా'' అంటూ పెళ్ళికొడుకు తండ్రి లేచారుట.

మా చిన్నాన్నలు సర్దటానికి వెళ్ళి ''ఆ ముసిలావిడకి యిక్కడ పెళ్ళిచెయ్యటం యిష్టంలేదూ ఏదో కొసమాట అందీ పట్టించుకోకండి' అని అమ్మమ్మని తీసిపారేశారట.

ఆ మాట అమ్మమ్మకీ, మామయ్యలకీ చాలా కష్టం కలిగించింది. పొద్దుటినుంచి గాడిపొయ్యి దగ్గరున్నాడు పెద్దమామయ్య. ఆడపెళ్ళివాళ్ళనుండి పిండివంటలూ, పాలూ, పెరుగూ కాపాడటం తలనొప్పయిపోయింది. వంటబ్రాహ్మలమీద పడేవారు మిగిలినవాళ్ళు. శ్యామల రావుగారని మా యిళ్ళలో పెళ్ళిళ్ళన్నిటా ఆయనే వంట. మంచి అభిమానమయిన మనిషి. నా పెళ్ళికి ఆయనకివ్వాల్సింది చాలా కాలంవరకూ యిచ్చుకోలేకపోయారు నాన్నగారు. ఆయన ముక్కోపి. మామయ్య బ్రతిమిలాడ్డం, సరిగ్గా యిలాంటప్పుడు పెద్దమామయ్యకి ఈ ముక్క తెలిసింది.

'పదండి పోదాం మనం' అనేశాడు పెద్దమామయ్య.

నాన్నగారూ, అమ్మా వెళ్ళి 'ఈ కార్యం గట్టెక్కనీ! మా మొహం చూడు' అని గడ్డం పట్టుకున్నారు. మామయ్య తగ్గాడు. కొంతసేపటికి వానా తగ్గింది.

కరెంటు పోయింది. పెళ్ళికొడుకు ఫ్రెండ్సుట. పేకాటకి గదీ, పెట్రోమాక్సు లైటూ కావాలన్నారుట. చిన్నాన్నలు ఆ ఏర్పాటుచేశారు. 'యిలాంటివన్నీ అన్నవరంలో అయితే అయేవా?' అన్నార్ట. అదో గొడవ!

పెళ్ళికొడుకు ఫ్రెండ్సునే అవమానించారనీ, గది దూరంగా యిచ్చి టీనీళ్ళయినా పొయ్యలేదనీ, సిగరెట్లయినా యియ్యలేదనీ అక్కడకి వెళ్ళిన మావాళ్ళందర్నీ అన్నారట. మా పిన బామ్మగారి పెద్దకొడుకుని మేం పోలీసుబాబాయి అంటాం. చుట్టూ జనం మూ

గిపోతారు. మహా సరదామనిషి. ఒక్కక్షణం కూర్చోడు. ఎవరి తరఫున వెళ్ళినా వడ్డన్లోకి దిగిపోతాడు. మా చిన్నాన్నలు పెళ్ళికొడుకు ఫ్రెండ్సు అవసరాలు చూడటానికి ఆయన్ని పెట్టారు. వానవల్ల నడుం వాల్చటానికి జాగాలేదు. పేకాట దగ్గర కూర్చుంటాడుగాని ఆడడు. ఆయనమీద పడ్డారు పెళ్ళికొడుకు ఫ్రెండ్సు.

పాపం! ఓ రాత్రివేళ ఎక్కడినించి సిగరెట్లూ టీలూ తెప్పిస్తాడు. 'తునిలోనయితే యీపాటికి మిమ్మల్నీ మీ పేకల్నీ కలిపేసి జైల్లో వేయిద్దును బిచాణా' అన్నాట్ట పోలీసుబాబాయి.

పెళ్ళికొడుకు ఫ్రెండ్సు తగ్గిపోయినా మిగిలినవాళ్ళు తగ్గలేదు. మా వాళ్ళని అల్లరిపెట్టాలని పట్టారు. (ఆ తర్వాత మా ఆయన చెబుతుంటే ఆశ్చర్యం కలిగింది) తాగే నీళ్ళ గుండిగల్లో పెట్రోమాక్సు లైట్లు పడేసారు. లేవనిపించాలని భోజనాలదగ్గర స్వీట్లు ఆకుల కిందకి తోసేశారు. టిఫిన్లకోసం పంపిన ఉప్మాబుట్టల్ని మేం పంచుకుంటాం లెమ్మని పెరటి గోడవతల పారేసి యింకా కావాలన్నారు. అప్పటికప్పుడు మూడుసార్లు ఉప్మాలు కలియబెట్టాల్సిరావటంతో పెద్దమామయ్యా శ్యామలరావుగారూ చిందులు **తొక్కేశారు**. కాఫీలు చల్లారేదాకా ఉంచేసి వేడికాఫీలు కావాలన్నారు. విడిదిలో **నీళ్లు** అందలేదనీ, సబ్బులు లేవనీ **గొడవచేశారు**. ఇవన్నీ ఓ ఎత్తయితే భోజనాలదగ్గర ఎవరో ఒహాయనని పిలుపులకి వెళ్ళినవాళ్ళు పిలవలేదన్న గొడవ మరో ఎత్తు.

ఆవిడ మా అత్తగారికి చెల్లెలు వరసట. వాళ్ళాయన పెద్ద ఆఫీసరట. ఎక్కడో పడుకున్నాడు. అంతా బయల్దేరి వచ్చి భోజనాలకి కూచున్నాక పాపగారి మొగుడేడీ అని చూసుకున్నారుట. వెతకటానికి మగ పెళ్ళివాళ్ళు విడిదికి వెళ్ళారు. ఆ పాప అన్న పెద్దావిడ నా మొగుడు మెత్తని మనిషి రానూ అంటే తీసుకొచ్చాను. తగిన అవమానం చేయించారు' అంటూ ఏడిచిందిట. దాంతో మా అత్తగారూ ఏడుపు మొదలెట్టారుట. ఆ కబురు తెలిసి యిక్కడ తతిమ్మావాళ్ళు భోజనాలనుంచి లేచిపోయారు.

నాన్నగారు చిన్నాన్నలూ బతిమలాటలకి వెళ్ళారు. అప్పటికి, స్నాతకం ఉపనయనం అయ్యాయి. మధాహ్నాం భోజనాలదగ్గర యీ గొడవ. పొద్దుట్నించి నాన్నగారూ విసుగెత్తిపోయారు.

ఎవరు ఎవరికి క్షమార్పణలు చెప్పాలో కాయితంమీద రాసిచ్చేయండి. ఆ ఏర్పాట్లు చూస్తాను అన్నార్ట నాన్నగారు.

'పెళ్ళికూతురి తండ్రికి యింత తలబిరుసా? ఆ తల్లి చూస్తే మంచం వేసుకుపడుకుంది ఆ పిల్ల కాపురం చేస్తుందా' అని మొదలెట్టారు.

అందర్నీ తలోమాటా మాట్లాడవద్దని మా మామగారు నాన్నగార్నీ చినతాతగార్నీ పిలిచి ఎవరేం చేసిందీ చెప్పారుట. నాన్నగారు దణ్ణాలు పెట్టేస్తుంటే చినతాతగారు సర్దేశారు. మొత్తంమీద భోజనాలకి వచ్చారు.

అది శనివారం. రాత్రి టిఫిన్లవాళ్ళూ భోజనాలవాళ్ళూ ఉన్నారు' అయిదు పూటలు భోజనాలంటే మాటలా? కొండమీదయితే స్నాతకం చేసుకువచ్చేవారు. రెండు పూటలతో గట్టెక్కేసేవాళ్ళం' అని మామయ్యా విసుగేసుకుంటున్నాడు. ఆ రాత్రి టిఫిన్లకీ, అన్నాలకీ గూడా మామయ్యా ఏర్పాట్లుచేశాడు. ఏం లాభం?

తీరా వడ్డనలు మొదలయ్యే సరికి అన్నాలవాళ్ళు టిఫిన్లూ తినేసి అన్నాలు కెలికేసి వదిలేశారు. దాంతో టిఫిన్లు అయిపోయాయి. అన్నాలు మిగిలిపోయాయి. మా మామయ్యా కంజాయింపు అలా ఏడిసిందని మా చిన్నచిన్నాన్న అన్నాడు.

'పెళ్ళికొడుకు తండ్రికే యిక్కడ దిక్కులేకపోయింది. ఏం తింటాడో కనుక్కోవాలి. నోరు విడిచి చెప్పినా చూడలేదు' అన్నారు మా పెళ్ళివాళ్ళు. ఆయన రాత్రిళ్ళు వాసినపోలు (యిడ్లీ) తింటారట. ఆ ముక్క చిన్నచిన్నాన్నతో ముందే అన్నారుట. ఆ విషయం మా పెద్దమామయ్యకు చెప్పాడుట. ఎందుకు చెయ్యలేదూ- అంటూ గాడిపొయ్యిదగ్గరున్న పెద్దమామయ్య దగ్గరకి వెళ్ళాడు చిన్నచిన్నాన్న.

చిన్నచిన్నాన్నను పట్టుకుని మా పెద్దమామయ్య కొడుతున్నాడన్నారు. జనం మూగిపోయారు.





'ఒరేయ్ దౌర్భాగ్యుల్లారా! నా చెల్లెలి మొహం చూసి యీ గడపలో అడుగుపెట్టాను. దాని కూతురి పెళ్ళి సజావుగా సాగాలని మీ కసుర్లన్నీ తిన్నాను. వచ్చిందగ్గర్నుంచీ చూస్తు న్నాను. చేసిందేమీ లేదూ పైగా పేర్లూ పద్దు లూనా'' అంటూ పెద్దమామయ్యా వీరంగమెత్తే శాడు. చిన్నాన్నను నాలుగు గుద్దులు గుద్దేసరికి వాళ్ళూ వీళ్లూ మామయ్యను పట్టుకున్నారు.

పొద్దుట్నించీ తిరిగి తిరిగి అలసిపోయిన అమ్మ నా పక్కనే నడుం వాల్చింది. పెద్దమామ య్యను చిన్నాన్నలిద్దరూ మరికొందరూ కొడు తున్నారన్నారెవరో! అమ్మ చటుక్కున లేచి అమ్మో అమ్మో అంటూ పడిపోయింది. చిన్న బావగారు డాక్టరుగారి కోసం పరుగెత్తారు. నేను ఏడుపు మొదలెట్టాను. డాక్టరు వచ్చి యింజక్ష ను చేశాడు. అమ్మ పడుకుంది ఆ తర్వాత మామయ్యలిద్దరూ సర్దుకున్నారు. ఎక్కడికో పోయి పడుకున్నారు.

తెల్లారగట్ల మూడు గంటల నలభై రెండు నిమిషాలకి ముహూర్తం.

నేను ఆ రాత్రి ఏడుస్తుంటే చిన్నబావగారు ఓదార్చారు.

''చూడమ్మా శాంతా! యీ పెళ్ళిళ్ళూ, యీ పద్ధతులూ, యీ మర్యాదలూ యివన్నీ మన పూర్వీకులు వ్యవసాయాలమీద బతికేరోజుల నాడు మొదలయ్యాయి. యిప్పుడు వాటిని చేసే ఓపికాలేదు. సరదాపోదు. ఇదంతా కల్చ రనీ, గాడిద గుడ్డనీ భుజాలెగరేసుకుంటాం! అప్పుడున్న హుందా పోయి వెకిలితనం పెరిగి పోయింది. యీ పెళ్ళిళ్ళలో ప్రతీవాళ్ళు ఉద్రే కంగానే ఉంటారు. ఏవేవో ఊహించుకుంటా రు. దేనికీ బలమైన కారణం ఉండదు. చిలికి చిలికి గాలివాన అయిపోతూనే ఉంటుంది. ఇలాంటి వాటిని నువ్వు పట్టించుకోకూడద మ్మా! రాబోయే జీవితం గురించి అందంగా ఆలోచించుకోవాలి! ఆ అబ్బాయిని తలుచుకో! కావాలని చేసుకుంటున్నాడు ఎంతమంచివా డో. నువ్వు ఏడవకూడదు'' అంటూ యింకా ఏంటేంటో చెప్పారు.

పెళ్ళితంతు మొదలయింది. మంగళస్నా నాలు పీటలమీద కూర్చోబెట్టారు. కుర్రాళ్ళూ, ఈయన ఫ్రెండ్సూ ఓచోట చేరారు. వాళ్ళు అక్కడనుంచే ఏవో అడగటం, ఈయన పీటల మీంచే జవాబివ్వటం. వాళ్ళు అక్షింతలు విస రటం. పురోహితుడి విసుగూ! జీలకర్ర బెల్లం అయింది. మంగళసూత్రధారణ! తలంబ్రాలు సాగుతున్నాయి. కాఫీలు వచ్చాయి.

ఆ కుర్రాళ్ళు ఆ అక్షింతలని ఆడపిల్లలమీ దకి విసిరారుట. అస్తస్తమానూ మంచినీళ్ళూ కాఫీలు అడిగారుట. భీముడని మా పినబామ్మ మనవడు. వాడి చెల్లెలు వచ్చి ఎవరో ఏదో అన్నారని అన్న దగ్గర ఏడిచిందట.

వాడు వెళ్ళి ఆ కుర్రాడి గూబ గుయ్యిమని పించాడు. పీటలమీంచి ఈయన లేవబోయా రు. మామగారు గసిరేశారు. 'కూర్చో' సంగతి నేను చూస్తాను' అని వెళ్ళారు. తన్నులు తిన్న కుర్రాడి ఫ్రెండ్స్ కర్రలు తీసారు. మా చిన్నాన్న వెళ్ళి ''పిచ్చివేషాలేస్తే యీ ఊరినించి కదల రు'' అన్నాడుట. సమయానికి మామగారు వెళ్ళి ఆ కుర్రాడినే తిట్టారు.

'నీ కొడుకునయితే తిడతావా?' అని ఆ కుర్రాడి తండ్రి అడిగ్గారుట. 'నా కొడుకులు ఎన్నటికీ యిలా **చేయరు**' అన్నార్ట మా మామ గారు. అనేసి ఊరుకోలేదు. మా నాన్నగార్ని పిలిచి 'తప్పెవరిదయినా చెయ్యి చేసుకోడం మర్యాదకాదు. మా పిల్లను మేం తీసుకుపో తాం' అన్నారు.

చిన్నాన్నలూ, మామయ్యలూ, బతిమిలాడా రు. నాన్నగారు ఆ కుర్రాడి తండ్రికి క్షమార్పణ చెప్పనన్నారు. అప్పగింతల తంతు అవ కుండానే అప్పటికప్పుడు ప్రయాణం కట్టేశారు.

''పెళ్ళయింది. మూడు ముళ్ళూ పడ్డాయి. అది యింక వాళ్ళ పిల్లే! మనకు హక్కు లేదు. తీసుకుపోనీండి'' అనేశారు నాన్నగారు.

నాతోబాటు పిన్నీ,చిన్నాన్నా,పెద్దక్క, బావ గారూ బయల్దేరారు. రోడ్డుమీదకు వచ్చాక బస్సులకోసం నిలబడ్డాం. యిళ్ళకు చేరేసరికి మధ్యాహ్నం రెండుగంటలయింది.

ఆ ముందురోజు నాకు భోజనం సహించలే దు. ఆ రాత్రి నిద్రలేదు. ఆ పొద్దుట్నించీ మంచి నీళ్ళూ తాగలేదు. ఓ పక్క పెద్దక్క చెవిలో యిల్లు కట్టుకుని పెళ్ళివాళ్ళెంత చెడ్డ

వాళ్ళో చెప్పుకుపోతోంది. పెద్దబావగారు వాళ్ళ తో పేకాటలో కూర్చుంటే ముక్కలు చూపించి లెక్కపెట్టూ అన్నారట. అదీ దాని బాధ. అవమానం చేశారు. గౌరవాల్లేవంటోంది.

నాకు కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి.

ఇంట్లో అడుగుపెడుతూనే నేను తూలిపడిపోయాను.



నేను పడ్డాక చాలా హడావుడి అయిందిట.

మా అక్క చెప్పింది వీళ్ళేం మనుమలే బాబూ! తలకో మాటాను చంపేశారు! 'ఎవరమ్మా నువ్వూ తల్లీ! చెప్పమ్మా' అంటూ ఒకళ్ళు. 'యింకెవరూ ఆ సత్తెన్న తండ్రే!' అంటూ మరొకళ్ళు. ఆయనేం అలాంటాయనగాదు. కులదేవతకు చీరపెట్టలేదు' అంటూ యింకొకళ్ళు. మీ ఆయన కన్న పెద్దావిడ పోయిందిట. ఆవిడ పేర పునిస్త్రీకి చీర పెట్టాలిట. అందుకే ఆవిడ వచ్చిందట. అబ్బబ్బ! నా ప్రాణాలు తోడేశారు. మీ బావగారికి మంచినీళ్ళయినా యివ్వలేదు. ఎండన బడొచ్చారు- ఓ కాఫీ చుక్క యిద్దాం మంచం వాలుద్దాం. తిండీ తిప్పలూ చూద్దాం అని కూడా లేదు. అడిగింది అడగకుండా అడగడం! పిల్లకి ఎప్పుడూ యిలా అవుతుందా? ఫిట్సా? ముందు చెప్పలేదేం అమ్మ నాయనోయ్! పిన్నుండబట్టి సర్దేసింది. ఇంతకీ నువ్వెలా లేచావో తెలుసా? మీ మామగారు మంత్రం నీళ్ళు జల్లారు! మంత్రాలు గట్రా చదివారు. అందర్నీ బయటకు పంపేసి పిన్ని నీకు నోట్లో నీళ్ళు పోసి విసురుతూంటే తెలివొచ్చింది'

మా పిన్ని గుండెదిటవు మనిషి! ఆ సాయంత్రం నాకు పూలజడ కుడుతూ చెప్పింది.

'బెంగపడకే శాంతా! వీళ్ళుత్తి గాలి మనుషులు! మంచి అభిమానస్థులు వాళ్ళు. పాపం పెద్దకొడుకు అలా ఉండడంతో ఏదో గంతకు తగ్గబొంతని మీ తోటి కోడలిని కట్టుకున్నారు. ఆవిడ అదోలాంటిది. దాంతో నువ్వే ఇల్లు దిద్దాలని నీమీద ఆశలు పెట్టుకున్నారు. నువ్విలా యింట్లో కాలుపెట్టి పడిపోయేసరికి వాళ్ళకి గుండె జారిపోయింది. నేనదేంలేదని నీరసమనీ చెప్పాను. ఆ పెద్దాయనతోసహా అంతా కాలుగాలిన పిల్లుల్లా తెగతిరిగారు''

మర్నాడు గృహప్రవేశం, సత్యన్నారాయణ వ్రతం, వెంకటేశ్వర దీపాధన అయ్యాయి. నాకూ మా అక్కకూ పిన్నికీ పెరట్లో వున్న యింట్లో ఏర్పాటు చేశారు. మా తోటికోడలు చీటికీ మాటికీ వచ్చేసేది. ఏదో గునగునలాడేది. అంతా రహస్యమే! ఏదో అడిగేది. జవాబు చెప్పబోతే ష్! అనేసి ఎవరో వస్తున్నట్లు వెళ్ళిపోయేది . సగం సంజ్ఞలూ సగం మాటలూనూ ఆవిడవి.

ఆవిడ గోల ఓ పక్క! మా అక్క నీతులు యింకో పక్క! ఆ రోజు నాకు బాగా గుర్తు. మా అత్తగారు కాఫీ తెచ్చారు. చల్లారిపోయింది.'వేడి కావాలండి' అన్నాను నోరు కాలాలి నాకు. ఆవిడ ఆ గ్లాసు పట్టుకెళ్ళారు.

మా అక్క మొదలెట్టింది. 'యింకా నయం! యిలా అయితే మేమీపాటికి కాపురాలు ముక్కలు చేసుకుని పుట్టింట్లో ఏడుస్తుండేవాళ్ళం. అత్తగారిని 'కాఫీ వేడిచేసి తేవే పీనుగా' అని పురమాయిస్తావా నీకేం మతిపోయిందా ఇంకా చిన్నదాన్ననుకుంటున్నావా' అంది. ఎలా మసులుకోవాలో చెప్పి హడలగొట్టేసింది. మా అక్క ధోరణి తెలును గనుక నేనంత ఇదయిపోగూడదుగాని ఆరోజు అయిపోయాను.

ఆ రాత్రి ఈయన ఏమయినా అంటారేమోనని నానా కంగారుగానూ ఉంది. ఈయనేం అనలేదు. తడిపొడిగా మాట్లాడారు. పొద్దుట లేచి అన్నవరం వెళ్ళాలన్నదొక్కటే నాకు అర్థమయింది.

మర్నాడు అన్నవరం వెళ్ళొచ్చాం. మా





అక్కా పిన్నీ వాళ్ళూ ఉండిపోయారు. సాయంకాలానికి తిరిగొచ్చాం. మా నాన్నగారికీ దేవుడూ గట్రా ఉన్నాయిగానీ అస్తస్తమానూ గుళ్ళకీ గోపురాలకీ వెళ్ళడంలేదు. మా పితా పురం కుక్కుటేశ్వరాలయానికి మా అమ్మా నాన్నా ఎప్పుడు వెళ్ళారో నాకు గుర్తులేదు. ఇంట్లో మాత్రం అమ్మ రోజూ దీపం పెట్టేది. మడికట్టుకుని వండేది. నాన్నగారు శనివారం స్నానంచేసి కొబ్బరికాయ కొట్టేవారు. అగరొత్తు లు వెలిగించేవారు. సంక్రాంతికి నామాలు పెట్టుకుని అన్నయ్యలకి పెట్టేవారు. అయినా ఈయనకి చాలా చాలా భక్తి అనుకున్నాను.

ఆవేళ బస్సులో ఎండ పడిఉన్నానేమో. తలనొప్పి వచ్చేసింది. ఈయన విభూతి బొట్టు పెట్టి తగ్గిపోతుందన్నారు. మా అత్తగారు మా యిద్దరికీ దిష్టితీశారు.

"నువ్వేం భయపడకమ్మాయ్! యీ గొడవ లన్నీ ఆయన పెట్టినవే! మీ వాళ్ళకి కళ్ళకి పొరలు కమ్మేసాయి. గాడుతనాలు పెరిగిపో యాయి. అన్నీ అవే దిగుతాయి. వెళ్ళి కనబడి చెంపలేసుకు వచ్చారుగదా!" అన్నారు మా అత్తగారు.

మర్నాడు మనుగుడుపులకి మా ఊరు వెళ్ళాం.

'మీ ఆయన అలా కూర్చుంటాడేమిటే! ఏ పుస్తకమయినా చదువుతాడేమో అడుగు' అనేది చిన్నక్క.

'పేకాటాడతాడేమో కనుక్కోవే శాంతా' అనే వారు పెద్దబావగారు.

చదరంగం బోర్డుందని చెప్పమనేవారు నాన్నగారు. ఏమీ ఆడేవారు కాదు. సినిమాకు చిన్నబావగారు బయల్దేరదీస్తే వెళ్ళాం.

అమ్మమ్మ తేల్చేసింది 'నీ మొగుడు వేరు. మీ వాళ్ళు వేరు. వీళ్ళంతా లొడలొడలూ బడబడలూనూ! దేవుడూ దెయ్యం భయం భక్తీ... అమ్మో!

అమ్మ అంది- 'గుండెలోతు మనిషి సుమా! దొరకడు'

పదహారురోజుల పండగ అవగానే నన్ను నెల్లి పాలెం తీసుకుపోయారు.

★ ★ ★

ఆరునెలలు నెల్లిపాలెంలోనే ఉన్నాను. రాజ మండ్రినుంచి ఈయన వస్తూపోతున్నారు. కా పురం ఎప్పుడు పెట్టిస్తారని మావాళ్ళు నన్ను అడిగేవారు. మా అత్తారిని అడిగేవారు కాదు. ఈయన్ని నేనూ ఎప్పుడూ అడగలేదు. ఈయన తత్వమేంటో నాకు అప్పట్లో బోధపడి చచ్చేది కాదు. ఆ మాటకొస్తే యిప్పటికీ తెలవ దు. ఒక్కోసారి పెద్దక్కలాంటిదయితే ఈయన కి నప్పుతుందేమో ననిపించేది. నేనయినా ఏం చేశాను? దేనికయినా గొడవాడానా? అసలు గొడవకి యీయన మాట్లాడితేగదా! మా నాన్న గారూ మాతో మాట్లాడేవారుగాదు. అయినా మాలో మేం చిల్లో బొల్లోమంటూ ఉండేవాళ్ళం. మా అత్తారింట్లో మామామగారు చాలా సరదా మనిషి. ఊళ్ళో వాళ్ళన్నా యింట్లో వాళ్ళనూ ఆయన తిడుతూంటే నాకు కొత్తలో అదోలా ఉండేది 'ఇంకా నయం యింకా తిడతారు' అనేది మా తోటికోడలు. ఆవిడకి ముగ్గురు మగపిల్లలు. పిన్నీపిన్నీ అంటూ చుట్టూ తిరిగే వారు. మా పెద్దబావగారిని చూస్తే మాత్రం కొత్తలో భయంగా ఉండేది.

ఆరునెలల తర్వాత మామగారు తుని వెళ్ళి పంగనామాలాయనచేత మూహూర్తం పెట్టించారు. నన్ను తీసుకెళ్ళి రాజమండ్రిలో కాపురం పెట్టించారు. అమ్మ వచ్చి ఓ వారం ఉండి అన్నీ చూసి వెళ్ళింది.

ఈయనకి శనివారాలు. మా యింట్లోనూ శనివారాలున్నా మాకందరికీ బలేసరదాగా ఉండేది. అమ్మ రొట్టో ఉప్పు పిండో చేసేది. ఆవకాయో కందిగుండో కలుపుకుని కంచాలకు కంచాలు ఎక్కించేవాళ్ళం. తింటూ కబుర్లే కబుర్లు. ఈయన అలాగాదు. ఆరోజంతా మడి. రాత్రి వేరే పడుకునేవారు. నాతో మాట్లాడేవారు గూడా కాదు. వారానికి మూడు సార్లయినా ఆలయాలకు తీసుకెళ్ళేవారు.

ఇహ ఆ మూడు రోజులూ నాపాట్లు ఒకర కంగావు. ఆయనే వండేవారు. వగలు డ్యూటీ అయితే ఏ పక్కింటివాళ్ళనో పిలిచి వడ్డించమ నాల్సి వచ్చేది. మా వాటా వెనకవేపు ఉండేది. ముందున్న పెద్దయింటిలో యింటి ప్లీడరుగా రుండేవారు. వెనకన మరో వాటాలో మరొకరు

అద్దెకుండేవారు. ఆవిడా స్కూల్లో పనిచేసేది. పదయ్యేలోగా అంతా బయటకి పోయేవారు. ప్లీడరుగారింట్లో మహా ఆచారం. ఇంటావిడ నాకు వడ్డించి వెళ్ళి స్నానం చేస్తేగాని అన్నం తినేదికాదు. అన్నం తినేసిందా- మరిచిపోయా నండీ అనేసేది. ఓ రోజు తినీ ఓ రోజు తినకా అన్నట్టుండేది నా పని. వాళ్ళ ఆడవాళ్ళు పెరట్లో తిరుగుతుంటే నేను తలుపువారను కూర్చునేదాన్ని. రాత్రిళ్ళు ఈయనకి డ్యూటీప డితే పగలు వడ్డించేవారు. పగలు డ్యూటీ అయితే చచ్చేచావు అయ్యేది. పిలవలేక, పిలి స్తే ఎవరూ పలక్క, వచ్చి విసుక్కుంటూ వడ్డి స్తుంటే ఛా- తిండి మానేద్దామనిపించేది. అసలే నీరసంగా చికాకుగా ఉంటుంది. తిన్నా కూడా సయించేది కాదు. అమ్మయితే ఎలాగోలా తినమ్మా! ఉండలేవూ అని బ్రతిమాలి పె ట్టేది. ఏ రెండు గంటలవేళో కాస్త వచ్చి మిరపకాయ చిదిమి ఏ అట్టోపోసి కాస్తంత కారంగా చేసిపెట్టేది. స్కూలుకి వెళ్ళి యింట్లో కి రాగానే వేరేగా కూర్చునేవాళ్ళం! అలా కూర్చున్నా ఆవిడ వంట చేసుకుంటూ కబుర్లు చెప్పేది. మేమంతా ఏదో ఒకటి ఆడుకునేవా ళ్ళం. గడిచిపోయింది. ఇక్కడ అలా కాదు! ఆ మూడురోజులూ మూడు యుగాలే! పగలు డ్యూటీ అయితే రాత్రిళ్ళు యింటిదగ్గరే ఉండే వారు. అన్నింటికీ విసుగేసుకునేవారు. కాళ్ళు జాపుకోగూడదనేవారు. పడుకున్నపుడు మరీ తినేసేవారు. నాకసలే మొద్దునిద్ర. ఇక్కడ పడుకుంటే అంతదూరం దొర్లిపోయేదాన్ని. ఉన్నదొకగదీ, ఓ చిన్నివసారానూ! వసారాలో పడుకునేదన్ని. రాత్రివేళ ఆయన వెళ్ళా లంటే నామీంచే వెళ్ళాలి. వారగా పడుకున్నా గుమ్మానికి అడ్డుగా వచ్చేసేదాన్ని. నన్ను చప్పు ట్లుకొట్టి పిలిచి పిలిచి అరిస్తేగాని మెలకువ వచ్చేది కాదు. తిట్టేవారేమో నిద్దర్లో నాకు తెలిసి చచ్చేది కాదు.

ఈ బాధలు పడలేక నెల్లిపాలెమే సుఖంగా అనిపించేది. అత్తగారే వంట. ఏపని చెపితే ఆ పని చేయటం ఏమూలో పడుకోటమూనూ! మా పెద్దమరిది భాస్కరానికి చదువు చెప్పేదాన్ని. మామగారికి కరిణీకం లెక్కల్లో సాయంచేసేదా న్ని. మా ఆఖరు మరిది భలే కబుర్లు చెప్పేవా డు. మా తోటి కోడలూ, బావగార్నీ చూస్తేమటు క్కు ఆదిలో తలోరకం భయమూనూ! మా బావగారికి మన్నన చేయమనేవారు మా అత్త గారు. మామగారేమారు తిట్టిపోశారు. 'వాడొచ్చి అస్తమానూ యింట్లోనే ఉంటాడు ఏం అక్కర్లే దు' అనేశారు.

ఏడాది చూస్తుండగా గడిచిపోయింది. మా అత్తగారు అప్పటికే కంగారుపడుతున్నారు. నాకు నెలతప్పింది. అమ్మ నన్ను చూడటానికొ చ్చింది. పరీక్షలు చేయించుకున్నావా అంది. లేదన్నాను. ఆయనతో కదిపింది.

"మా యింట్లో అలవాటులేదు" అన్నారు. విస్తుపోయింది అమ్మ. ఆయన ఏమంటున్నారో ముందు అర్ధమే కాలేదు. "యిదెక్కడి గోలే... డాక్టరు వద్దంటాడూ" అర్ధమయ్యాక అంది.

"నాకేం తెలుస్తుందీ" అన్నాను.

"మరెవరికి తెలుస్తుందే. మీరేం మాట్లాడు కోరా మంతాడుకోరా" అంది.

"ఏమో... ఆయనేంటంటారో నాకు తెలీ దు" అన్నాను.

'నువ్వు తీసికెళ్ళి పరీక్షలు చేయించూ' అందామనుకున్నాను. అమ్మ దగ్గర ఉంటే అందాకా రానీదుగదా అనిపించింది. ఆ మర్నాడు మళ్ళీ ఆయన్ని కదిపింది.

"నేనే డాక్టరుకి చూపిస్తాను బాబూ" అంది అమ్మ.

"మా నాన్నగారు ఒప్పుకోరు" అన్నారా యన.

ఆ తర్వాత అమ్మ నాతో అంది "నువ్వేం యిదవకే శాంతా! మీ నాన్నగార్ని పంపుతాను. ఆయన మాట్లాడతారు. యిదెక్కడి తంతే బాబూ!"

ఆయనేదో నన్ను కష్టపెట్టేస్తున్నట్లంటే నేను ఊరుకోలేకపోయాను.

"మరీ తీసిపారెయ్యకే! ఆయన నన్నెంతలా చూసుకుంటారనీ! ఆయన బట్టలు కూడా ఆయనే ఉతుక్కుంటారు. ప్రతిరోజూ ఏదో ఒకటి తెచ్చి తినమంటారు. ఈ సామాన్లన్నీ ఆయనే కొన్నారు. ఏదీ చెప్పక్కర్లేదాయనకి. అన్నీ ముందే చూసుకుని తెచ్చిపడేస్తారు"

అంటూ మొదలెట్టాను.

మా అమ్మ విని విని ఒకటే నవ్వు నవ్వు...

"ఎందుకే నవ్వుతావూ" అన్నాను విసిగిపోయి.

"ఇంతుండేదానివి - ఎంతయిపోయావే శాంతా! అప్పుడే మొగుడిని వెనకేసుకొచ్చేస్తున్నావూ" అంది.

అన్నమాట ప్రకారం నాన్నగారు వచ్చారు. స్వీట్లూ, అవీ తెచ్చారు. ఇద్దరమే ఉండటంతో నాన్నగారు చాలా మాట్లాడారు. నాకూ భయం పొయ్యినట్టన్పించింది. దగ్గర కూర్చుని మాట్లాడుతూంటే కొత్తగా ఉంటోంది. ఆరోజు డ్యూటీ నుంచి ఈయన వచ్చాక మాట్లాడారు

"అదేంటండీ! ఈరోజుల్లో డాక్టర్ని చూడకుండా అవుతుందా" అన్నారు.

వాళ్ళ అక్కయ్య కడుపులో ఉండగా మా అత్తగార్ని డాక్టరుకి చూపించార్ట. అందువల్లే అయిదేళ్ళు పెరిగిన ఆమె పోయిందిట. నువ్వు ఆనవాయితీ తప్పించావని - వాళ్ళ అక్కయ్య కలలో కనబడి తిట్టిందిట. అప్పటికే మా పెద్దబావగారు కడుపులో ఉన్నారుట. అప్పుడు డాక్టరుకి చూపించారుట. అందుకే ఆయనకి మతిచెడిందిట. వాళ్ళ వదినకి కూడా డాక్టర్లు గొడవలూ లేవుట. ఆవిడకి తల్లీదండ్రీ లేరుట. పుట్టింటి పురుళ్ళే ఎరగదట. 'అవిడకి పిల్లలు పుట్టారు. పళ్ళలా ఉన్నారు. మా అక్కయ్య పేరిట బొట్టుపెట్టి దండం పెడితేచాలు' అన్నారు ఈయన.

ఏవో నమ్మకాలూ అవీ ఉంటాయనుకోండీ అంటున్నారు నాన్న. ఈయన లేచి వెళ్ళిపోయారు. నాన్నగారికి చాలా కష్టంవేసింది. 'ఈ అబ్బాయి పద్ధతి నాకేం నచ్చలేదు. మనిషంత మనిషిని, మాట్లాడుతూంటే అలా వెళ్ళిపోతాడేంటీ' అన్నారు. నేనేం మాట్లాడతాను?

ఆయనంతట ఆయనే తిరగదీసుకుని 'వెళ్లొస్తా' అన్నారు నాన్నగారు.

'నువ్వేం కంగారుపడకు! వాళ్ళ తండ్రిగారితో మాట్లాడతాను' అన్నారు. పదిరోజులయ్యాక మొహం యింత చేసుకువచ్చారు. 'మీ మామగారు చాలా పెద్దమనిషి. మా నమ్మకాలు మావి. మీవి మీవి. మీక్కావాలనుకుంటే మీ ఊరు తీసుకెళ్ళి చూపించండన్నారు' అన్నారు.

పిఠాపురంలో డాక్టరుకి చూపించారు. అంతా సవ్యంగానే ఉందంది. మందులు రాసింది. నెలకోమారు చూపించుకోమంది. నాన్నగారు మందులు కొనిచ్చి రాజమండ్రిలో దింపారు.

'నేను చెప్పలేదా' అన్నారీయన.

నెలలు ముదురుతున్నాయి. మావాళ్ళు నెలకోసారి తీసుకెళ్ళలేకపోయారు. మూడోనెలలో చూపించాక ఆరోనెలలో చూపించారు. డాక్టరేం అనలేదుగాని అమ్మమాత్రం బాధపడుతూ 'కుదర్లేదమ్మా' అంది.

పిఠాపురం వెళ్తే నెల్లిపాలెం వెళ్ళాలనేవారు ఈయన. మా అమ్మ ఆగలేక అనేసింది. 'మీ ఊరంటే బస్సేకాదుగదా! బండిలోనూ వెళ్ళాలి. ఉత్తి మనిషి కాదు'

ఆ మాటకి ఈయనేం అనకుండా వెళ్ళిపోయారు.

నాకు మనసొప్పుకోలేదు. "నీకేం ఏదో అంటావు. ఆయనకి కోపం వచ్చేసింది" అన్నాను. మర్నాడు నాన్నగారు సెలవుపెట్టి నన్ను తీసుకెళ్ళి దిగబెట్టారు. మామగారు నాలుగు రోజుల తర్వాత వచ్చి తీసుకెళ్ళి రాజమండ్రిలో దింపమన్నారు.

నాన్నగారు సరేనని వెళ్ళిపోయారు. అన్నరోజుకి అమ్మ వచ్చింది నన్ను తీసుకెళ్ళి రాజమండ్రిలో దింపటానికి.

మా అత్తగారూ, తోటి కోడలూ బుగ్గలు నొక్కుకున్నారు. 'ఒక్కత్తీ వచ్చి నిన్ను తీసుకెళ్ళి దింపుతుందా మీ అమ్మ! యిదేం విడ్డూరం?'

నేను అమ్మని కడిగేశాను. పెళ్ళిదగ్గర్నుంచీ చేసినవన్నీ ఏకరువుపెట్టాను. "మొదట్నించీ యిదే వరస! నాన్నగారు రావొచ్చుగదా! మగాళ్ళ కోటిక్కట్టూ, ఆడాళ్ళకో టిక్కట్టూ పుచ్చుకోరు గదా" మా అత్తగారి మాటల్ని తిరగేసుకుని అన్నాను.

అమ్మ ఆ రాత్రి సరిగ్గా అన్నం తినలేదు. మర్నాడు ప్రయాణం ఉందిగానీ మామగారు పంపుతారో లేదో తేలలేదు. ఆరోజు ఈయన




వెళ్ళాక తిరిగి నెల్లిపాలెమయినా రాలేదీయన. నాకారాత్రి బాగా గుర్తు. ఓ రాత్రివేళ మెలకువ వచ్చింది. అమ్మ పెరటి వసారాలో కూర్చుని ఏడుస్తోంది 'ఏంటీ' అంటే మాట్లాడదు. బ్రతిమాలాక అంది-

'పిల్లల్నెందుకు కంటాం తల్లీ! మిమ్మల్ని పెంచటానికీ, మీరన్నవి పడటానికీనూ! యిన్నేళ్ళు పెంచిన మేమంటే విలవ లేకపోయింది. మావన్నీ అపరాధాలుగానే కనిపిస్తున్నాయి. నీ మామగారికి తెలీకపోవచ్చు. నీ మొగుడికి తెలీదా ఉద్యోగం వెలగబెడుతున్నాడూ! ఉద్యోగాలు చేసేవాళ్ళకి ఎన్నేసి సెలవులుంటాయి! ఎంత బాధపడితే సెలవులు దొరుకుతాయీ నీ పెళ్ళికి వారంరోజులిమ్మంటే రాత్రీ, పగలూ చేయించుకునిగాని యివ్వలేదు నీకళ్లతో నువ్వే చూశావుగా! డాక్టరు గొడవ తేల్చుకోటానికి, ఒప్పించటానికి అయిదురోజులు సెలవు పెట్టి నాలుగుసార్లు తిరిగారు.

నాకూ బాధేసింది. యింకెప్పుడూ అమ్మని ఏం అనగూడదనుకున్నాను. అమ్మతోపాటు ఏడిచాను.

"చఛా! ఏడవకు! ఉత్తిమనిషివిగాదు. పిచ్చిదాన్ని ఏదో అన్నాను" అని నన్ను వక్కలో పడుకోబెట్టుకుంది. తెల్లారగట్ల లేపి 'టైమెంతయిందే?' అని అడిగింది. నాలుగవుతోందన్నాను. 'యింకోరోజు ఎక్కువుండాలన్న మాట' అంది. 'మీ అత్తగారితో చెప్పకు. తెలిస్తే యిక్కడనుంచి కదలనివ్వరు. నాలుగు రోజులు యిక్కడ చావాలి. అక్కడ మీ నాన్నగారు ఉండలేరు' అంది.

'ఇంకానయం! ఆయనకి తెలిస్తే చంపేస్తారు' అన్నాను.

'ఎలా తెలుస్తుందీ! నేను రాజమండ్రిలో దిగబెట్టేసి వెళ్ళిపోతాను. నువ్వు స్నానంచేసేసి బట్టలమీద వనువునీళ్ళు జల్లుకో' అంది.

ఏడు నెలలూ నిండాక నాన్నగారు తీసుకెళ్ళారు. అంతా సవ్యంగా అయింది. తొమ్మిది నెలలూ నిండాక పుట్టింది రాజ్యం.

★ ★ ★

రాజ్యమంటే ఈయనకెంత యిష్టమో! ఆడదాన్ని నాకెలాగూ తప్పదు. రోజుల పిల్లను ఎత్తుకొటమంటే మాటలు కాదు. మెడకింద చెయ్యా, నడుంకింద చెయ్యా వేసి వదిలంగా ఎత్తుకోవాలి. అమ్మ ఎత్తుకున్నప్పుడు ఓసారి రాజ్యం గుక్కపెట్టేసింది. నువ్వేదో చేసేశావన్నాను. అమ్మ ఎంత నవ్వు నవ్విందనీ! 'ఏడిశావులే! నేను మిమ్మల్ని కనలేదుటే! ఎత్తుకోలేదుటే' అంది.

అలాంటిది ఈయనే దాన్ని ఎత్తేసుకునేవారు. పదకొండోరోజు బారసాల. దాని నక్షత్రం మూల. శాంతి చేయించాలన్నారు. నూనెలో నీడ చూపించుతుంటే రాజ్యం ఎందుకో ఏడిచింది. మా అత్తగారు వాళ్ళ పోయిన అమ్మాయి వచ్చిందన్నారు. మామగారు విభూతి పెట్టారు. తంతు అవగానే ఈయన ఎత్తేసుకున్నారు. ఏడుపు మానలేదు. అమ్మ నన్ను ఒళ్ళు తుడుచుకుని పాలు యిమ్మంది. అది తాగుతూ తాగుతూ నిద్రపోయింది. పడుకోబెట్టబోతే మళ్ళీ త్రాగేది. ఆరోజు ఈయన అన్నారు - వాళ్ళ అక్కా అలా చేసేదని.

నేను భయపడిపోయాను. ఆ రాత్రి నిద్రపట్టలేదు. మర్నాడు మా అమ్మతో చెప్పి ఏడిచేశాను. ఈ చంటిగుడ్డుమీద అవిడ వాలుతోందేంటే? అని. మా అమ్మ ధైర్యం చెప్పింది. చంటిపిల్లలంతా అంతేనే పిచ్చిదానా! తాగుతూ పడుకుంటారు. లేవదీస్తే తాగుతారు. అయినా ఆ అమ్మాయి అయిదో ఏట పోయిందిట. ఆ వయసుకి ఏంకోరికలుంటాయని ఉండిపోతుందీ! అంది.

పట్టుపట్టి ఆవిడ పేరే పెట్టారు.

తొలికానుపని అయిదోనెలదాకా ఉండనిచ్చారు. చలిమిడీ, జంతికలూ చేసి నెల్లిపాలెంలో దిగబెట్టారు. రాజమండ్రి ఎప్పుడు పంపేదీ ఉత్తరం రాస్తామని, వచ్చి తీసుకెళ్ళి దిగబెట్టమన్నారు. నాన్నగారు విసుగెత్తిపోయున్నారు. 'ఇక్కడ దింపమన్నారు, దింపాను. మీ అబ్బాయే వచ్చి తీసుకెళతారో, ఎవరితోనయినా పంపుతారో మీ యిష్టం' అనేసి వెళ్ళిపోయారు.

మా నాన్నగారికి చాలా కోపం వచ్చింది. 'నీ మొహమూ, చంటిదాని మొహమూ చూసి

ఊరుకున్నారు' అంటూ మా మరిది సూర్యం నాతో వాదనకు దిగాడు. అప్పటికి ఎనిమిది నెలలనుంచి పిఠాపురంలో ఉన్నాను. ఈ పురిటికోసం మావాళ్ళు పడ్డ యాతన అంతా కళ్ళతో చూశాను. అన్నయ్యలిద్దరూ బొత్తిగా పట్టించుకోలేదు. పెళ్ళి అప్పులూ, వడ్డీలూ అంతా నాన్నగారే తీరుస్తున్నారు. నా పురుడు ఆస్పత్రిలో పెట్టారు. ఇంటికి దూరం. వేడి మంచినీళ్ళకు గూడా నాన్నగారు సైకిలేసుకుని తిరిగేవారు. ఇంటిదగ్గర అమ్మమ్మ. నాదగ్గర అమ్మ. అక్కయ్యలు వస్తారు. కాని మగపని చెయ్యలేరుగదా! వాళ్ళకో కార్డు రాసి ఊరుకున్నారు. రండ్రా అనలేదు. ఇంత కష్టపడి యింతజేసిన నాన్నగారిని వేలెడంతలేడూ వీడు తీసిపారేస్తాడా - అని చాలా కోపం వచ్చింది. దాంతో సూర్యాన్ని జలగడిగేశాను.

అత్తగారు కొడుకుని వెనకేసుకు వచ్చారు. వాడేం తప్పుమాటనలేదు. ఉన్నమాటే అన్నాడు. లోకాన్ని చూడు! ఆడపిల్లలనిచ్చుకున్నాళ్ళు ఎంత అగ్గగ్గలాడిపోతున్నారో! వియ్యంకుడిని పట్టుకుని అలా తీసిపారేస్తారా మీ నాన్నగారు! మీ మామగారు సత్యసంధుడు గనుక సరిపోయింది. ఇంకోరయితే మీ అమ్మాయిని తీసుకు వెళ్ళండనేవారు.

నా మనసు కుతకుతా ఉడికిపోయింది. నేను ఊరుకోలేదు.

మామగారు వచ్చి ఆవిడనే కూకలేశారు. సూర్యాన్ని కసిరేసి పొలం పంపారు. ఆ రాత్రికి లారీలో వచ్చారు ఈయన. రాజ్యం పక్కంతా తడిపేసింది. చల్లగా తగులుతోంది. బొంతలు మార్చాలి. అమ్మే మారుస్తుండేది చాలాసార్లు! నాకు ఒకటే నిద్ర. ఈయన గొంతు వినపడుతోంది. లైటు వెలగడం, అత్తగారి గొంతూ తెలుస్తున్నాయి. ఎవరా వచ్చిందీ అంటున్నారు మమగారు. చిన్నాడు అంటున్నారు అత్తగారు. పూర్తిగా మెలకువ వచ్చేసింది. లేచి పిల్లకి బొంతలు మార్చి బట్టలు సర్దుకున్నాను. ఈయన ఎంతకీ రాలేదు. అదే పిఠాపురంలో అయితేనా అమ్మే వచ్చి లేపేది. లేదంటే నేనే పరుగెత్తేదాన్ని! పిల్ల పుట్టాక నాలుగుసార్లయినా వచ్చారు. పిఠాపురంలో ఎంత దీనుగా ఉండేవారో! ఎమాటకామాటే అనుకోవాలి! ఎక్కడయినా యీయన నోట ముత్యాలు రాలతాయన్నట్టుండేవారు. ఎంతకీ రాలేదీయన! తెలిసిపోయింది. కొడుకుతో ఏదో చెపుతున్నారు! నాకు ఉడుకుమోత్తనం వచ్చేసింది. ఏమిటి మావాళ్ళు చేసిన అపరాధమూ! ఆయన వచ్చేసరికి ఆపుకోలేకపోయాను. వెనకా, ముందూ చూడలేదు.

అంతా విన్నారు 'పెద్దాళ్ళు వాళ్ళ గొడవలు వాళ్ళవి. మీ నాన్నగారు నాకు ఉత్తరం రాయొచ్చుగదా నన్నే తీసుకెళ్ళమని' అన్నారు. సూర్యం చిన్నకుర్రాడు' అన్నారు.'ఏం చిన్న? నాకన్న రెండేళ్ళు పెద్ద' అన్నాను. నాకన్న ఎంతమంది పెద్దో వాళ్ళెలా ఉంటున్నారో చెప్పాను. విని విసి 'నీకు పెళ్ళయిందిగదా' అన్నారు. ఏమీ అనకుండా ఊరుకుంటే వాగి వాగి నేనే ఊరుకునేదాన్ని. ఆ మాటకు నాకు ఒక్కమారు ఏడుపొచ్చేసింది. అలా యిలా కాదు. చాలా పెద్దగా,పిచ్చిదాన్లా ఏడిచాను. నా ఏడుపుకి ఆయన భయపడ్డారు కాబోలు! తలుపు తీసుకుని బయటకు వెళ్ళారు.

అంతా లోపలికి వచ్చేశారు.

ఇప్పటికీ అదంతా గుర్తే! అంత గట్టిగా ఎప్పుడూ ఏడవలేదు. మా అత్తగారు ఆ తర్వాత చెప్పేవారు

'ఒసేవ్ శాంతా! ఆరోజు నువ్వే ఏడిచాననుకుంటున్నావేమో! అది మా రాజ్యం ఏడుపు! ఆదీ యిలాగే చెవులు గింగిర్లెత్తేలా ఏడిచేది. అయిదేళ్ళ వయసులో లివరు జబ్బుతో పోయింది. పిల్ల యీనుబుల్లలా అయిపోయింది. మనిషికి పొట్టా, కళ్ళే మిగిలాయి. ఎప్పుడూ దెయ్యాలూ, రాక్షసుల కథలే అడిగేది. అసలు దెయ్యాలంటే పిల్లలు భయపడిపోతారా! దెయ్యాలెలా ఉంటాయి వాటి కాళ్ళు ఎలా వెనక్కి తిరిగుంటాయి అబ్బబ్బ! ఎన్ని అడిగేదే బాబూ! ఆనాడు గుడ్డిపీనుగనయిపోయాను. కనుక్కోలేకపోయాను. అన్నీ విని విని వెళ్ళిపోయింది. మళ్ళీ ఈ యింటిలో ఆడపిల్ల పుట్టిందనగానే మా లక్ష్మి అంటూ వచ్చింది. వచ్చింగ్గర్నుంచి ఒకటే అల్లరి పెడుతోంది. ఆరోజు చంటిదానిమీద ఆ సూరిగాడిమీద. లేపోతే ఆ చచ్చినాడి నోట మాటొచ్చేదా?




వదినగారంటే ఎంత అగ్గగ్గలాడిపోయేవాడూ! నువ్వు తప్పేజేశావు  మీ బాబు తప్పే అన్నాడు. అయినా వాడు నిన్నలా అనే మనిషా! ఆ రాత్రి నీమీద పడింది  ఏవమ్మా మా చుట్టూ తిరుగుతావేంటమ్మా  నీ పేరు పెట్టాం నిన్ను మరిచిపోలేదు  నీ తమ్ముడినీ, మరదలునీ నువ్విలా చేయొచ్చా? అంటూ బతిమాలాను. మీ మామగారు ఆంజనేయుడిని చూపించారు. అంతే! ఓ అరగంటలో పడుకునుండిపోయావు.

అప్పట్లో మా అత్తగారు ఎన్నిసార్లు చెప్పారో! నన్నెందుకు చచ్చిపోయిన మనిషి వేధిస్తోందని తెగ భయపడిపోయేదాన్ని.
ఏమాటకామాటే చెప్పాలి!

ఇప్పుడంటే ఈయన యిలా చేశారుగానీ ఆ గొడవ తర్వాత ఈయనే రాజమండ్రి తీసుకెళ్ళారు. ఆయనకెంత ప్రేమో అనుకున్నాను. ఆ మాట ఓమారు. అంటే మా చిన్నక్క అంది 'అవునమ్మా! ప్రేమే మరి! పెళ్ళాం కావాలీ, తీసుకెళ్ళాడూ'

"మొగుడి విలువ ఇప్పటికయినా నీకు తెలిసింది. మీ బావగారు చెపుతూనే వుంటారు. శాంతకి బుద్ధి వస్తుందీ అని" అంటూ పెద్దక్క మొదలెట్టింది.

రాజ్యంతో రాజమండ్రి వెళ్ళేసరికి ఈయన యింటినిండా సామాన్లు అమర్చారు. మా అమ్మగారిచ్చిన పట్టెమంచం, పాత్ర సామానూ ఉండేవి. మా మామగారు ఉప్పులూ, పప్పులూ, బియ్యమూ గట్రా పంపేవారు. పప్పులన్నీ చేయించి వెళ్ళినప్పుడల్లా మూటలు కట్టి యిచ్చేవారు మా అత్తగారు. ఈయన జీతం గట్రా నాకేం తెలీదు. నేనెప్పుడూ అడగలేదు. ఆయనా చెప్పలేదు. నేను పుట్టింట్లో ఉన్న ఎనిమిది నెలలూ ఆ యింట్లో ఓ కుర్రాడిని దింపారు. వాడూ, యీయనా అద్దె చెరిసగం చేసుకున్నారు. స్టీలు సామాన్ల సెట్టూ, డబుల్‌కాటు పరుపూ కొన్నారు. ఈయన్ని సంసార రాజు అనేది అమ్మ. చంటిపిల్ల పరుపు పాడు చేస్తుందని కూడా తెల్సు. రబ్బరు గుడ్డ కొన్నారు. కాళ్ళకి యినక ఉన్నట్టనిపిస్తే వందసార్లు తుడుచుకునేదాన్ని... ఎంత గుర్తోమరి! పీచులు కొని పడేశారు. చంటిదానికి బొమ్మలు కొన్నారు.

ఇల్లంతా చక్కగా సర్దారు. చూస్తుంటేనే కడుపు నిండిపోయేది. పరుపుమీద తెల్లటి దుప్పటి పరిచి అంచులు పరుపుకిందకి తోసిపెడితే రెండురోజులయినా నలిగినట్టుండేది కాదు. నేను ఎన్నిసార్లు చేసినా అలా కుదిరేదే కాదు. పడుకోకుండానే మడతలు పడిపోయేది. యిప్పుడదంతా తలుచుకుంటుంటే ఈయనకి ఎంత ప్రేమో అనిపిస్తుంది.

ఏం లాభం! నాతోబాటు రాజ్యం కూడా ఆకలికి కొట్టుకుపోయేది ఆ మూడురోజులూ! పగలు డ్యూటీ అయితే ఏడుగంటలకల్లా వెళ్ళిపోయేవారు. ఆదరాబాదరా పాలుకాచి, అన్నం వండి, అక్కడ పెట్టి వెళ్ళాలి. ఒక్కోసారి ఆ పాలు విరిగి తగలడేవి. ఒక్కోసారి చాలేవి కావు. నీళ్ళు కలిపి పడితే కడుపునిండేదిగాని ఆకలి తీరేది కాదు. కడుపు నిండితే గంటో రెండు గంటలో పడుకునిపోయేది. లేదంటే పావుగంటకల్లా లేచి బాకా విప్పేది. నాదగ్గర పాలుండేవి గావు. నన్ను పీకేసేది. ప్రాణాలు పోతున్నట్లుగా ఉండేది నాకు. పళ్ళు కూడా వచ్చేయేమో! కనుక్కున కొరికేసేది. ఒక్కదరువేసేదాన్ని. దాంతో పెంకులెగిరిపోయేలా ఆరంభించేది. యింటివాళ్ళకి కార్తీకమాసం ఉపోషాలు. బయట కనపడకూడదనేవారు. భుజాన్నేనుకు తిరుగుదామంటే ఆచోటు చాలేది కాదు.

ఓమారు పెద్దక్క వస్తే గోలెట్టాను.

'నీ మొఖం సంతకెళ్ళా! యింత రాద్ధాంతమెందుకే! మొగుళ్ళన్నాక అలాగే ఉంటారు. వాళ్ళని వీధిలో పెట్టుకుని మనం వీధిలో పడతామా! బయటకి పోతే యింట్లో నువ్వేలా ఉంటే మా మరిదిగారు చూడొచ్చేరూ?' అంది పెద్దక్క.

'అమ్మో' అన్నాను.

"అదేవేఁ" అంది.

"ఆయన సంగతి నీకు తెలవదులే" అన్నాను. ఇంట్లో ఏది ఎక్కడుందో ఆయనకి తెలిసినట్టు నాకు తెలవదు. ఫాక్టరీ యిల్లూనూ ఆయన



కి! ఫ్రెండ్సు ఉన్నా రాకలూ పోకలూ ఉండేవి గావు. సిగరెట్టు, పేక, పుస్తకం, ఆఖరికి సినిమా గూడా ఆయనకి లేదు. ఇరవై నాలుగ్గంటలూ యిల్లు సర్దటం 'అగ్లాను అక్కడొదిలేశావూ', 'యీ పక్క ఎత్తలేదూ', 'యిక్కడ తుడవలేదూ' అని తినేసేవారు. ఈయన నెల్లిపాలెం వెళితే ప్రాణం సుఖంగా ఉండేది. ఏదో వండుకు తినేదాన్ని. పొద్దుట్నించి సాయంకాలం దాకా నిద్రే నిద్ర. అలాంటి మనిషికి నేను యింట్లో కలిపేసానని యిట్టే తెలిసిపోతుంది. అనుమానంలేదు'' అన్నాను పెద్దక్కతో! అనుభవించమంది పెద్దక్క.

చిన్నక్కయితే అందీ ''దాందేముందే! డైరెక్టుగా చెప్పెయ్! ఏం చెయ్యమంటాడో తెలిసిపోతుంది''

''ఆయన చిన్నబావగార్లాంటాయన కారు'' అన్నాను.

''కాపోతే పోయార్లేవే... యివన్నీ కుదరటం లేదని చూడరాదూ''

''చంపేస్తారు'' అన్నాను. ''ఎప్పుడయినా కొట్టాడా నిన్ను?'' అంది ''లేదు'' అన్నాను. ''నిజంచెప్పు'' అంది.

నిజమే! పెళ్ళయ్యాక నన్ను గట్టిగా కసరలేదుకూడా! ఆ మాటకొస్తే కామేశ్వరి పుట్టాక మొదటిసారి చెయిజేసుకున్నారు.

''కొట్టకపోతే భయమెందుకూ?'' అంది.

''కొడితేనే భయపడాలా?'' అని అడిగాను. ఏం చెప్పిందో గుర్తులేదు. దానివన్నీ చిలకపలుకులు అంటుంది అమ్మ. అది వాళ్ళాయన మాట్లాడినట్లు మాట్లాడాలనుకుంటుంది. ఆయన కథలూ అవీ రాస్తారుగదా! కథలన్నిట్లోనూ ఏముంటుంది? మొగుళ్ళు పెళ్ళాలను చీరేస్తారు. అత్తగార్లు కోడళ్ళను కాల్చేస్తారు. లేదూ అంటే మొగుళ్ళని పెళ్ళాలు వేయించుకు తింటారు. అత్తగార్లకి అన్నం పెట్టరు. యింతేగదా దిక్కుమాలిన కథలు! చిన్నక్క అవన్నీ నిజమేననుకుంటుందిగాబోలు! వాళ్ళాయన అంటే నిజమనుకోక చస్తుందా?''





అదేం చెప్పలేకపోయినా ఈయనతో నేనేం అనలేదు. మా పెద్దక్క అన్నట్లు మగాళ్ళకి ఆడాళ్ళ యీతి బాధలు తెలీవు!

రాజ్యానికి ఏడాది తిరిగే సరికి నాకు నెల తప్పింది. నన్ను పంగనామాలాయన దగ్గరకి తీసుకెళ్ళారు ఈయన.

★ ★ ★

అసలు పేరేంటో నాకు తెలీదు. మా వాళ్ళంతా పంగనామాలాయన అనేవారు. మా పెళ్ళికి కూడా వచ్చారుట. మా అత్తారింట్లో ఓ మాటాడారంటే రెండుసార్లు ఆయన పేరు వచ్చేది. ఆయనంపే వాళ్ళకి చాలా గురి.

మా కాముడు పుట్టేదాకా ఆయన దగ్గరకి బాగా తిరిగేవారు. తేనె అనీ బెల్లమనీ చెరుకులనీ ఒకటేమిటి అన్నీ పట్టుకెళ్ళేవారు. గేదె యీనితే ఓ పూట పాలతో జున్ను వండి పట్టుకెళ్ళి యిచ్చేవారు. మామిడికాయ దిగేనరికి ఆవకాయకి ముక్కకొట్టించి బుట్టల్తో పట్టుకెళ్ళేవారు. పళ్ళు సరేసరి! మొదటి ఫలం ఆయన తినాలని మా మామగారు ప్రాణాలు తినేసేవారు.

పచ్చగా దబ్బపండులాగుండేవాడాయన. ఒళ్ళంతా విభూతికట్లూ, పైన ఎర్రటి శాలువా, సిల్కు పంచె, మెడలో రుద్రాక్షమాల, అంత ఎత్తు ఉండేవారు. ఆయన జాతకం చెపితే జరిగే తీరుతుందిట. ఆయన ప్రశ్న చెబితే పోయిన గేదెలూ, తప్పిపోయిన పిల్లలూ వెళ్ళి తెచ్చేసుకోటమేనట.

జ్యోతిష్యంలో నా గొప్పతనమేం లేదు. అంతారాసి ఉంటుంది. నాకు చదవటం వచ్చు. అంతే! జరగబోయేదాన్ని ఎవరయినా తప్పిస్తామంటే మహామోసం! నేను ఏదీ తప్పించలేను, అనేవారట ఆయన. మా ఆయన అప్పట్లో ఆయన గురించే మాట్లాడుతుండేవారు.

ఆయనది తుని. కొత్త తోటలో చాలా పెద్ద యిల్లు. భూములూ వ్యాపారాలూ చాలా ఉన్నాయిట. నన్ను వాళ్ళు ఆరోజున ఎంతో ఆదరించారు. ఆవిడ పార్వతీదేవిలా ఉండేది. రాకరాక వచ్చానని నాకు ఆవిడ చీరా రవికల గుడ్డా పెట్టారు. ఓ రోజు వాళ్ళింట్లో ఉన్నాం. రాజ్యాన్ని కిందకి దింపలేదు వాళ్ళు.

నీకు మగపిల్లాడు పుడతాడమ్మా అన్నారా యన. ఈయన మొహం వెలిగిపోయింది. నా సంగతి సరేసరి! గాలిలో తేలిపోయాను. ఆయన పాదాలకు వంగి దణ్ణంపెట్టాను. సౌభాగ్యవతీ భవ అని ఆశీర్వదించారు.

తిరుగుప్రయాణంలో నెల్లిపాలెం వెళ్ళాం. ముందుగా యిక్కడ దిగొచ్చుగదా! అంతా కలిసే వెళుదుం. నీకు మరీ అంత డబ్బు జాగ్రత్త ఎవరు నేర్పారో, అని మా అత్తగారు అంటిస్తారని తెగ భయపడ్డాను. మనవడు పుట్టబోతున్నట్లు గుమ్మంలో దిగగానే ఈయన తెలివిగా ఊదేసారు. మా అత్తగారు దాంతో నన్నుకాలు కిందపెట్టనీయ లేదు.

బ్రహ్మావాక్కు. అన్నారంటే జరిగి తీరు తుంది, అన్నారు మామగారు. మా తోటి కోడలు నాకు దిష్టి తీసింది. తీస్తూ తీస్తూ వీళ్ళంతా యిలాగే అంటారు. ముగ్గుర్ని కన్నాను. వెర్రి మొగుణ్ని పెట్టుకుని కన్నాను. ముగ్గురూ మగా ళ్ళే! అందుకే విలువలేకపోయింది. నువ్వు గడుసుదానివి. తెలివిగా ఆడపిల్లనుకన్నావు. యిప్పుడు మళ్ళీ నెల తప్పేసరికి మురుసుకు పోతున్నారు, అంది. ఆ ధోరణి అలవాటయినా ఆ మాటకి కష్టం వేసింది. అత్తగారితో అన్నా ను, ఆవిడ అన్నారూ, అది ఉడుకు మోతుది! ఎవరి అదృష్టం ఎవరికొస్తుందీ! దాని మొగు డునీ, నీ మొగుడునీ మేమే కన్నాం. వాడలా అయిపోయాడు. దానికోసం మేం పిచ్చి కొడు కుని కన్నామని ఏడుస్తుంది. అయినా వాడికేం పిచ్చి, అమాయకుడుగాని.

పిఠాపురం కూడా వెళ్దామని ఈయన్ని అడి గాను. ఏ కళనున్నారో నాన్నగార్ని అడిగి చెపుతా నన్నారు. ఆయనా "పోన్లేరా ఉత్తి మనిషి కాదు కదా కడుపుతో ఉన్న పిల్లకు కోరికలు తీర్చక పోతే చీలిపిల్లలు పుడతారు'' అన్నారు.

అన్ని జాగ్రత్తలూ చెప్పి పంపారు అత్తగా రు.

పిఠాపురంలో మా అమ్మ చాలా సంతో షించింది. ''పోన్లే తల్లీ! మగ కుర్రాడు పుడితే మీ వాళ్ళు పొంగిపోతారు. పురుడూ అదీ అయి సుఖంగా నువ్వుంటే అంతేచాలు!'' అంది. ''పెద్దాయనకి నమస్కరించావుగదా! అదే బలం నీకు'' అన్నారు నాన్నగారు. ఓ వారం నన్నుంచమని ఈయన్ని అడిగారు. వెంటనే ఒప్పుకున్నారు. పంచాంగం చూసి ముహూ ర్తం పెట్టి ఆరోజుకి నన్నుతీసుకొచ్చి రాజ మండ్రిలో దింపమని చెప్పి వెళ్ళిపోయారు.

అమ్మ నన్ను దిగబెట్టింది. ఏమనుకున్నారో ఏమో! అమ్మకి చీర కొని పెట్టారీయన. ఇదేంట య్యా మేం మీకు పెట్టాలి గానీ, అంది అమ్మ. దాందేముంది ఎవరు ఎవరికి పెట్టినా తప్పులే దు, అన్నారు.

వెళ్తున్నప్పుడు మా అమ్మ ఈయన్ని అడి గింది ''కానుపు కష్టమయింది రాజ్యం సారి. కుట్లు కూడా పడ్డాయి. ఈ సారయినా డాక్టరుకి చూపించు''

''అవసరంలేదు. పంగనామాలాయన చె ప్పారు, పండంటి కొడుకుని కంటుంది మీరు కంగారు పడకండి'' అనేశారు.

అమ్మను దిగబెట్టడాన్కి బస్టాండుకి వెళ్ళాం. ఆయన దూరంలో ఉండగా అమ్మ నా చెయ్యి పట్టుకుని కళ్ళనీళ్ళు పెట్టుకుంది. 'యివెక్కడి మాలో కాలే బాబూ' అంది.

అమ్మతో అన్నాను, ''ఎందుకే అంతలా యిదయిపోతావూ! నాకేం అవదు''

అమ్మ ఊరుకోలేదు. అయిదో నెలలో నాన్న గార్ని పంపి పిఠాపురం రప్పించుకుని డాక్టరు కి చూపించింది. ఆవిడ అన్నీ పరీక్షించి కొంచెం తేడా ఉంది. నెలనెలా చూపించుకో వాలి. రక్తం తక్కువుంది, అంది. అమ్మ గుండె ల్లో రాయిపడింది. నాన్నగారు డాక్టరుతో విడిగా మాట్లాడారు. రాజమండ్రిలో ఓ డాక్టరుకి ఉత్తరం యిచ్చింది ఆవిడ. నెల రోజుల ముందునించి ఆస్పత్రిలో అవసరమయితే చే ర్చాలంది డాక్టరు. ఇవన్నీ అమ్మా నాన్నగారూ నాతో అనలేదు.

నాన్నగారు నాతో రాజమండ్రి వచ్చారు. ఓరోజంతా ఉన్నారు. ఈయనని బయటకు తీసుకెళ్ళి మాట్లాడారు. మీదంతా ఉత్తి భయం, అన్నారట ఈయన. మరెలా నాన్నగా రు చెప్పారో, ఈయన సరేనన్నారో మొత్తం మీద డాక్టరుకి చూపిస్తానన్నారు, చూపించారు.

ఏడో నెలలో పంపనన్నారు మామగారు. ఎనిమిదో నెల నిండిన తక్షణం తీసుకెళ్ళి ఆస్పత్రిలో చేర్చారు నాన్నగారు. ఈయనకి మా వాళ్ళ కష్టం సుఖం తెలిశాయనుకుంటాను. ఓ నాలుగొందలు నా చేతిలో పెట్టి నెల రోజులు ఆస్పత్రి అంటే మాటలు కాదు. మీ వాళ్ళకి ఎలాగో యియ్యి, అన్నారు.

పురుడు కష్టమయింది. పిల్ల అడ్డుబడింది. సిజేరియన్ చేశారు. కామేశ్వరి పుట్టింది.



నాకు చాలా బాధ కలిగింది. మనసంతా కోరేసినట్టయిపోయింది. మగ బిడ్డ పుడతాడని ఎంత ఆశపడ్డానూ. ఎన్ని కలలు గన్నానూ! ఏమీ అనుకోకపోతే ఎలా ఉండేదో! మగపిల్లడంటే బాలకిష్టప్పే గుర్తొచ్చేవాడు. వెన్న తింటూనో మట్టి తింటూనో యింతంత బుగ్గలతో తలమీద నెమలి ఫించంతో అమ్మని యిల్లూ వాకిలీ తిప్పించే కిట్టప్ప ఎంత భాగుంటాడనీ! కాముడు బాగోకపోలేదు. ఆస్పత్రిలో దాంతో పుట్టిన వాళ్ళలో అదే బరువుట. అంతా రావటం చూట్టం. అందరి దృష్టి తగుల్తుందని అమ్మమ్మ దాని ఒంటినిండా గుడ్డలు కప్పేసి పడుకుందని చెప్పేసి ఎవరికంటాబడకుండా దాచేసేది.

అంతబాధగా ఉన్నా దాన్ని చూస్తుంటే ఆ బిగుసుకున్న పిడికిళ్ళూ అటూ యిటూ కదిలే కళ్ళూ చూస్తుంటే చెప్పలేని ఆనందంతో మనసు నిండిపోయింది.

అమ్మమ్మ అంది, 'రెండోదీ ఆడముండేనా!', అని. ఆ రోజంతా ఏడుస్తూ కూర్చున్నాను. ఎందుకూ అంటే నాకూ తెలీదు.

"పోన్లే తల్లీ! నువ్వూ అదీ సుళువుగా ఉన్నారు. బయట మీ నాన్నగారి భాగోతం చూడాలి. పెద్దాపరేషన్ అనేసరికి ఆయన అల్లాడిపోయారు" అంది అమ్మ.

ఏమీ అనకపోయినా నాన్నగారికీ బాధగానే ఉన్నట్టుంది. 'ఒకరికిద్దరు! రానురాను ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చెయ్యలేం' అన్నారట అమ్మతో.

మా చిలకపలుకుల చిన్నక్క అందీ, మగయితే ఏం ఆడయితే ఏం ఈ రోజుల్లో ఆడపిల్లలే నయం. మనల్నే చూడూ- అన్నయ్యల కన్న వెయ్యిరెట్లు నయం. వచ్చి కూడా చూడటంలేదు ఎక్కడ అంటుకుపోతుందోనని.

మా చిన్నన్నగాడు వేళాకోళం పట్టించాడు 'పెళ్ళిళ్ళ గురించి బెంగెట్టు కోకే! మేనమామలమున్నాంగదా ముడెట్టేసుకుంటాం'

అందరూ అలా అంటున్నారు. పంగనామాలాయన చెప్పారు అవుతుందనుకున్నాను. ఆడపిల్లముచ్చట తీరింది. మగపిల్లాడుంటే అదో సర్దా అనుకున్నాను. మా వాళ్ళను పట్టించుకోకపోయినా అత్తారు ఏమంటారోనని హడిలిపోయాను.

నన్నూ పిల్లనూ చూడటానికొచ్చారు ఆయన. పిల్ల నక్షత్రం మంచిదే అయినా మూనెలోనే దానిమొహం చూస్తానన్నారు. అమ్మమ్మ దాన్ని పక్కకి తీసుకెళ్ళింది. ఈయన ఒక్కముక్క దాని గురించి అడగలేదు. ఎలా ఉంటుందేంటని రాజ్యం సారి చంపేశారు. ఇలా ఆపరేషనూ అదీ అయిందని నాన్నగారు రాసినట్టున్నారు.

"యీ డాక్టర్లంతా దొంగలు. డబ్బులకోసం అక్కర్లేని ఆపరేషన్లు కూడా చేస్తారు. పోన్లే నీకు బాగుందిగదా" అన్నారు ఈయన.

ఇరవయ్యొకటో రోజున బారసాల.

మా అత్తగారూ మామగారూ దిగారు. నేను భయపడిపోతుంటే చిన్నక్క కసిరేసింది "నువ్వే ఏదో తప్పుచేసినట్టు యిదయిపోతూంటే వాళ్ళింకెన్ని అంటారే నిన్నూ. ఆడోమగో నీ చేతుల్లో ఉందా పిచ్చిగానీ"

"బావుందోసేవ్! కన్నాక వాళ్ళు అనకా మానరు. ఇది పడకా మానదు. భయపడకపోతే




ఏం చేయాలీ'' అంటూ పెద్దక్క అడ్డదిడ్డంగా మొదలెట్టింది.

భయపడ్డంతా అయింది ''నువ్విలాంటి పని చేస్తావనుకోలేదు'' అంటూ మా అత్తగారు తిట్టడం మొదలుపెట్టారు. మా పెద్దక్క ఏదో పొరపాటైపోయిందత్తయ్యగారూ, అంటూనే వాళ్ళాయనకి కాఫీలో పంచదార సరిపోయిందో లేదో కనుక్కోటానికి వెళ్ళిపోయింది.

మా చిన్నక్క ఊరుకోలేదు ''పెద్దవారు మీరు! పిల్లల్ని కన్నారు! లోకాన్ని చూశారు! ఏ ఆడదీ తన యిష్టం వచ్చినట్టు పిల్లల్ని కనలేదు! ఆ మాత్రం తెలీదా?''

అది మామూలుగానే అన్నా మా అత్తగారికి చాలా కోపం వచ్చింది ''నన్నింత మాట అంటుందా యీ మనిషి. నా కోడలూ నా మనవరాలూ గనక అన్నాను. ఈవిడెవత్తి మధ్యలో! యీ గుమ్మంలోకెందుకు అడుగుపెట్టానూ వీళ్ళని చూశా... నా కోడల్ని చూశా'' అంటూ జాడించేశారు.

నీకెందుకే దిక్కుమాలిన పీనుగా అని మా అమ్మ వచ్చి చిన్నక్కని తిట్టి, తప్పయిపోయింది కాయండనే వరకూ ఆవిడ ఊరుకోలేదు. చిన్నక్క మొహం చిన్నబోతే నాకు చాలా బాధేసింది.

''ఏం - చేస్తాం! మన మాటెక్కడ చెల్లుతుందే'' అంటూ మా అమ్మ వచ్చి బ్రతిమాలే దాకా చిన్నక్క అన్నం కూడా తినలేదు. బారసాలయిపోయింది. మా మామగారి తల్లిపేరు పెట్టారు. మామగారు మాత్రం నన్నేం అనలేదు.

అయిదో నెలలో నన్ను తీసుకెళ్ళారు.

మా అత్తగారు ముభావంగా ఉన్నారని నాకు తెలీలేదు. మా తోటికోడలు అంది, ''అవునూ! అదేం పని చేశావూ! వచ్చిందగ్గర్నుంచి ఆవిడ తెగ గింజుకుపోతోంది. కంటే కంది ఆడపిల్లను, వాళ్ళ అక్కల చేత పేడనీళ్ళు జల్లిస్తుందా నాకు, అంటూ ఏడుపు. పోన్లెండత్తయ్యగారూ అది మాత్రం కావాలని చేసిందా అన్నాను పొరపాటున. అంతే నామీద విరుచుకుపడిపోయింది''

ఎన్నాళ్ళయినా ఈయన లేకుండా నెల్లిపాలెంలో పరాయిగా ఉండేది. పది రోజులుండమని ఈయన రాజమండ్రి వెళ్ళిపోయారు. మూడో రోజు మధ్యాహ్నం నాకు బాగా గుర్తు, మా అత్తగారు మధ్యాహ్నం టిఫినుకు సున్నుండలు చేశారు. మా అత్తగారు వంటలు చాలా బాగా చేస్తారు. సున్నుండలు మరీనూ! ప్రతిరోజూ తొమ్మిదీ పదీ అయేసరికి భోజనాలు అయిపోతాయి. మామగారు ఓ కునుకు తీసిలేచేసరికి ఏదో ఒకటి తినటానికి ఉండాలి. తర్వాత కాఫీ.

ఆరోజు సున్నుండలు తింటున్నారు. నేనూ మా తోటికోడలు లోపలి మండువాలో కూర్చుని తింటున్నాం. రాజ్యం చేతిలో పెట్టిన ఉండ తింటూ మట్టిలో పడేసుకుని ఏడుపు మొదలెట్టింది.

వీధి వసారాలో మామగారు మడత మంచం మీద కూర్చునున్నారు. అత్తగారు అక్కడ సున్నుండల డబ్బాతో కూర్చునున్నారు. మామ్మని అడగమని రాజ్యాన్ని పంపాను, ''దిక్కుమాలిన ఆడముండలు మా కొంపలోకి తగలడుతున్నారు. తిన్నంత తిని పారేసినంత పారెయ్యడానికి యిక్కడ రాసులేం పోసుక్కూచోలేదు. వీళ్ళకి పెళ్ళిళ్ళు చేయలేక రేపు నా కొడుకు ఉరేసుకోవాలి, అంటూ ఆవిడ చెయ్యి విసురుగా తగిలిందో అదే భయపడి జారిందో అరుగుమీంచి పడింది.

తల్లో తల్లో- అంటూ ఒక్క అంగలో బయట కురికాను. రాయిమోసేసింది రక్తకొల్లయిపోయింది. మామగారు లేచివెళ్ళి అత్తగారిమీద చెయ్యి చేసుకున్నారు.

''యింకోమారు పిల్లల్నంటే పీకపిసికేస్తాను. మన కుటుంబంలో మూడు తరాల తర్వాత ఆడపిల్లలు పుట్టారు. మహాలక్ష్ములు పుట్టారు. మగపిల్లల్దేముందే, తిన్నగా వుంటే పుట్టినింటికే పేరు. ఆడపిల్లలు పుట్టినింటికీ మెట్టినింటికీ పేరు తెస్తారు. అయినా వాళ్ళ తప్పేముంది? దాని తప్పేముంది! ఆ ముసలి ముండాకొడుకు పంగనామా లాయనది తప్పు! మాటలో పట్టు తగ్గుతోంది. ఎక్కడ ఏం మైలపడుతున్నాడో ఏంటో! ఆ ముండాకొడుకు సరిగా చెప్పేడిస్తే మనకి ఆశాలేకపోను, బాధాలేకపో

ను'' అంటూ దులిపేశారు.

పాపం! అత్తగారు, మామగారు అలా దులిపేస్తుంటే కిమ్మన్నాస్తి. నేను పిల్లకి దెబ్బ కడుగుతూంటే కాళ్ళు తొక్కుకుంటూ వెనకనే ఉన్నారు. ఆయన అదో యిదో అంటమూ ఆవిడ గసరడమూ ఉండేదిగాని ఆయన చెయ్యి చేసుకోడం నేను ఎన్నడూ చూడలేదు. కాఫీగుండ వేసికట్టు కట్టారు అత్తగారు.

ఈయన వచ్చి పంగనామాలాయన చేత ముహూర్తం పెట్టించి తీసుకెళ్తానన్నారు. ఆ మనిషి పేరు నా దగ్గర ఎత్తొద్దు, అనేశారు మామగారు.

రాజ్యం దెబ్బ ఎంతకీ మానుబట్టలేదు. యింజక్షన్లూ మందులూ యిప్పించాక తగ్గింది. డాక్టరు అశ్రద్ధ చేశారని తిట్టాడు.

పండగకి పిఠాపురంవెళ్తే మా అమ్మ కదిపింది. "ఏవే! మళ్ళీ ఏం లేదా? నేనేం మాట్లాడలేదు. నాకు ఏడుపుగా ఉంటోంది. ఈయన నన్నసలు చూట్టం లేదు. అహర్నిశలూ యింటిపట్టునే ఉంటారుగనక బయట ఎక్కడన్నా తిరుగుతున్నారేమోనన్న అనుమానం లేదుగానీ లేపోతే...

అమ్మ అడగడంతో ఏడుపు ఆగలేదు.

ఏంటయిందేంటయిందంటూ అక్కలూ అమ్మా చుట్టేశారు. అమ్మ తను అడిగింది చెప్పింది. మా పెద్దక్క మొదలెట్టింది.

"అవునుమరి! మా మరిదిగారు మాత్రం ఏం చేస్తాడూ! మళ్ళీ మరో ఆడపిల్లను నీకేం నువ్వుకంటావు. మొయ్యాల్సిందతను. ఇంకా నయం! నేనలా ఆడపిల్లల్ని కంటే ఈయన నన్ను వదిలేసి పోదురు. ఏమాటకామాటే అనాలి. రాజాగుణం ఆయనది''

నీ మొగుడు పిలుస్తున్నట్టున్నాడు చూడూ, అంటూ దాన్ని పంపేసింది అమ్మ. చిన్నక్క నన్ను దగ్గరకి తీసుకుని 'ఏడవకే! ఎందుకొచ్చిన గొడవ. ఆపరేషన్ చేయించుకోమను ఆయన్ని', అంది.

మా అమ్మకి బాధేసింది, "ఏంటమ్మా ఆ సలహాలూ ఓ మగ నలుసులేకుండా చేసుకోమంటావూ'' అంది. ఆ ఉచిత సలహా చిన్నక్క చాలా సార్లిచ్చింది. అమ్మ ఎప్పుడూ ఒప్పుకోలేదు. మూడోసారి చూడాల్సిందే అంటుందావిడ. అపుడూ ఆడపిల్లయితేనో అంటుంది చిన్నక్క. లేదమ్మా నీకు తెలవదు, మూడోసారి తప్పకుండా వరస తప్పుతుంది. తిరపతి వెళ్తామని మొక్కుకో, అంటుంది అమ్మ.

చిన్నక్కకి పెళ్ళవకముందు చాలా భక్తి ఉండేది! ఇప్పుడన్ని గొప్పలూ వచ్చాయి. నోటికో హద్దూపద్దూ ఉండటంలేదు- అంటుంది అమ్మ. తిరపతి మొక్కుకో! అన్నారం మొక్కుకో! కనకదుర్గకి మొక్కుకో. అస్తస్తమానూ అమ్మ అంటుంది. వాళ్ళంతా నీకు పిల్లల్నిస్తారు. అనేది చిన్నక్క.

ఆ రెండురోజులూ నన్ను వదల్లేదు చిన్నక్క. నేను చెప్పేసాను. 'ఇలాంటి మగాళ్ళు ఉంటారా?' అని ఆశ్చర్యపోయింది. నేను తలొంచుకు కూర్చున్నాను.

"నువ్వు ఆయనతో మాట్లాడు. మనసులో ఏం పెట్టుకున్నాడో చెప్పమను''

"ఛీ! అంత సిగ్గులేకుండా నేను అడగను'' అన్నాను.

"అయిదోఏడు నడుస్తోంది పెళ్ళయి, కాపురంచేస్తూ- ఆ మాత్రం అడగలేవూ. ఒళ్ళంతా ఉంటే మూతిమీద కొడతాడా'' అంది. అది యింకా చాలా చెప్పింది. అవన్నీ విని ఈయన నాకు కాకుండాపోతారని బెంగెట్టుకున్నాను.

తీరా రాజమండ్రి వెళ్ళాక ఈయనతో మాట్లాడలేకపోయాను.

ఓరోజు సూర్యం నెల్లిపాలెంనుంచి వచ్చాడు. వెంటనే మేం బయల్దేరాలిట. ఎందుకన్నాను 'స్వామివారు రమ్మన్నారు' అన్నాడు.

'ఎవరాయన?' అడిగాను.

"ఆయన కాదు. ఆవిడ'' అన్నాడు.

నాకు అర్థంకాలేదు. సూర్యం చెప్పటం మొదలుపెట్టాడు. ఈయన మిల్లునుంచి వచ్చేదాకా చెపుతూనే ఉన్నాడు. వచ్చాకా చెప్పాడు. ఆ రాత్రంతా అవే కబుర్లు. మర్నాడు మేం బస్సు ఎక్కేకా బస్సులోనూ అవే కబుర్లు.

★ ★ ★

బాచన్నయ్య కరిణీకం పరీక్ష పాసయిపోయిన





ట్టే వదినా అన్నాడు సూర్యం.

ఆ మాటకి ఈయనయితే ఎంత ఆశ్చర్యపో యారో!

నిజమే మరి! అది ఎనిమిదో వింతే! అతగా డు చదవడనికాదు. రాత్రింబవళ్ళు పెంకులెగి రిపోయేలా గొంతుక పెంచి మరీ చదువుతా డు. వినివిని ఆ చదువు నాకు వచ్చేసింది. అతనికి వచ్చింది కాదు. శంకరంపాలెం కర్ణంగారని మా అత్తగారికి వేలువిడిచిన తమ్ముడు. ఆవిడని ఏడాదికోమారు తీసుకెళ్ళి కథాకార్యాలకు బట్టలు పెట్టేవాడని మహా ఆపేక్ష అనీ అనేవారు. ఆయనకి ఒక్కత్తే కూతురు. సత్యవతి. దాన్ని భాస్కరానికి అను కునేవారు. వాళ్ళిద్దర్నీ నించోబెట్టి ఎత్తులు చూసారని కర్ణంగారి భార్య దుమ్మెత్తిపోసింది. నా పెళ్ళిలో విడిదిలో గోలయిందిట. భాస్కరం ఆ పిల్ల నెత్తిన ఏదో రాసాట్ట. ఆవిడ మా అత్తగారిని జలగడిగేసారట. 'నీ కొడుకు నా కూతురి కాలిగోటికి రాడు' అందిట. 'ఏం నీ కూతురు రంభా ఊర్వశీనా నా కొడుకు వెంటబ డటానికీ' అందిట మా అత్తగారు. కర్ణంగారు వచ్చి యిద్దర్నీ నోరు మూయించారుట. 'నువ్వు కరిణీకం పరీక్ష అవు! నా కూతుర్నీ నా కరిణీకా న్నీ యిస్తాను' అన్నారుట. మా తోటికోడలాత ర్వాత ఏం రాసాడో రాబట్టింది. ఈ కథంతా ఆవిడే మొదట నాతో చెప్పింది 'వీడేదో వాళ్ళ అన్న తంతేననుకున్నానే శాంతా! కొండదొర ల్నించి వశం చేసుకునే మందు తెచ్చి దాని మాడున పెట్టాడు. అమ్మో! అందుకే వీడి వెనకాతల వెర్రికుక్కలా తిరుగుతోంది'

భాస్కరం చాలా కష్టపడి చదివాడు. మా మామగారు డబ్బులు కట్టి పరీక్ష చేయించా లని కూడా చూసారట. శంకరంపాలెం కర్ణంగా రు కూతురి పెళ్ళి చేసేశారు. మామగారొక్కరే వెళ్ళారు. అత్తగారు మనసు కష్టపెట్టుకున్నా రు. భాస్కరం సరేసరి! ఆడపిల్లలా ఏడిచాడు. 'పరీక్ష పాసవకపోతే నాదా తప్పు' అంటూ ఏడిచాడు. మా తోటికోడలు నవ్వులు. 'ఆడారి వెధవా' అని అత్తగారి తిట్లు.

అలాంటి వాడు పరీక్ష పాసయ్యాడా?

'అవునన్నయ్యా' మనకీ మనూరికీ దశ తిరి గిపోయింది. సాక్షత్తూ ఈశ్వరుడే ఆ స్వామి. నాన్నగారిని పిలిచి 'మీ సోమసుందరాన్ని పిలువ్! వాడికి మగపిల్లల్లేరు! నేను యిస్తాను' అన్నారు.

ఈయన వెంటనే దణ్ణంపెట్టుకుని చెంపలే సుకున్నారు. 'నిజంగానా' అన్నాను.

ఆ ముక్కకి సూర్యానికి ఎంత కోపం వచ్చిందనీ 'నువ్వంతేలే వదినా! నువ్వు నమ్మ వులే! నీ కళ్ళతో చూస్తే నీకు తెలుస్తుంది. నువ్వు స్వామి కాళ్ళమీద పడకపోతే నా చెవికో యించుకుంటాను. రాయప్పారావు ఏం చేసాడో తెలుసా?'

ఈ రాయప్పారావుది మా వూరేట. నెల్లిపా లెంలో జనానికి అతనంటే మహాభయమట. ఒక్క మా మామగారికే అతను తలొంచుతా డట. ఒకప్పుడు సారాబట్టీలుండేవిట. యిప్పు డేమో సారా దుకాణం ఉందిట. మా తోటికోడ లు చాలా రహస్యాలు చెప్పేది. అన్ని రహస్యా లు ఆవిడకెలా తెలుస్తాయో! మా యింట్లో పని చేసేవాళ్ళూ పాలికాపుల ఆడంగులూ ఆవిడతో నవ్వుతూ కబుర్లు చెప్పేవారు.

"వదినా! రాయప్పారావంటే మజాకాగాదు. ఓరోజు స్వామి దగ్గరకొచ్చి నీ దుకాణం ఎత్తించే స్తానని రంకెలు వేశాడు. స్వామి ఆ భక్తులి చ్చిన ఆహారం తీసుకుంటున్నారు. ఏంటవు తుందోనని అంతా గడగడలాడిపోతున్నారు.

'ఏరా మూర్ఖుడా! నేనెవరో తెలుసా నీకు' అన్నారు స్వామి. అంతే! అంబోతులా రంకెలు వేస్తున్నవాడు ఆగిపోయాడు 'ఈశ్వరా ఈశ్వరా' అంటూ కాళ్ళమీదపడిపోయాడు"

సూర్యం యిలాంటి మహిమలు ఎన్నో చె ప్పాడారోజు. ఈయనకి యింకా గురిపెరిగిపో యింది. మగపిల్లాడిని యిస్తానన్నారా- అంటూ పదేపదే అడిగారు. నాకయితే చాలా భయం వేసింది. మా మరిది చెప్పిందాన్నిబట్టి ఆ స్వామిని శంకించినా పరీక్షించినా వాళ్ళపని అయిపోయినట్టే.

ఎవరో కొండదొరలు వచ్చారట. వాళ్ళనుంచే మా భాస్కరం వశం మందు తెచ్చాట్ట. మా మామగారి దాయాదులు చేసిన చేతబడికి వాళ్ళే విరుగుడు చేసారట! అలాంటివాళ్ళు "యీ స్వామిలో ఏముందీ గాడిదగుడ్డు"

అన్నారుట. ఊళ్ళో కిట్టనాళ్ళు రప్పించారుట వాళ్ళని. స్వామి ఆ టయిముకి శవంగా మారి వున్నారట. పార్వతిగారు స్వామి భర్త యిప్పుడు కాదు తర్వాత రమ్మన్నారుట. వాళ్ళు గీరగా తోసుకువెళ్లార్ట. అంతే! రాళ్ళలా నిలబడిపోయారుట. సరిగ్గా నాలుగ్గంటల తర్వాత స్వామి మళ్ళీ బతికారుట. వాళ్ళని మనుషులుగా మార్చి "మళ్ళీ ఈవేపు కనబడకండి మూర్ఖుల్లారా- అని తరిమేసారుట. వాళ్ళని పంపినవాళ్ళకు దురదలూ మంటలూ పట్టుకున్నాయిట. తెల్లారేసరికి వచ్చి కాళ్ళమీద పడ్డారట. అప్పుడు వాళ్ళ మంటలు తగ్గాయిట.

సూర్యం మహిమలు చెపుతూనే ఉన్నాడు. నేనేదయినా అడిగితే ఈయన గసిరేస్తున్నారు. అతను చెప్పినవన్నీ నాకు గుర్తులేవుగానీ ఈయన కసుర్లు గుర్తున్నాయి. ఈయన ఎందుకు కసిరారో నేనేంటన్నానో గుర్తేలేదు.

సూర్యం ఆరోజు చెప్పినదాన్నిబట్టి-

ఈ స్వామి అందర్లాగా పుట్టలేదుట. వాళ్ళ అమ్మకీ నాన్నకీ ఈశ్వరుడు కలలో కనిపించాడట. మీరు వెంటనే కాశీవెళ్ళండి. అక్కడ మీ గర్భాన పుడుతాను అని చెప్పాడట. కాశీవెళ్ళారుట. విశ్వనాథుని ఆలయం నుంచి ఓ వెలుగు వచ్చి వాళ్లలో కలిసిపోయిందిట. ఇద్దరూ స్పృహతప్పారుట. ఇరవైఏడు నెలలు ముత్యాల గర్భంతో వున్నాక ఈవిడ పుట్టిందిట. పుట్టగానే తల్లి నమస్కరించి చనిపోయిందిట. స్వామి ఆరోఏట తండ్రి చనిపోయాడట. పదహారోఏట పార్వతి రోడ్డుమీద పోతున్నాడట. 'ఒసేవ్' నిన్ను పెళ్ళాడుతానన్నారుట. అంతే వాళ్ళకి పెళ్ళయిపోయిందిట. అతను కలకత్తాలో పనిచేసేవారుట. అక్కడ క్వార్టర్సులో ఉండేవారుట. ఓరోజు స్వామి పార్వతిని పిలిచి 'ఒస్సేయ్' నేను రేపు రాత్రి చనిపోతున్నాను' అందిట. ఆయన హడలిపోయాట్ట. 'ఒసేవ్' నువ్వు మూర్ఖుడివి! ఈశ్వరునికి మరణం ఏంట్రా? నా శవాన్ని నువ్వు కాల్చకు. మళ్ళీ నేను వస్తాను" అందిట. మర్నాడు శవమైపోయిందిట. భ్రమ తీరక పెద్దపెద్ద డాక్టర్లని పిలిపించారుట. వాళ్ళు పరీక్షలన్నీ చేసి చచ్చిపోయినట్టేనన్నారుట. శవాన్ని యింట్లో ఉంచటానికి వీల్లేదన్నారుట క్వార్టర్సులో వాళ్ళు. అప్పుడే ఉద్యోగం కూడా వదిలేసి పార్వతి శవాన్ని మంచంమీద పెట్టుకుని దాన్ని నెత్తిమీద పెట్టుకుని బయల్దేరారట. రైళ్ళూ, బస్సులూ నడవక దేశమంతా తిరిగారుట. నెల్లిపాలెం రోడ్డుమీద ఆగేనరికి స్వామి శవం చెయ్యి ఊరివేపు తిరిగిందిట. అటు నడుస్తుండగానే మంచంమీద లేచి కూర్చుందిట స్వామి. 'ఈ ఊరిని రక్షించాలన్నారుట! ఊరు మొదట కూర్చునేసరికి ఎవరో పిలిచినట్లుగా జనం రావటంట. పళ్ళిచ్చినవాళ్లు పళ్ళు, పాలిచ్చినాళ్ళు పాలు- తీర్థప్రజయిపోయారుట.

సూర్యం యింకా చెపుతూనేవున్నాడు- మేం నెల్లిపాలెం చేరాం. అప్పటికి రాత్రి ఏడయిపోయింది. యింటికి చేరాం! రాత్రికిరాత్రే స్వామిని చూడాలన్నారు ఈయన.

మామగారు గసిరేశారు. "బొత్తిగా మంచీ చెడూ లేకుండా పోతోంది. స్వామి దేవుడు. దేవుడే పిలుస్తాడు! నోర్మూసుకు పడుకో!"

ఆరోజు నేనేం తిన్నానో ఏంటో! మా అత్తగారో పక్కన. మా తోటికోడలొక పక్కన! మా భాస్కరం ఓ పక్కన! ఒకరు వదిల్తే ఒకరు అంతా స్వామి గురించే!

"ఒసేవ్ శాంతా! ఆ స్వామికి ఎంత మహిమో! మీ బావగారున్నాడా? ఆ అరుగు మీదా యీ అరుగుమీదా ఉండేవాడా? ఎంతెలా మారిపోయాడనుకున్నా వేమిటీ! స్వామివారు చూడగానే పోల్చేసారు. వీడు క్రితం జన్మలో మహామునిట. మొగా ఆడా తెలిసేది కాదుట. ఓరోజు ఓ అప్సర నీళ్ళాడుతోందిట. ఈ పీనుగ వెర్రాడిలా చూస్తున్నాడుట. అప్పుడు యుగాంతందాకా అలా వెర్రాడిలా పుడుతూనే ఉండమందిట. ఆ శాపం సంగతి తెలిసి దేవేంద్రుడు ఆ అప్సరను రాయయి పొమ్మన్నాట్ట. పాపం! ఆ మహామునికి పూర్వజన్మ గుర్తుంటుందిట! మీ బావ యిప్పుడు ఆ ఆశ్రమంలోనే రాత్రింబవళ్ళు' అన్నారు అత్తగారు.

మా భాస్కరం అన్నాడూ "ఆ స్వామికి ఎంత పట్టో తెలుసా వదినా! దణ్ణంపెట్టుకుని పరీక్షకు వెళ్ళాను. నిజంగా స్వామి నా నాలుక మీదే ఉంది. బ్రహ్మాండంగా పరీక్ష రాసేశాను"





మా తోటికోడలు పట్టుకుంది. 'ఈ బాబిగాడు ఏం చేశాడో తెలుసా శాంతా'! అంది రహస్యంగా! తల అటూ యిటూ ఊపుతూ నవ్వాపుకుంటూ అంది. ఆ సత్యవతి లేదూ! దాని మొగుడు చావాలని, తనని పెళ్ళాడాలనీ స్వామిని కోరాట్ట''

''స్వామి కోప్పడ్డారా?'' అడిగాను.

''తిట్టాలేదు. కొట్టాలేదు. వాడు చస్తాడనుకో! నువ్వెలా పెళ్ళాడతావని అడిగాడట. ఈ తిక్క చచ్చినాడు ఏంచేయాలీ! తప్పు కాయమని కాళ్ళు పట్టుకోవాలి అన్నాట్టా. పెళ్ళాడితే ఆడ తానూ లేపోతే ఉంచుకుంటానూ దాని మొగుణ్ని చంపెయ్ తల్లీ అని అడిగాడుట''

'తిట్టేవుంటాడు' అన్నాను.

''భలేదానివే! దేవుడు పిల్లల్ని తిడతాడా? 'వాడి కర్మనిబట్టి కోరికలు పుడతాయట. దేవుడు వింటాట్ట. చేస్తేవి చేసాట్ట. స్వామివారు చెప్పారు''

మర్నాడు మా భోజనాలవుతూండగా స్వామి రమ్మంటున్నారని మా సూర్యం కబురు తెచ్చాడు.

★ ★ ★

ఇలాంటివన్నీ చెప్పినవాళ్ళకి నిజమూ విన్నవాళ్ళకి అబద్ధమూనూ! మొట్టమొదటిసారి ఆ మనిషిని చూడటానికి అందరితోనూ వెళ్ళినప్పుడు అన్నవన్నీ యిప్పటికే గుర్తే!

ఊరిచివరనుంది యిల్లు. అదే ఆశ్రమంట. తర్వాత తెలిసింది అది రాయప్పారావు తాకట్టు పెట్టిన యిల్లుట. అంతకుముందు అందులో ఉన్న కోమట్లాయన పిల్లలతోసహా విషంతిని చచ్చిపోయాట్ట. అప్పట్నుంచి అందులో ఎవరూ ఉండటం లేదుట. స్వామి ఆ దయ్యాలను తరిమేసి అందులో నివాసం ఉందట.

ఇంటిముందు దొడ్డిలో పందిరి ఉంది. కొంతమంది కూర్చున్నారు. వాళ్ళంతా లేచి 'కరణంగారి ఆడంగులు' అని తప్పుకున్నారు. లోపలకి వెళ్ళాం. వెనకాల పెరడుంది. నులక మంచంమీద ఓ ఆడమనిషి కూర్చునుంది. స్వామి అంటే ఏంటో ఎలాగో ఎలాగో ఉంటుందనుకున్నాను. మావాళ్ళు దణ్ణాలు పెడుతూంటే ఎవరికో అనుకుని వెనకాతల నిలబడ్డాను.

''ఒసేవ్ లంజముండా! ఎవరనుకుంటున్నావే నన్నూ'' యింకా పచ్చి మాటలతో ఉరుముతున్నట్లు చూసింది. నాకు విపరీతమయిన భయంవేసింది. కాళ్ళూ చేతులూ వణికాయి. గుండె దడదడలాడింది. అలా ఎందుకంటుందో నాకు తెలీదు.

మా చిన్నతనంలో కూడా మా యిళ్ళలో అలాంటి తిట్లూ, బండబూతులు ఎప్పుడూ వినబడేవికావు. ఓమారు అబ్రహాం మాస్టారు నేనలాంటి తిట్టుతిడితే దవడ పేలేలా కొట్టారు. నాలుగోక్లాసు అని గుర్తు! నా పలకమీద లెక్క చెరిపేసిందో పిల్ల. ఆ పిల్లని తిట్టాను. అనాటి దెబ్బతో మళ్ళీ నా నోట అలాంటి తిట్లు రాలేదు. మా అమ్మమ్మ మాత్రం ఎప్పుడయినా లంజముండలు అని తిట్టేది. అమ్మ ఆవిడని కోప్పడేది. నా కాపురానికి వచ్చాక మా మామగారు బయట అలాంటి తిట్లు తిడుతూంటే వినబడేవి. సరదాగానూ, కోపంగానూ ఎవరినో ఒకరిని తిట్టేవారు. మా తోటికోడలు ముందు ఓసారి వినుక్కుంటే 'యింకా నయం' ఆయన యింకా యిదిగా తిడతారు! అనేది.

ఆ తిట్లని తలుచుకున్నా అవి నేను పడ్డానని గుర్తొచ్చినా యిప్పుడు వళ్ళు చచ్చిపోయినట్లుంటుంది. అప్పుడు మాత్రం కొత్తలో భయపడిపోయేదాన్ని అలా తిడితే! ఆ తర్వాత పరవశంలో విన్నానేమో కూడా!

ఆ మనిషి కాస్త చామనఛాయ. నాయీడో ఒకటి రెండేళ్ళు పెద్దో ఉంటుంది. నాకన్న పొడుగు. పెద్దపెద్ద కళ్ళు. కోపంలో యింకా పెద్దవయిపోయేవి. ఎప్పుడూ రంగులచీరలే కట్టేది. నోరు మాత్రం పెద్దది. ఒక్కోమారు ముఖమంతా పసుపు రానుకుని పెద్దబొట్టు పెట్టుకునేది. ఒక్కోమారు మెడలో మంగళసూత్రం ఉండేది. ఒక్కోమారు తెల్లచీర కట్టేది.

ఆ మనిషి మాటలు తలుచుకుంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. ఎవరయినా అంతలా గంటలతరబడి ఎలా మాట్లాడగలరోమరి! ఆవేళ గంటకుపైగా మమ్మల్ని నించోబెట్టి

మాట్లాడింది. తర్వాత తెలిసింది. కూర్చోమనే దాకా కూర్చోకూడదు. ఆవేళ మా యిద్దరి గురించే మాట్లాడింది. ఆయన్ని తిట్టలేదనే గుర్తు.

మేమిద్దరమూ పూర్వజన్మలోనూ భార్యభర్తలమేట! మావాళ్ళు చెప్పారేమో నాడీగ్రంథం గురించి.

రాములవారు సీతమ్మ వారికోసం లంకమీదకు దండెత్తుతూంటే సుగ్రీవుడు తన రాజ్యంలోని మగకోతులన్నింటినీ యుద్ధానికి రమ్మన్నాడట! ఒక్కకోతి మాత్రం వెళ్ళలేదుట. ఆ విషయం దివ్యదృష్టితో కనిపెట్టిన సుగ్రీవుడు కోపంతో మండిపోయాడట. భర్తను దాచిన భార్యకూ భార్యమాటకు లొంగిన భర్తకూ లక్ష జన్మలదాకా చస్తూ పుడుతూ ఉండమని శపించాడట. వాళ్ళు రాముడి పాదాలమీద పడ్డారుట. ఆయన కరిగిపోయి మీ యిద్దరూ అన్ని జన్మలలోనూ భార్యభర్తలుగానే పుడతారూ- భార్యకు భర్త ఈశ్వరజ్ఞానం యివ్వటాన్కి ప్రతీ జన్మలోనూ ప్రయత్నిస్తాడట. ఎప్పుడయితే మీకాజ్ఞానం కలుగుతుందో అప్పుడు మీకు జన్మపరంపర పోతుంది అని రాములవారు వరమిచ్చారుట.

అలా జన్మజన్మలనుంచి మేం భార్యాభర్తలుగా పుడుతున్నామట.

గత జన్మలో ఈయన మహాభక్తునిగా పుట్టారుట. ఈయన్ని చూడగానే పెళ్ళాడతానని పట్టుబట్టానుట. సంసారం వద్దని వైరాగ్యంతో ఉంటున్న మనిషి నన్ను పెళ్ళాడటానికి ఒప్పుకున్నారుట. అలా మా పెళ్ళి అయిందిట. అప్పట్నించి ఆయన నాకు భక్తి కలిగించాలని చాలా ప్రయత్నం చేసారుట. పూజావిగ్రహాలు దాచేసానుట. పూజకు తెచ్చిన పూలు పెట్టేసుకునేదాన్నిట. ప్రసాదం ఎవరికీ పెట్టకుండా తినేసేదాన్నిట. ఎన్ని పాపాలు చేసినా ఆయన విసుక్కునేవారు కాదుట. చివరకి నన్ను కాశీ తీసుకెళ్ళారట. గుడిలోకి రానని పట్టుబట్టానుట. చాలా బతిమాలితే గుడిదాకా వెళ్ళానుట. ఈయన లోపలికి వెళ్ళినపుడు ఓ విచిత్రం జరిగిందిట.

బయట కూర్చున్న నా దగ్గరకి అవ్వ రూపంలో స్వామి అంటే ఈశ్వరుడు వచ్చిందిట. నేను గజగజా వణికిపోయానుట. నా చెయ్యి పట్టుకుని లోపలికి నడిపించిందిట. తీరా లోపలకు వెళ్ళేసరికి ఈయన అక్కడ లేరుట.

'ఈశ్వరా! నాకీ జన్మవద్దు' అంటూ అరుస్తూ గంగానదిలో ఉరికేసారుట. ఆ విషయం అక్కడవాళ్ళు చెపుతూంటే నేను కూలిపోయి అక్కడిక్కడే చనిపోయానట. మళ్ళీ యిక్కడ వెల్లిపాలెంలో ఈయన పుట్టారట.

ఇదంతా స్వామి అనే ఆ మనిషి నన్ను పచ్చిగా తిడుతూ చెప్పింది.

మా అత్తగారు కాస్త ఒళ్ళున్న మనిషి. పాదాలు చిన్నవి. కూచుని ఎంత పనయినా చేసేవారు. ఎంత ఓపికో! పగలు పడుకునేవారుగారు. నించోలేకపోయేవారు. అలాంటిది ఆ మనిషి ఎలా నించోబెట్టేసేదో! ఆరోజు పడిపోయారు! మేమంతా కంగారు పడిపోయాం! నోరుముయ్యండి- అంటూ కసిరింది ఆ మనిషి. ఆవిడికి భక్తి పారవశ్యమంది. మా అత్తగారి దగ్గరకి వచ్చి నిలబడింది ఆ మనిషి కాళ్ళు పట్టుకున్నారు.

"ఒసేవ్ పార్వతీ!" అంటూ పిలిచింది.

ఎవర్నో అనుకున్నాను రాజుగారని మావాళ్ళు పిలిచే అతను వచ్చి చేతులు కట్టుకు నిలబడ్డాడు.

'టీ పట్రావే' అంది.

ఓ గ్లాసులో టీ తెచ్చి మా అత్తగారికి యిచ్చాడు. దాన్ని ఆవిడ తాగారు. తర్వాత వెళ్ళి ఆ మనిషి, నులకమంచం మీద కూర్చుంది. మామగారు వెళ్ళి ఆ మనిషి కాళ్ళు ముట్టుకున్నారు. పాదధూళి తీసి బొట్టుపెట్టుకున్నారు. వరసగా ఒకరూ ఒకరూ మా వాళ్ళంతా అలాగే చేశారు. ఒక్క మా బావగారు మాత్రం వెర్రి నవ్వుతో చూస్తున్నారు. ఈయన ఆఖరున వెళ్ళారు. కాళ్ళు ముట్టుకుంటే పట్టమంది. ఆయన నేలమీదకూర్చుని పడుతూంటే నేను వెళ్ళాను. చెయ్యిపట్టుకుని పక్కలో కూర్చోబెట్టుకుంది.

"భయపడ్డావా?" అంది నెమ్మదిగా. తల వంచుకున్నాను.

"ఈశ్వరుడిముందు భయం ఎందుకే! కృష్ణ





య్య గోపికలకి ఏం చెప్పాడూ బట్టలు వద లండీ అన్నాడు. వాళ్ళు వదలమన్నారు. 'వెర్రి మొహల్లారా మీ చుట్టూ వున్న మాయలే మీ బట్టలు! వాటిని వదల్లేరా?' అని అడిగాడు. వాళ్ళేంచేశారు. వదిలారు. అందువల్ల కృష్ణ య్యను పొందారు. తెలుసా?''

''అమ్మమ్మ చెప్పింది'' అన్నాను.

''నీకు మగబిడ్డ కావాలి'' అంది.

నేను ఈయనవేపు చూశాను. అడగమన్నట్టు దీనంగా మొహం పెట్టారు.

పచ్చిబూతుల్తో నన్ను తిట్టి తలమీద మొ ట్టింది ''యెర్రిమొహమా! నేను కర్మలని మారు స్తాను. నీకు నేను పుడతానే!'' అంది. ''నువ్వు నేను చెప్పిన వ్రతం చెయ్యి, నీ కోరిక తీరు తుంది'' అంది.

అలాగేనన్నాం. ఆ మనిషి నాకు ఉపదే శించింది. మూడు రకాల తపస్సు రోజూ చె య్యాలిట. అందులో ఏది మానినా ఫలితం మారిపోతుందిట. రెండు నెలలు చేయాలిట. ఆ తర్వాత తన దర్శనం చేసుకోవాలిట.

అన్నింటికీ అంతా తలూపాం!

''అయితే రేపటినుంచి మూడు రోజులు రండి! ఆ తర్వాత రాజమండ్రిలో చేసుకోండి'' అంది. మా అత్తగారు మాత్రం మాలో లేరు. భక్తి పారవశ్యంలో ఉన్నారు. యింటికి బయ ల్దేరాం. మూడు రోజులు మంత్రోపదేశాలూ పూజావిధానాలూ చెప్పింది. ఈయన ఆ మనిషి చెప్పిందంతా బాగా కంఠతా పట్టారు.

ఇంత చెప్పినా నాకు ఏమీ చెప్పినట్టేలేదు. ఎలా చెప్పాలో తెలీదు. ముందే చెప్పానుగదా విన్నవాళ్ళు నమ్మరని! కాని ఆరోజు యిలాగే అయింది.

రాజమండ్రిలో మేం పూజలు మొదలెట్టాం! ఓ రోజు ఏం జరిగిందంటే

★ ★ ★

ఆ మనిషి చెప్పిందంతా తు.చ తప్పకుండా చేశాను. ఆ మాటకొస్తే ఎవరు మాత్రం చేయ రూ! మగపిల్లలు ఎవరికి చేదూ! పైకి ఏవో అంతా చెపుతారు. వాళ్ళకి అప్పటికి ఆడ పిల్లలే పుట్టేనుండాలి! లేపోతే అంతా మొగ పిల్లల యుండాలి. లోపల్లోపల అంతా అను కుంటారు. అయ్యో! ముందు తెలిస్తే బాగుండి పోనుగదా, అని.

ఏమాటకామాటే అనుకోవాలి మరి! నాలాంటి మొద్దునిద్ర పీనుగులకి తెల్లారగట్ల మూడింటికి లేవాలంటే మాటలా? పాపం ఈయనే అలారం పెట్టుకుని లేచి నన్ను లేపేవారు.

ఆయన మంచం మీద పడుకునే వారు! పిల్లలిద్దర్నీ వేసుకుని నేను చాప మీద పడుకు నేదాన్ని. నన్ను ముట్టకోగూడదు రెండు నెలల దాకా! అందుకని కర్రతో పొడిచి లేపేవారు. మొహం మీద నీళ్ళు చిలకరించేవారు.

మెలకువ తెచ్చుకున్నాక ఆ మనిషి చెప్పిన ట్లుగా పూజ మొదలు. స్వామి ఫొటోను నైరుతి మూలలో అమర్చాలి! ఈశ్వరస్థానం ఈశా న్యంగదా అని మా అత్తగారు అంటే 'ముండ కానా... నీకు తెలుసా నాకు తెలుసా', అంది.

అలాగే ఉంచి ఆ మనిషి చెప్పిన పూవులతో పూజ చేసి ఆ మంత్రాలు చదవాలి.

అదయిపోయాక ఈయన పడక కుర్చీలో కూర్చునేవారు. ఒక్కొ రోజు ఒక్కోరకం పూవు లతో ఈయనకు పూజ చేయాలి. ఆ పాద పూజ అరగంట.

ఆ తర్వాత ఈశాన్యమూలలో ఒక ముగ్గు పెట్టాలి. దానిమీద పసుపుతోనూ బియ్యప్పిండి తోనూ ఓ బొమ్మను చేయాలి. తర్వాత తలుపుల న్నీ మూసేసుకోవాలి. బట్టలు విసర్జించాలి. ఆ ముగ్గులో కూర్చోవాలి. కూర్చుని ఆ మనిషి చెప్పిన మంత్రం వెయ్యిసార్లు జపించాలి. లెక్క తెలీటానికి వెయ్యి బియ్యపు గింజలను ముందే లెక్కబెట్టుకు ఉంచుకోవాలి. మంత్రం చదివి ఒక్కొ గింజా ఆ బొమ్మ మీద వెయ్యాలి. అది అయాక లేచివెళ్ళి స్నానం చెయ్యాలి. ఆ గింజలను పువ్వులనూ తీసుకువెళ్ళి ఈయన మీదా పిల్లలమీదా జల్లాలి.

తరవాత బట్టలు ధరించాలి. ఇదంతా సూ ర్యుని వెలుతురు రాకముందే జరిగిపోవాలిట! ఒక్కరోజు యీ కార్యక్రమం తప్పినా నీకు మగపిల్లాడు పుట్టనే పుట్టడని చాలా ఖండి తంగా చెప్పింది. ఆ రోజుల గురించి కూడా ఆ

మనిషి చెప్పింది. మొదట నెలలో స్నానం చేసేసి పూజ చేసెయ్యమంది. రెండో నెలలో మందుబిళ్ళలు మింగమంది.

వ్రతమయిన మరునటిరోజు తన దర్శనం చేసుకోమంది.

ఈయన అవస్థ ఏం చెప్పను! పాపం ఈయనకి రాత్రి డ్యూటీలుండేవి. షిఫ్టులుగదా! రకర



కాల పువ్వులు చెప్పింది ఆ మనిషి. అవన్నీ ఎక్కడ దొరుకుతాయి? ఏ పాట్లు పడేవారో ఎక్కడెక్కడకు సైకిలు మీద వెళ్ళేవారో రాజమండ్రి ఎత్తు పల్లాలూ సందుగొందులూ ఎలా తిరిగేరో ఏమోమరి! మొత్తం మీద ఆ పువ్వులన్నీ సాయంకాలం వెళ్ళి రాత్రి తొమ్మిది గంటల దాకా తిరిగి తెచ్చేవారు. ఇంటికి తెచ్చాక వాటిని వేరు వేరుగా పళ్ళాలలో పోసి ఉంచేవారు. ఆ మంత్రాలన్నీ నా చేత అప్పజెప్పించుకునేవారు.

ఇదంతా ఓ ఎత్తయితే ఈ షిఫ్టుల గొడవ ఒకటి! మొదట వాళ్ళ స్నేహితులతో ఏర్పాటు చేసుకుని వాళ్ళతో డ్యూటీలు మార్చుకున్నారు. అలా కొన్నాళ్ళు గడిచాక ఓసారి యీయనా వెళ్ళలేదు. వెళ్తానన్న ఫ్రెండు వెళ్ళలేదు. దాంతో డ్యూటీ చేస్తున్నతనే ఉండిపోవాల్సి వచ్చింది. అతను చాలా గొడవ మనిషిట. కష్టసుఖాలు తెలీవుట! పైగా ఈయనంటే ఊరికినే కళ్ళలో నిప్పులు పోసుకుంటాడట! అనుకున్న ప్రకారం ఈయన వెళ్ళారు, ఆ తర్వాత ఈయన యింటికి వచ్చి ఒకటే చెప్పడం!

"శాంతా! నువ్వు నమ్మవు! ఆ నర్సిమ్మూర్తిగాడికి నేనంటే ఎంత ఏడుపనుకున్నావూ! అలాంటివాడు ఏం చేశాడో తెలుసా? బుద్ధిగా నా డ్యూటీ చేసేశాడు. ఆ కోడి పెట్టలాడు మా సూపర్వైజర్ వాడితో వీడికి చాలా లిటిగేష నుందిలే. వాడితో చెప్పి నన్ను జనరల్ షిఫ్టుకు మార్పించాడు. నిజంగా ఆ స్వామికి ఎంత పట్టు! ఆ నర్సిగాడిని మార్చేసారంటే అంతకన్నా నిదర్శనం ఏంటే! యిక మన వ్రతం అయిపోయినట్టే మనకి మగపిల్లాడు పుట్టినట్టే..."

ఆ రోజు పిల్లల్ని ముద్దెట్టేసుకున్నారు. మీకు తమ్ముడు పుడతాడర్రా అంటూ తెగ ఆడారు. "శాంతా! నువ్వింకా నిష్టగా చెయ్యి. మన రోజులు బాగున్నాయి" అన్నారు. నేనారోజున ఎంత సంబరపడ్డానో! బాలకిట్టప్పలా మగ పిల్లాడు అలమండం తిప్పేస్తున్నట్టే యిదయిపోయాను.

ఆరోజు కాముడికి జ్వరం వచ్చింది.

డ్యూటీ దిగివచ్చి టీతాగి ఈయన పువ్వులకు వెళ్ళారు. ఇలా ఉందని చెప్పాను. మెడ కింద చెయ్యేసి చూసి ఫర్లేదే అన్నారు. "ఇప్పుడేం డాక్టరు అక్కర్లేదు. ఇప్పుడు వెళ్ళకపోతే మళ్ళీ పూలకి లేటవుతాను. యీ రోజు విఘ్నం జరిగితే మళ్ళీ మొదలెట్టాలి" అనేసి వెళ్ళిపోయారు.

పిల్లకి బాగా జ్వరంగావుంది. ఒళ్ళు కాలిపోతోంది. నాకేం చెయ్యాలో పాలుపోలేదు. భుజాన్న వేసుకుని అటూయిటూ తిరుగుతున్నాను. కళ్ళు మూసుకుంటోంది. తిరగటం మానేస్తే ఏడుపు. మరో పక్క రాజ్యం ఏడుపు. రోజూ యీ పూజతో గోలతో నెలకిపైగా నిద్రానిప్పులూ లేకుండా ఉన్నానేమో! ఎక్కడలేని నీరసమూనూ! ఈయన వచ్చి పిల్లను అందుకుంటారేమో వంట చేసుకుందామని చూశాను. తొమ్మిదిదాటాక వచ్చారీయన. చాలా కోపం వచ్చింది.

ఏవో కథలు చెప్పారు. ఎవరో ఫ్రెండు కనిపించాట్ట. హొటలుకెళ్ళారుట. నేను తెగ వినుగేసుకున్నాను. ఏ కళనున్నారో ఏంటో! ఏం అనలేదు. వంటలోకి వెళ్ళాను. పిల్ల ఆయన చేతిలోనూ ఉండలేదు. దాన్నికింద పెడితే నేను ఎత్తుకుని వంట చేశాను.

మా తిళ్ళు అయేసరికి పదకొండయింది. వండినవన్నీ కడుగుకోవాలి. కడుక్కోవాలో అక్కర్లేదో ఆ మనిషి చెప్పకపోయినా ఈయన ఒప్పుకునేవారు కాదుగదా! ఆ వంట గదిలోనే నా పూజ కావటంవల్ల అంటు ఉండకూడదనేవారు.

అవన్నీ కడుక్కుని పడుకునే సరికి పన్నెండు. పిల్లలిద్దరూ ఏడుపు! ఆ యింటి ముసిలావిడ రాత్రిళ్ళు పడుకునేదికాదు. "దిక్కుమాలిన సంత! ఎంతకీ పడుకుని చావరు!" అనేది. అక్కడికీ నేను యిదంతా చెప్పాను. 'నా మొహం! మగపిల్లలు పుట్టాలంటే పెట్టిపుట్టాలి. నీ మొహాన్న రాసుంటే ఎవరూ ఆపలేరు. వెధవ పిచ్చులూ మీరూనూ' అందావిడ. నాకు చాలా బాధేసింది. ఈయనతో అంటే ఎవళ్ళదాకా వస్తేగాని వాళ్ళకి తెలీదులే. ఈ ముసిల్దానికి బుద్ధిలేదు. చాలా ముగ్గులు పెట్టుంటుంది" అన్నారు.

ఆ రోజూ ఆవిడ విసుక్కుంటూంటే నాకు ఆగలేదు. నా యిష్టం వచ్చినట్లు అనేశాను. మీరేం యింటివాళ్ళయితే మేం పడాలా? మాకన్నా ఎక్కువ పుట్టారా? అన్నాను. ఈయన నిద్రోయారు. ప్లీడరుగారు లేచొచ్చి ఈయన్ని లేపారు. నేను లోపలికి వెళ్ళిపోయాను. ప్లీడరు గారితో మాట్లాడివచ్చి నన్ను తెగతిట్టారీయన.

"నీకేం నువ్వు తిడతావు చిన్నంతరం పెద్దంతరం లేకుండా! ఈ నంసారం యీడవాల్సింది నేను! ఆ పెద్దమనిషి రేపొద్దుట ఖాళీ




చేసెయ్యమన్నాడు. ఎక్కడ చస్తాను నేను! నీ తల్లీ, అమ్మమ్మ అంటే వాళ్ళ మీద పడి కొడతావా? ఏదో ముసిలావిడ అందని ఊరుకోవాలి. తప్పు మనదిగదా! అర్ధరాత్రి దాకా లైట్లేసుకు ఆడుకుంటుంటే ఎవరు ఊరుకుంటారు? నేనొచ్చేదాకా వంట ఏడవకుండా నిన్నెవడు కూర్చోమన్నాడూ''

ఇలా ఆరోజు నేను పడుకుని లైటు ఆర్పేసరికి ఒంటిగంటన్నరయిపోయింది. పిల్లలిద్దరూ పగబట్టినట్టు నన్ను వదలలేదు. కాముడు నన్ను పీకేస్తోంది. గుండెలమీద పడుకోబెట్టుకు నోట్లో పెట్టాను. రాజ్యం నా కాళ్ళమీద పడుకుంది. ఊపితే నిద్రోయేది. లేపోతే లేచేసేది. అలాగే ఊపుతున్నాను. పడుకున్నానో లేదో తెలీదు.

ఈయన లేపుతున్నారు.

నాకేం తెలీటంలేదు. ఎక్కడున్నానో తెలీటంలేదు. కర్రతో పొడిచి కాళ్ళమీద కొట్టినన్ను లేపారు. బలవంతాన లేచి కూర్చుని పూజలు మొదలెట్టాను.

స్వామి పూజ ఈయన పూజ బానే అయ్యాయి. ఈశ్వరుడి పూజ సరిగ్గానే మొదలెట్టినట్టు గుర్తు. ముగ్గులూ గట్రా సరిగ్గానే వేశాను. ఈయనకేం! నన్ను లేపేసి తన పూజ చేయించుకున్నాక సుబ్బరంగా పడుకునేవారు. నేను ఈశ్వర పూజ అయ్యాక బియ్యపు గింజలూ పూలూ జల్లేదాన్ని.

ఆరోజు నాకేమయిందో తెలీదు. జపం చేస్తూనే ఉన్నాను. ఎప్పుడు వచ్చేసిందో మాయ నిద్ర! మాయలా కమ్మేసింది. తెల్లగా తెల్లారిపోయింది. పిల్ల ముండలు ఎలా నిద్రోయారో అర్థం కాదు. ఇంటిల్లిపాదీ పడుకునుండిపోయాం.

మొట్టమొదట ఈయనకే మెలకువవచ్చేసింది. నేనున్న గదిలోకి వచ్చేశారు. పిచ్చిదాన్లా పడున్నాను. ఆ తర్వాత ఆయనకేం మాయ గమ్మిందో! పట్టరాని కోపం వచ్చేసింది. ఇన్నేళ్ళ కాపురంలో ఈయన ఎన్నడయినా తిట్టడం. ఉందిగాని కొట్టలేదు. అలాంటిది ఆరోజున ఈయననన్ను కొట్టారు.

ఇప్పుడు అది తల్చుకుంటే గుండె మండిపోతుంది. ఎవరి మీద? నా మీద! నా ఆశ మీద!! ఈయన మీద! ఈయన ఆశ మీద!! ఆ మనిషి మీద! ఆమనిషి మౌనం మీద!!

ఆరోజు మాత్రం కొడుతూంటే నేను ఏడవలేదు. అరవలేదు. అటూ యిటూ పరుగెత్తలేదు. నేను చేసిన దానికి నన్ను కొట్టాలా కొరత వెయ్యాలా అన్నట్టుండిపోయాను. బెల్టుతో కొట్టారు.

''బట్టలు వేసుకోవే! దరిద్రగొట్టూ! రాత రాజ్యాలేలమంటే కర్మగాడిదలు కాయమందిట! పద! స్వామి కాళ్ళ మీద పడి జరిగింది చెపుదాం'' అన్నారు.

చేతికిదొరికిన సువర్ణ ఫలం చేజారిపోయిందని ఏడుస్తూ నెల్లిపాలెం బయల్దేరాం.



అంతా వింది ఆ మనిషి.

జరిగిందంతా ఈయనే చెప్పారు. చేతులు కట్టుకుని నిలబడ్డాను. మొహం పైకెత్తి ఆ మనిషి మొహంలోకి చూడలేకపోయాను. ఈయన గొంతుకనుబట్టి అంత మనిషీ ఏడుస్తున్నాడని అర్థమవుతోంది. నేను నేల చూపులతో నించున్నాను.

మగపిల్లాడు పుట్టే అదృష్టం పోయిందన్న బాధకన్న ఆ మనిషి ఏం చేసేస్తుందో ఏం శపిస్తుందోనన్న భయంతోనే నేనలా ఉండిపోయాననిపిస్తుందిప్పుడు.

ఆ రోజు నన్ను పెద్దగా తిట్టలేదు.

'ఇలారావే!', అంది. నేను మంత్రం వేసినట్టు నడిచాను. పక్కన కూర్చోబెట్టుకుంది. నా తల మీద చెయ్యిపెట్టి మెల్లగా రాసింది.

అంతే! ఏమయిందో తెలీదు. ఆ మనిషి కాళ్ళమీద పడి ఏడుపు మొదలెట్టాను. అప్పు డంది, "దీనిమీద ఎవడో వాలాడు. అందుకే దానికలా నిద్రపట్టింది. నేను పలికిస్తాను. నువ్వు బయటకెళ్ళి కూచోరా!"

ఆయన బయట కూర్చున్నాక నాకు టీ యిచ్చింది. ఆ తర్వాత ఏంటయిందో సరిగ్గా తెలీలేదు. ఈయన్ని లోపలికి రమ్మందిట! ఎవర్రా నువ్వు? అందిట.

నేనెవరో తెలీదా! నువ్వు ఈశ్వరుణ్నంటావా? అన్నానుట. ఓరిదుర్మార్గుడా! ఈ మనిషి మీ దెందుకు పడ్డావు? నీకూ దానికి సంబంధ మేంటి?" అంది ఆ మనిషి. ఏంటేంటో అంటూ తల అటూ యిటూ తిప్పుతున్నానుట. ఏవో పాటలు పాడానంటారీయన. ఏం పాడానో ఎప్పుడూ ఈయన చెప్పలేదు. అలా పాడుతూనే నవ్వులు కూడానట.

ఆ మనిషి శవంగా మారిపోయిందిట. నన్ను అక్కడ వదిలేసి యింటికి పొమ్మన్నారట. మర్నాడు నాకు తెలివి వచ్చిందగ్గర్నుంచి ఆ మనిషి కాళ్ళకి నూనె పసుపు రాశాను. చెప్పినట్టు వండాను. శవానికి కొంచెం కొంచెం ముద్దలు చేసి పెట్టమన్నారు. తర్వాత మిగిలింది తినమన్నారు. నాకు ఆకలి లేదన్నాను. గంధం అరగదీసి ఆ మనిషికి రాయమన్నారు. ఒళ్ళంతా పట్టమన్నారు. ఇదంతా ఆ మనిషితో ఉండే పార్వతి అనే రాజుగారు చెపుతున్నాడు. నేను ఆవిడకి ఒళ్ళు పడుతుండంగా లేచింది.

'నువ్వు తినవే!' అంది. అది తింటుంటే కడుపులో దేవేసినట్లయింది. భళ్ళున వాంతయిపోయింది. కళ్ళు చీకట్లు కమ్మితే ఆ మనిషి, వచ్చి నీళ్ళు పోసి మొహం కడిగింది. నీళ్ళు తాగాక సర్దుకున్నాను.

రెండు గంటలకు ఈయన వచ్చారు. వచ్చి దణ్ణం పెట్టగానే కూర్చోమంది.

"నేనంతా కనిపెట్టేసానురా కొడకా! దీని బుద్ధి తిన్ననయింది కాదురా! మీ పెళ్ళి ముందు ఓ వెధవ దీనికోసం ఏడిశాడు. ఆ తర్వాత వాడు గోదావర్లో పడి చచ్చాడు. చచ్చిన వెధవదీన్ని వదలలేదు. మీ యిద్దరినీ విడదీయాలని చూస్తున్నాడు"

చటుక్కున తలెత్తాను. నా గుండె ఆగిపోయింది. ఈయన చూసిన చూపు ఈ జన్మలో మరిచిపోలేను. ఒళ్ళంతా వణుకుతోంది. తప్పు చేసిన దాన్లా తలొంచుకున్నాను.

"దీన్ని పట్టుకున్నవాడితో మాట్లాడటానికే నేను వచ్చాను. రాత్రంతా శవంగా ఉన్నాను. మీ యిద్దరికీ తండ్రిని నేను. వాడు చెప్పిన రహస్యాలన్నీ చెప్పకూడదు. నన్ను చూసి గజగజలాడిపోయాడు. పొమ్మంటే పోతానంటాడు. దీన్ని వదలలేనంటాడు. చివరకి పోటానికి ఒప్పుకున్నాడు. మీ వ్రతం మీరు పూర్తి చేసుకోండి! మీకు మగపిల్లాడు పుట్టకుండా వాడెలా అడ్డుపడతాడో నేను చూస్తాను. వాడలాంటి పని చేసిన రోజున వాడిని నిర్మూలించేస్తాను పొండి", అంది.

మేమిద్దరమూ ఆ మనిషి పాదాలకు దణ్ణం పెడుతూంటే కాలుతో నన్ను తన్నింది.

"పోవే లంజా! బయట కూర్చో!" అంది.

ఈయనొక్కర్నీ చాలాసేపు కూర్చోబెట్టుకుంది. మా సూర్యం బండికట్టుకు వచ్చాడు. ఏంటేంటని నన్ను ప్రశ్నలతో తినేశాడు. నేనేం చెప్పకుండా బిక్క చచ్చిపోయి కూర్చున్నాను. బయటకు వచ్చాక నాతో మాట్లాడలేదు ఈయన. ఇంటికెళ్ళాక అందరితోనూ కబుర్లూ నవ్వులూనూ! యింకేముంది! కొడుకు పుట్టడమే తరువాయి, అన్నట్టున్నారు. నాగ్గూడా భయాలూ సంకోచాలూ క్రమంగా పోయాయి.

రెండు రోజులున్నాము. ఆ రెండ్రోజులు ఈయన నాతో మాట్లాడలేదు.

రాజమండ్రి వెళ్ళాక పట్టారు నన్ను.

"ఎవడువాడు?" అంటారు. నాకేం తెలీదు మొర్రో అంటూ మొత్తుకున్నాను. ఏడిచాను. "నిన్నేం అనొద్దని స్వామివారు శాసించారు గనక సరిపోయింది. లేకపోతేనా" అనేవారు.

ఎంత గుర్తు చేసుకున్నా నాకు ఎవరూ గుర్తు రాలేదు. నాతో చదువుకున్న వాళ్ళలోగాని మా బంధు బలగంలోగాని నాతో చనువుగా ఉన్న వాళ్ళెవరూ లేరు. అదటుంచి గోదావరిలో పడి చనిపోయిన వాళ్ళు ఎవరూ లేరు. చెబితే ఈయన నమ్మరు. ఎన్ని రకాలుగా అడిగి నన్ను




కాల్చుకు తిన్నారో! ఒక్కోమారువిసుగెత్తి పోయే దాన్ని. అబ్బబ్బ... యిప్పుడు ఆ విషయాలు గుర్తొస్తుంటే ఆ మనిషిని చంపేసి ఎందుకు చచ్చిపోలేదా అనిపిస్తూంటుంది. అప్పుడు కూడా కోపం వచ్చేదనుకుంటాను. భయం ఆ కోపాన్ని తినేసేదనుకుంటాను. లోపల్లోపల అనుకున్నా ఆ మనిషికి తెల్సిపోతుందన్న భయం ఒకటీ. ఆ మనిషి గురించి సందే హించినా ఈయన మరింత దూరమయిపోతా రేమోనన్న భయం మరోటీనూ!

ఎన్ని చెప్పు! మనమిద్దరం జన్మ జన్మల నుంచీ మొగుడూ పెళ్ళాలం. కనక నువ్వేం చేసినా తప్పుదు నాకు, అనేవారు.

ఆ తర్వాత మా వ్రతం చాలా భక్తిగా పూర్తి చేశాను.

ఈ వ్రతం గొడవ మా అమ్మకి రాశాను. మా చిన్నన్నయ్యా ఆ దోవన పోతూ రెండుసార్లు వచ్చాడు. మా పెద్ద మామయ్యా వచ్చాడు. నా భక్తీ నిష్టా చూసి చాలా సంతోషించాడు. ఈయన నిర్మోహమాటంగా మేమేదో వ్రతంలో ఉన్నాం పొమ్మని చెప్పారు. ఎవరూ రావొద్దని మా వాళ్ళకి ఉత్తరం రాశారు.

వ్రతం అయిన వెంటనే నెల్లిపాలెం వెళ్ళాం! మా చేత ఏవేవో పూజలూ అవీ చేయించేది. నాలుగు నెలల తర్వాత నాకు నెల తప్పింది. మళ్ళీ నెల్లిపాలెం వెళ్ళాం. మీకు మగపిల్లాడు ఖాయమంది.

సరిగ్గా అప్పుడే స్వామికీ నెల తప్పింది అప్పటికే ఆ మనిషికీ ఓ కూతురుంది. ఆ పిల్ల పేరు గణపతిట! మా రాజ్యంకన్నా కొంచెం పెద్దది. మరో పదిహేనేళ్ళకు ఆ పిల్లకి తొండం వచ్చి గణపతిగా మారిపోతుందిట! చాలా పెంకెగా ఉండేదా పిల్ల.

నాకు నెల తప్పిన దగ్గర్నుంచి ఆరోగ్యం సరిగా ఉండేది కాదు. పండగ తర్వాత అమ్మనీ, నాన్నగార్నీ చూడలేదు. అక్కడికీ ఈయన నన్ను చాలా ప్రేమగా చూసుకునేవా రు. కాని వాళ్ళని చూడాలని ఉంది. దసరాలు వచ్చేశాయి. ఈయన ఉత్తరాలవల్లో ఏంటో ఎవరూ రాలేదు. చివరికి ఈయనతో మావాళ్ళ ను చూడాలనుందని చెప్పాను. ఈయన వాళ్ళ నాన్నగారికి రాశారు. ఆయన ఆ మనిషిని కనుక్కున్నారు. అనుమతినిచ్చింది. అప్పుడు నేను అమ్మకి రాశాను.

'అమ్మా! నిన్నూ, నాన్నగార్నీ చూడాలని ఉందే! రావే!'

★ ★ ★

సరిగ్గా మా వాళ్ళు పిఠాపురంలో నా ఉత్తరం అందుకుని నాన్నగారు సెలవు పెట్టుకుని బయల్దేరుతూంటే ఇందిరాగాంధీగారిని చంపేశారని గగ్గోలయిపోయింది. మా నాన్నగా రికి పిచ్చెత్తినట్టయిపోయిందిట. రెండురోజు లు అన్నం కూడా తినలేదుట. మా అమ్మ నెత్తీ, నోరూ మొత్తుకుందిట. 'అవతల పిల్ల ఏం కష్టంలో ఉందో ఏంటో! ఏదో సాధనం చేసుకుని వెళ్ళాలిగాని యిదేంటండి' అందిట. మూడోరో జున బయల్దేరారు.

ఆరోజు పదకొండు గంటలకు యిద్దరూ వచ్చారు. అమ్మని చూడగానే నేనెలా అయిపో యానంటే అలా అయిపోయాను. ఈ అయిదే ళ్ళలోనూ పండుగలకనో, పురుళ్ళకనో రాకా పోకా ఉన్నాయి. మా చిన్నన్నయ్య వస్తూనే ఉండేవా డు వాడి టాక్సీకి రాజమండ్రి బేరం తగిలిన ప్పుడల్లా! ఈసారిమాత్రం పండుగల తర్వాత మావాళ్ళని చూడలేదు.

అదేంటే - అలా కంపలా అయిపోయావూ - అంటూ అమ్మ తెగ బాధపడిపోయింది. నాన్న గారు కూడా మాతోబాటు వంటింట్లో కూర్చుని అక్కడిదిక్కడా యిక్కడిదక్కడా పెడుతూ మాతో మాటల్లో పడ్డారు. ఆడపిల్లలకి తండ్రి పెళ్ళయ్యాకనే దగ్గరవుతాడనుకుంటాను. మన వలు ఆయనమీద పడిపోయారు. రాజ్యానిక న్నా ముందుగా కాముడికి మాటలొచ్చేశాయి. ఏణ్ణర్ధానికే శనగపప్పుల్లా మాటాడేస్తోంది. ఆ యిద్దరూ తాతగారిని బయటకు తీసుకెళ్ళారు.

అప్పుడు మా అమ్మ పట్టుకుంది. "నీ మొగుడు అందరికీ ఉత్తరాలు రాశాట్ట. ఎవరూ రావొద్దని రాయడమేంటీ మతిలేపోతేసరి! పె ద్దబావకి చాలా కోపం వచ్చింది. ఎవరొచ్చి పడిపోతారే మీ యింటికి"

అమ్మ ఎప్పుడూ అలా అనలేదు., నెమ్మది మీద తెలిసింది. అన్నయ్యలకీ, పెద్దక్కావాళ్ళ



కీ చాలా కోపాలు వచ్చాయిట. వాళ్ళంతా తలో మాటా అంటే అమ్మ మనసుకి చాలా కష్టం వేసిందిట.

నా గొడవ నేను చెపుదామంటే అమ్మ యిలా మొదలెట్టింది. ఈయన్ని అంతా అంటున్నా రంటే అదీ బాధే! అదికాదే అంటూ చెప్ప బోతే అమ్మధోరణి అమ్మది.

వంట చేసి వాళ్ళకి పెట్టేసరికి ఈయన డ్యూటీనించి వచ్చారు. ఇంకేముంది... మా నోళ్ళన్నీ మూతబడిపోయాయి. అల్లుడు యింట్లో ఉంటే మామగారు వీధిలోనూ, మామ గారు యింట్లో ఉంటే అల్లుడు వీధిలోనూ అన్నట్లుండేదీ వీళ్ళ తంతు. ఆరోజు యిందిరా గాంధీగారి గురించి పట్టారు. మామూలు కబు ర్లనుకున్నాం. ఈయన అన్నార్ట - 'కర్మ కాలిన ప్పుడు ఎవరికయినా తప్పదు. శివుడాజ్ఞ లేకుండా చీమ కూడా కుట్టదు' అని. ఆ మాటకి నాన్నగారికెందుకంత కోపం వచ్చిందో - ఈ కాలం పిల్లలకి బొత్తిగా భయమూ, భక్తీ లేవనేశారు.

నన్ను తీసుకెళ్ళి కొన్నాళ్ళుంచుకుంటామ న్నారు నాన్నగారు. ఏకళనున్నారో వెంటనే ఒప్పేసుకున్నారు.

"మీరుమాత్రం డాక్టరనీ, గాడిద గుడ్డనీ అంటే నేనొప్పుకోను"

ఈ డాక్టరు గొడవ గురించి మేమిద్దరం అంతకుముందే మాట్లాడుకున్నాం.

"నీ కడుపులో స్వయంగా స్వామివారే ఉన్నా రు. ఇంకా మనకు భయమేమిటీ?" అన్నారీ యన. అవున్నిజమే అన్నాను.

అమ్మా, నాన్నగారూ ముందే ఏదో మాట్లాడు కున్నారులాగుంది. వెంటనే ఈయన అన్నదా నికల్లా ఒప్పేసుకున్నారు. "చూశావా! స్వామి మహాత్మ్యం! మీ అమ్మకీ, వాళ్ళకీ ఎంత బుద్ధివ చ్చిందో!"

మేం పిఠాపురం చేరుకున్నాం.

నిజంగానే నాకు ఆ రోజుల్లో చాలా నీర సంగా ఉండేది. నేను వచ్చాననగానే మా అమ్మమ్మా, పెద్దక్కా, అన్నయ్యలూ ఒకరూ ఒకరూ వచ్చారు. చూడటానికి.

"పద! డాక్టరు దగ్గరకు వెళదాం" అన్నాడు పెద్దన్నయ్య నన్ను చూస్తూనే!

"స్వామికి తన సంగతి తనకు తెలును" అన్నాను.

అప్పటికే మావాళ్ళకి స్వామి గురించి అంతా చెప్పాను. అమ్మ ఆశ్చర్యపోయింది.

"ఏంటో! నాకేం తెలీటంలేదు. ఆ స్వామి దయవల్లయినా నీకు మగపిల్లాడు పుడితే - అంతకన్నా ఏంకావాలీ" అంది.

"ఉంటారు మరి! ఎంతెంత వాళ్ళయినా ఉంటారు లోకంలో" అంది అమ్మమ్మ.

"మీవాళ్ళంతా అంటూంటే నమ్మాల్సిందేనే శాంతా! లేపోతే ఆ తర్వాత మనకి విలవ ఉండదు" అంది పెద్దక్క.

ఎవరెన్ని చెప్పినా అందరూ డాక్టరు దగ్గరకి వెళ్ళాలని పట్టుబట్టారు. నేనూ పట్టుబట్టాను. అమ్మ ఏడుపూ, తతిమావాళ్ళ పట్టూ పడలేక సరేనన్నాను. సరేనన్నాను కాని మనసులో భయమే!

డాక్టరు పరీక్షలు చేస్తూంటే నాకు భయంతో ఒళ్ళంతా ముచ్చెమటలు పట్టాయి. డాక్టరూ, వాళ్ళూ ఏమనుకుంటున్నారో తెలీదు. కళ్ళు మూసుకు స్వామి జపం చేసుకుంటూనే ఉన్నాను.

"ఏంచెయ్యాలో తెలీదు స్వామీ! నన్ను శిక్షించకు. నన్ను చంపకు" అనుకుంటున్నా ను.

డాక్టర్నించొచ్చాక ఒకటే భయం. అమ్మను నాదగ్గర పడుకోమని చెప్పాను. ఒకటే కలలు! ఎవరో నన్ను లాక్కుపోతున్నారుట. వాళ్ళకి పెద్ద పెద్ద కోరలూ అవీనట! నన్ను తీసుకెళ్ళి నూనెలో వేయిస్తున్నారుట. నిప్పుల్లో కాలుస్తు న్నారుట. ఏనుగులతో తొక్కిస్తున్నారుట. త్రిశూ లంతో పొడుస్తున్నారుట. బాబోయ్! బాబోయ్! అరుస్తుంటే స్వామి వచ్చి కాళ్ళతో తంతోందిట. స్వామీ... స్వామీ అంటూ అరుస్తున్నానుట.

అమ్మ నన్ను లేపింది. నా అరుపులకి బయటనున్న నాన్నగారూ అంతా వచ్చేశారు. నేను చెప్పేశాను.




"ఇంక ఒక్క క్షణం వుండలేను, రాజమండ్రిలో దింపండి"

★ ★ ★

"అంతేమరి! పెళ్ళయ్యాక మొగుడు తప్ప అమ్మా, నాన్నా కనబడతారా" అంది అమ్మ నిష్టూరంగానూ, బాధగానూ!

"బావుందొసే! పిల్లనెందుకు ఆడిపోసుకుంటావూ ఆ స్వామి మహిమ అలాంటిది. మనవెర్రే గానీ ఈశ్వరుడిని యింగిలిపీసు డాక్టర్లు ముట్టుకుంటే ఒప్పుకుంటాడా చూపిస్తున్నాడు తనంటే ఏంటో!" అంది అమ్మమ్మ.

చిన్నన్నయ్య విసుక్కున్నాడు. "నాకు లేదా - నీకు లేదా భక్తి! ఉంట్లేమాత్రం ఈ పిచ్చు లేంటి. ఆ మగాడికి బుద్ధిలేదు - అతనికి నీ వత్తాసు" అంటూ అమ్మమ్మమీదికి లేవాడు.

"బుద్ధుందో లేదో మొగుడెలా పోతే పెళ్ళాం అలా పోవాల్సిందే. కబుర్లంతా చెబుతారు తీరా కాల్లో ముల్లిరిగితే మొగుడవుతాడా నువ్వు అవుతావా?" అంది పెద్దక్క.

ఒక్కదాన్నీ కూర్చున్నాను. వాళ్ళ మాటలు వినబడుతున్నాయి. నేను స్వామి ధ్యానం చేసుకుంటూనే ఉన్నాను. స్వామి ఏం శిక్షిస్తుందో! పుట్టే బిడ్డను తీసేసుకుంటుందో ఏంటో! నేను వణికిపోతున్నాను. వాళ్ళు బయట మల్లగుల్లాలు పడుతున్నారు. వీధిలో ఉన్న నాన్నగారు వచ్చేసరికి అంతా మాటలు కట్టేశారు.

"నువ్వు దాన్ని రాజమండ్రి తీసుకెళ్ళగలవేంట్రా?" అని అడిగారు.

తనకు పనుందన్నాడు చిన్నన్నయ్య. పెద్దక్క ఒప్పుకుంది. మా చిన్నన్నగాడు ఎందుకు తప్పించుకుంటాడోమరి! అందుకే వాడిమీద నమ్మకం ఉండదు.

పెద్దక్కయ్యా, నేనూ యింటికి వెళ్ళేసరికి యీయన డ్యూటీలో ఉన్నారు. ఏవో నాల్గు మెతుకులు వండుకుని తిన్నాం. అంతసేపూ అది చెబుతూనేఉంది.

"వీళ్ళ మాటలకేంలే! నీ మొగుడు బంగారంలాంటివాడు. ఎంతఘుందిని చూట్టంలేదూ రెండేసిళ్ళూ, మూడేసిళ్ళూనూ! ఇంటికి తీసుకొచ్చి నెత్తిమీదకెక్కించి కాళ్ళు పిసకమంటున్నారు. తప్పుతుందా... ఆడదాని బ్రతుకే అంత! పిల్లలకి ట్యూషన్లు చెబుతామని వచ్చింది. వెధవ పీనుగలు, ఉద్యోగాలని ఏడవడం, తీరా చేస్తూంటే పెళ్ళిళ్ళు కాకుండా చావటం. మనబోటాళ్ళ కాపురాల్లో నిప్పులు పొయ్యడమూనూ! పైగా ఏమయినా అంటే 'అదేంటండక్కయ్యగారూ! మీరూ చదువుకున్నారుగదా' అనడం!

"ఏంజరిగిందే?" అని అడిగాను.

"ఏంజరుగుతుంది. ఏం జరగలేదు. మీ బావగారు బంగారంలాంటి మనిషి. ఏమాటకామాటే చెప్పుకోవాలి. నా విలవ నాదేనే" అంది.

ఆరోజున దాని మాటలు పట్టించుకునేలా లేను. నాకు అది చెప్పిన నీతుల సారాంశమాత్రం బాగా తలకి ఎక్కింది.

డ్యూటీనుంచి ఈయన వచ్చారు. నేనేం అనకుండానే పెద్దక్క మొదలెట్టింది.

"మావల్ల పొరపాటయిపోయింది మరిదిగారూ! నిజంగా ఆ స్వామికెంత పట్టో! ఏంమహిమో! మీ అన్నయ్యగారు నామాట వినరుగాని లేపోతే ఓమారు నేనూ, ఆయనా వచ్చి ఆ స్వామి కాళ్ళమీద పడేవాళ్ళమే! మాకు పట్టిన శని వదిలిపోయేది. నా మాటంటే ఆయనకి చాలా విలువ. పాపం కుదరదుమరి! మా చెల్లెలు బెదిరిపోయింది మరిదిగారూ! పాపం అదిమాత్రం ఏంచేస్తుంది. మేమంతా చంపేశాం. వెర్రిబాగుల్ది. దాన్నేం అనకండి. తీసుకెళ్ళి ఆ స్వామికి చెప్పుకుంటే ఆ దేవుడే మార్గం చూపిస్తుంది బాబ్బాబూ!"

ఈయన మాట వినకుండా తన ధోరణిలో తను వాగేసి-

"మీ అన్నయ్యగారు ఒక్కపూట ఎక్కడయినా ఉన్నానంటే గంగవెర్రులెత్తిపోతారు! నా విలవ నాదే! ఘన్ను బస్సు ఎక్కించేయండి" అంది బట్టలు సర్దుకుంటూ. ఈయన రిక్షా కోసం వెళ్ళారు.

"అతను చెప్పినట్టు వినే శాంతా! సత్తెకాలపు మనిషి. ఆ స్వామివల్ల నువ్వూ, నీ మొగుడూ బాగుపడతారు. నీ మొగుడికీ, నీకూ ముక్తీ గిక్తీ దొరికినా మానినా సుఖం దొరుకు



తుంది. మొగుడూ, పెళ్ళాలను కలిపి ఉంచే వాళ్ళే దేముళ్ళు. విడదీసే పీనుగులు దెయ్యాలు. నేనున్నా మానినా అక్కయ్య యిలా అందని గుర్తుంచుకో!'' అంది నన్ను దగ్గరకి తీసుకుని.

''ఛా... అవేం మాటలే'' అన్నాను.

దాన్ని అనపర్తి బస్సు ఎక్కించి వచ్చారీయన.

''ఆవిడ అంతలా చెప్పారు గనుక సరిపోయింది. నువ్వుమాత్రం ఏం చేస్తావు? నాకు కళ్ళు మూసుకుపోయాయి. నిన్నక్కడకి పంపాను. ఏం తిరగబెడుతుందో ఏంటో!'' అన్నారీయన సౌమ్యంగా.

పెద్దక్క రావటం మంచిదే అనుకున్నాను. దాన్ని తింగరబుచ్చి అంటారు మావాళ్లు. అయితేనేం అలాంటిది ఆరోజు ఈయనకి నచ్చేలా మాట్లాడింది. ఈయన యింటికి వచ్చాక ఏంటంటారో, ఏంచేస్తారోనని భయంతో బిగుసుకుపోయున్నాను. ఆయన అంత సౌమ్యంగా అనేసరికి పట్టుకుని ఏడిచేశాను. నేను ఆయన్ని ముట్టుకుంటేచాలు మా కాముడు తెగ ఏడిచేది. విడిగా కూర్చోవాల్సిందే! ఆరోజూ అలాగే ఏడిచిందనుకుంటాను. దానికి ఏదో మేత పడేసి వచ్చాను.

''అసలు నీ కడుపులో బిడ్డే లేదందిట డాక్టరు'' అన్నారీయన.

ఆశ్చర్యపోయి నోరు వెళ్ళబెట్టాను.

''అవునే! నాకంతా వదినగారు పూసగుచ్చినట్టు చెప్పారు. నిన్ను వాళ్ళు బలవంతాన ఒప్పించారుట. పాపం! వాతలు పెడతామంటే నీకూ భయమేగదా! అందుకే ఆస్పత్రికి వెళ్ళావుట! ఆ డాక్టరు లంజ (అంతకుముందెప్పుడూ లేనిది ఆ మనిషితో పరిచయమయ్యాక ఈ తిట్టు నేర్చారు) నీ ఒంటిమీద చెయ్యేసి కెవ్వుమందిట. షాక్ తిందిట! నేనెవర్నను కుంటున్నావే అని అడిగావుట. నేను నీకు దొరుకుతాననుకుంటున్నావా రా వెతుకు పట్టుకో అని సవాలు చేశావుట! డాక్టరు వచ్చి భయంభయంగా పరీక్షలు చేసి నీ కడుపులో బిడ్డే లేదందిట!''

''ఇవన్నీ నాకు తెలీవండీ!''

''నీకెలా తెలుస్తుందే పిచ్చిమొహం! మాట్లాడింది నువ్వయితేగదా! నువ్వీలోకంలో ఉంటే గదా''

నాకు కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి.

''అయితే మనకి మగపిల్లాడుండడంటారా?''

''పిచ్చీ! డాక్టర్లకి దొరకడుగాని నీకు స్వామే పుడతాడన్నప్పుడు యింకా అనుమానమా'' అంటూ ఓదార్చారాయన. మా పెద్దక్కయ్య ఆయనకి చెప్పిన కథ నిజమా అని తర్వాత అడిగాను. 'బావుందోసేవ్! నేను ఊరికే ఎలా చెప్తాను. ఆ శివుడే అలా చెప్పించాడు. అయినా నీ మొగుడు నిన్నేం అనకూడదంటే ఏదో చెప్పాలిగదా' అంది. ఆరోజుమాత్రం నేను నిజమే అనుకున్నాను.

మర్నాడు నెల్లిపాలెం వెళ్ళాం. నేరుగా ఆశ్రమానికి తీసుకెళ్ళారు.

''ఎంతపనిచేశావే దౌర్భాగ్యురాలా'' అంటూ మొదలెట్టింది. ఆరోజు వచ్చి బూతుల్తో తిట్టి తిట్టి అబ్బ! తలుచుకుంటేనే కంపరమెత్తిపోతుంది! ఎలా పడ్డానా తిట్లు! ఎందుకు పడ్డాను! అంత అసహ్యమయిన బూతులు! వింటూ వింటూనే కళ్ళు తిరిగి కిందపడ్డాను.

ముఖంమీద నీళ్ళు జల్లి అదీ యిదీ చేసేక మెలకువ వచ్చింది. ఇద్దర్నీ కూర్చోమంది.

''మీ యింట్లో ఏదేముళ్ళున్నారూ?'' అని అడిగింది. మేం వెర్రిమొహాలేశాం! నవ్వింది.

''అదేనర్రా! నీ దేముడి మందిరంలో ఏ పటాలున్నాయి?''

''రాముడు, కృష్ణుడు, ఈశ్వరుడు, రాజరాజేశ్వరి'' ఈయన చెప్తుంటే వింటూ తలూపుతూ చటుక్కున కళ్ళు తెరిచింది. చాలా పెద్ద కళ్ళు ఆ మనిషివి. పూర్తిగా తెరిచేసరికి నాకు గుండె ఆగిపోయినట్టయ్యింది. పెద్దాపురం మరిడమ్మో, కాండ్రకోట నూకాలమ్మో ఎదురుగా నించున్నట్టయింది.

''మళ్ళీ చెప్పరా సోమసుందరం! ఈశ్వరుడి తర్వాత ఎవరన్నావూ'' అంది.

''రాజరాజేశ్వరి'' అన్నారు.




"ఒసేవ్ పార్వతీ" అంటూ గావుకేక పెట్టింది. పార్వతి వచ్చి చేతులు కట్టుకు నిలబడ్డాడు.

"ఏవేఁ యిదంతా నీపనా?" అంది. అత నేంటన్నాడో ఏంచేశాడో నాకు గుర్తులేదు. 'అవును' అన్నాడు కాబోలు. 'ఫో' అంది.

"మీ యింట్లోనున్న రాజరాజేశ్వరినీ, తతిమ్మా పార్వతి అవతారాలనూ వెంటనే పూజలు చేసి నచ్చజెప్పి సాగనంపేసెయ్యాలి. దీనిరంకు మొగుడు చచ్చి వాళ్ళను పట్టుకున్నాడు"

నేను పకపకా నవ్వుతున్నానట. ఈయన తలూపుతున్నారు.

"రేపు రండి. ఈలోగా రాత్రికి రాజరాజేశ్వరితో మాట్లాడి ఏంచెయ్యాలీ, చెపుతాను" అని పంపేసింది.

ఆరోజు ఏం జరిగిందో చెపితే నమ్మరు. మా అత్తగారు చెప్పింది. నేను అన్నం పెట్టించుకున్నానట. ఆవిడ వడియాలు వేయించారట! పత్రా, పత్రా అంటూ వేయించినవన్నీ తినేశానట. మా అత్తగారు చెప్పింది. నిజమైతే ఎందుకలా తిన్నానో ఎన్ని తిన్నానో నాకే తెలీదు. ఆ మాటకొస్తే ఆ మనిషి తిండి ముందు మా తిండి ఎంత. తెగ తినేది.

ఆ రాత్రంతా వానవాన! గాలి! ఎంత భయమేసిందనీ! మర్నాడు మేం వెళ్ళాక చెప్పింది - "నేను రాజరాజేశ్వరితో మాట్లాడాను. రాత్రంతా వాన కురిపించి నిన్ను భయపెట్టేసిందా నాతోమాత్రం వెళ్ళిపోటానికి ఒప్పుకుంది. ఆవిడని సాగనంపటమెలాగో చెప్పింది, చెప్తాను. ఆ తర్వాత మీ కుటుంబం నలుగురూ విడిపోవాలి' అంది.

నాకు గుండె ఆగిపోయింది. "అదేంటి స్వామీ" అన్నాను ఏడుస్తూ.

"ఏడవకే! నిన్నూ నీ మొగుణ్ణీ ఎవరూ ఏ జన్మలోనూ విడదీయలేరు. అయితే నీకు బుద్ధుందిటే పిశాచీ! ఒక్క జన్మలోనయినా వాడితో నమ్మకంగా కాపురం చేశావుటే. వాడితో, వీడితో పోయి ఈ వెర్రివెధవని ఎందుకే ఏడిపిస్తున్నావూ" అంది.

"తప్పయిపోయిందండి స్వామీ" అన్నాను. కొంతసేపు తిట్టాక రాజరాజేశ్వరినీ, దుర్గనూ సాగనంపటమెలాగో చెప్పింది. ఆ తల్లులకు దాహం తీర్చాలిట! అందుకు తొమ్మిది వంటలు వండాలిట! బంగారం దానమివ్వాలిట! ఆ తతంగమంతా రాజమండ్రి వచ్చి చేయిస్తుందిట! ఆ తర్వాత పటాలను గోదావరిలో వదిలెయ్యాలిట! నేను ఒకదగ్గరా, ఈయన ఒకదగ్గరా, పిల్లలిద్దరూ చెరోదగ్గరా ఉండాలిట! రెండునెలలయ్యాక కలుసుకోవాలిట!

అన్నింటికీ తలూపి యింటికి వచ్చాం.

మామగారు అన్నారు "ఏంటో! మన మూలదేవత రాజరాజేశ్వరి! ఆ తల్లే యిలా చేస్తే యింకేముంది! ఎవరో పరాయి వెధవ వచ్చి కాళ్ళమీద పడితే మాత్రం అయ్యో మనవాళ్ళూ, మనని నమ్ముకున్నాళ్ళూ అని ఉండొద్దా! ఎన్నన్నా అనూ! యిన్నాళ్ళూ నమ్ముకున్న తల్లిని యింట్లోంచి పంపటమంటే నాకేం బావులేదురా చిన్నాడా!"

"మీ యింట్లోంచి కాదుగదా సాగనంపటం" అన్నారు ఈయన.

మామగారికి చాలా బాధేసింది. "అవునులే! నీ యిల్లు వేరూనూ, నాయిల్లు వేరూనూ" అనేసి లేచి చక్కా పోయారు. దాంతో ఈయనా కాస్త అటూ ఇటూ అయ్యారు.

మా అత్తగారు మాత్రం తేల్చేసారు.

"ఆయనలాగే అంటారుగానీ నువ్వు పట్టించుకోకు! ఆ స్వామి పట్టు నీకు తెలీదు. ఆమధ్యనోరోజు మీ అన్నయ్య ఆ స్వామిని ఏదో అన్నాట్ట. అంతే! మూడు రోజులపాటు వాంతులూ విరోచనాలూనూ, చావసిద్ధమయాడు. వెర్రోడిమీద కోపమేంటి స్వామీ, అని కాళ్ళమీదపడ్డాను. కనికరించింది స్వామి. నువ్విక్కడేంటనుకుంటున్నావో అక్కడ ఆ స్వామికి తెలిసి చక్కాపోతుంది"

ఆవిడలా అంటూంటే మేం అదిలిపోయాం.

మర్నాడు మేం రాజమండ్రి వెళ్ళాం. అక్కడినుంచి గూడెం వెళ్ళారు ఈయన. నా అజ్ఞాతవాసం మా చిన్నన్నయ్య దగ్గర అన్నారు. వాడిని ఒప్పించి వచ్చారు. రాజ్యాన్ని తీసుకె

ళ్ళి పిఠాపురంలో దింపివచ్చారు. అది ఒకటే ఏడుపు. రాజేశ్వరే అలా ఏడిపిస్తోందని నచ్చజెప్పారు. తర్వాత నెల్లిపాలెం వెళ్ళి ఆ మనిషినీ, పార్వతినీ తీసుకుని రాజమండ్రి వచ్చారు.

పూజలు మొదలెట్టించే ముందు వాళ్ళు సినిమాకు వెళ్ళారు. వాళ్ళు వచ్చేసరికి వంట చేసుకున్నాను. కిళ్ళీలు నములుతూ నవ్వుకుంటూ వచ్చి బయట తినేశామన్నారు. మా మంచం పరుపూ వాళ్ళకిచ్చి మేం వంటింట్లో సర్దుకున్నాం.

మర్నాడు పూజలు చేయించింది.

ఎవరూ నమ్మరుగానీ ఆ మనిషి మా చేత అన్నీ చిత్రంగా చేయించేది. కొబ్బరి కాయకొట్టి చెరో చెక్కా విడదీసి పెడతాంగదా, కొబ్బరి కాయ కాయా పెట్టించేది. అరటాకులో వడ్డించేటపుడు మొదలు కిందకి వచ్చేట్టు తిరగేసి వరిపించేది. దానిమీద వడ్డించమనేది. మా అత్తగారు మొదట 'ఓఘాయిత్యం', అందిట. 'లంజకానా! నీకే అంతా తెలిస్తే నేనెందుకే' అందిట. పాపం అడలిపోయిందావిడ. మేం యిదేంటని అనుకోటానికి కూడా భయపడి చచ్చేవాళ్ళం. ఆ మాటకొస్తే ఆదిలో విడ్డూరంగా ఉండేదిగాని మా అత్తగారెలా చెపితే అలా చేసుకుపోడమే అలవాటయిపోయింది. యిప్పుడనిపిస్తూంటుంది. మా అత్తగారు అంతలా అడిలిపోయి మమ్మల్నందరినీ అలా అడలగొట్టకపోతే ఎలా వుండేదోనని! ఏంటో అంతో యింతో చదువుకునేడిసిన నేనే అలా ఏడిశాను, పాపం! యిహ ఆవిడననుకోడానికేముంది.

పూజలయాయి. ఆయన గోదావరిలో పటాలను కలపటానికి వెళ్ళారు. మా చిన్నన్నయ్య అన్న ప్రకారం వచ్చాడు. నన్ను వాడి టాక్సీలో తాడేపల్లిగూడెం తీసుకుపోయాడు. కాముడిని ఆ మనిషీ, వాళ్ళూ నెల్లిపాలెం తీసుకెళ్ళారు.

నేను గూడెం చేరుకున్నాను.

★ ★ ★

గూడెం చేరుకున్న రెండు మూడు రోజులు అన్నం సహించలేదు. ఓ పక్క వేవిళ్ళ బాధ





ఉండనే ఉంది. మరోపక్క పిల్లలిద్దరూ గుర్తొచ్చేవారు. అందులోనూ చిన్నది మరీనూ! అబ్బబ్బ... ఎంత ఉషారో! పాకడం వచ్చాక యిల్లంతా పాకేసేది. ఇహ నడక వచ్చాక చెప్పనక్కరలేదు. దానిని చీరను నడుంకికట్టి లోపల మంచం కోడుకి కట్టేసేదాన్ని. అలా ఆడేసేది. అన్నన్నమానూ వాళ్ళే గుర్తొస్తున్నారు!

మా చిన్న వదిన చాలా బతిమాలింది. అసలే ఉత్తి మనిషివి కాదు, అంది. నా నెత్తిన కొబ్బరిన్నూనె పెట్టి జడేసింది. వేణ్ణీళ్ళూ అవీ స్నానానికి పెట్టింది. దగ్గరుండి తినిపించింది. చిన్న వదిన ఆప్యాయతకు నేను ఆశ్చర్యపోయాను. ఆ రెండు నెలలూ నన్ను ఆవిడకడుపులో పెట్టుకు చూసుకుంది. అమ్మ చాటు నుంచి చూసిన మనిషికీ యీవిడకీ ఎంత తేడా! ఇది రాస్తూంటే ఎందుకెందుకని బుర్ర ఆలోచిస్తుంటే చిన్నొదిన నాకు మరోలా కనిపిస్తోంది.

మా అమ్మమ్మ అమ్మా అదీ యిదీ అంటారు గానీ మా చిన్న వదిన మాంచి గృహిణి ఇల్లూ ఒళ్ళూ శుభ్రంగా ఉంచుకుంటుంది. పిల్లల్ని చక్కగా చూస్తుంది. మా చిన్నన్నగాడిని చెవి పట్టి బాగా ఆడిస్తుందనుకునేవాళ్ళం! అలాంటిది ఓ రోజు రాత్రి తెలిసింది. వాడు తాగుతాట్ట. ఈ తాగటమన్నది మా యింటా వంటా లేదు. సినిమాలో తాగుబోతుల్ని చూశానుగాని నిజంగా ఎప్పుడూ చూడలేదు.

ఓ రాత్రివేళ నాకు మెలకువవచ్చింది.

వాళ్ళది మూడు గదులపెట్టుకొంప. బ్రిడ్జి వెనకాతల ఉండేది వాళ్ళయిల్లు. నేనూ చిన్నవదినా పిల్లలూ ఓ గదిలో పడుకున్నాం. ఆ రోజు వాళ్ళ గోపికి లెక్కలు చెపుదామంటే చచ్చేచావయింది నాకు. చివరికి పడుకున్నాం. చిన్నన్నయ్య టాక్సీ తిప్పుతాడుగదా, ఎప్పుడో వచ్చేవాడు. ఎప్పుడో వెళ్ళేవాడు. ఓ టైమూ పాడూ ఉండేదిగాదు.

కేకలు వినపడుతున్నాయి. గదిలోంచి బయటకొచ్చాను.

చూసేసరికి వాడు చిందులు తొక్కుతున్నాడు. చిన్నొదినను కొట్టినట్టున్నాడు. ఆవిడ జుత్తువాడి చేతుల్లో ఉంది. ఏడుస్తోంది.

"ఏమయిందిరా నీకూ?!" అంటూ ఆవిడ ను విడిపించటానికి పరుగెత్తాను. నన్ను చూసి ఏమనుకున్నాడోమరి! ఆవిడని వదిలేశాడు. వెళ్ళి మంచం మీదకూర్చున్నాడు. వాడినుంచి ఏదో పాడు వాసన వస్తోంది. చిన్నొదిన చెయ్యి పుచ్చుకుని మా గదిలోకి తీసుకు వచ్చాను. మా వెనకే వాడు భళ్ళున తలుపు మూసేశాడు.

"ఏంటయిందొదినా?" అని అడిగాను.

చిన్న వదిన ఏడవగా ఎన్నడూ చూడలేదు. ఆ టైంలో కూడా ఆవిడ గట్టిగా ఏడవలేదు. "నీకు తెలవదులే!" అంది.

చెప్పటానికి యిష్టం లేదు గాబోలు, అనుకు న్నాను. నా గురించి గానీ తగువులాడుకుంటు న్నారా, అనిపించింది అనుమానంగా చూశా ను. ఉండబట్టలేక అడిగేశాను.

"కాదు" అంది.

"అయితే ఏంటి?"

"ఏం లేదు కొంచెం మందు ఎక్కువ యింది"

"ఏంమందు?"

నాకేసి అదోలా చూసింది. నవ్వింది, "మీ ఆయన వేసుకోడా?"

"మునుపు వేసుకునేవారు. కడుపునొప్పి జొరం ఏదొచ్చినా డాక్టరనేవారు. యిప్పుడు మా స్వామిని తలుచుకుని దణ్ణం పెట్టుకుంటే తగ్గిపోతాయి"

చిన్నొదిన ఫక్కున నవ్వింది. "ఆ మందుగా దే శాంతా" అంది. తర్వాత చెప్పింది.

వాడు తాగుతాడని తెలిసాక నాకు వాడంటే భయం పట్టుకుంది. ఇంటి దగ్గర ఉన్నపుడు రాత్రిళ్ళు ఎప్పుడో తాగేవాడు. పగలు మాత్రం నేనంటే చాలా యిదిగా ఉండేవాడు. ఏదో ఒకటి తెచ్చిపెట్టేవాడు. వదిన మాటలన్నీ వినేవాడేగాని యీ తాగుడు దగ్గర పడనిచ్చేవా డుకాదు.

"మీ అన్నయ్యే చాలా నయం" అంది ఓ రోజు చిన్న వదిన.

"ఏం నయం బాబూ! నేనే భయపడి చస్తున్నాను. నువ్వెలా ఉంటున్నావో!"

"మీ ఆయన బంగారంలాంటి మనిషి. సిగరెట్టు కూడా ముట్టడు. కనుక నీకు తెలవ దుగానీ యీ తాగుడు మరిగినవాళ్ళు అక్క డితో ఆగరు! పేకాట సరేసరి! అందులోనూ టాక్సీమీద విజయవాడా, హైదరాబాదూ గూడా వెళ్ళొస్తారేమో! ఎవత్తో ఓదాన్ని పెట్టుకునేవా ళ్ళు బోల్డుమంది! పైవాళ్ళు మనలా కాదు తాగమంటే తాగుతారు. తాగిస్తారు. ఆడమంటే ఆడతారు! మనం చెయ్యలేంగదా! అయినా మీ అన్నయ్యకి అలాంటివి లేవు" అంది.

ఆ మాటతో నాకు ఈయనే గుర్తు వచ్చారు. నిజమేమరి! మేలిమి బంగారమే ఈయన! కాని ఏం లాభం! ఓ రోజు చిన్నొదిన లబోదిబో మంది.

చిన్నన్నయ్యంటే వాళ్ళ టాక్సీలో షావుకారుకి చాలా అభిమానమట. ఇంట్లో కథాకార్యమూ ఉందంటే చాలా డబ్బు పెడుతుంటాడట. షావుకారూ భార్యా వీళ్ళింటికి వచ్చిపోతుంటా రుట, మనమంత గౌరవంగా పోతున్నాంగాబ ట్టే మనకా గౌరవం అంటూంటాడు చిన్నన్న య్యా. అలాంటివాడు ఓరోజు ఏదో బేరానికి వెళ్ళాడట. ఆ డబ్బులు పట్టుకు వచ్చి యజ మానికి యివ్వాలిట. వీడేమో ఎవరో టాక్సీ దోవలో ఆపి కత్తి చూపించి డబ్బులు పట్టుకు పోయారని చెప్పాడట. వాళ్ళ షావుకారు ముందు నమ్మినట్టు కనిపించినా తర్వాత ఆరా తీసాడట. వీడు తాగేసి పడుకుంటే ఎవరో జేబులు ఖాళీ చేశారని తెలిసిందిట. ఆయన చడామడా తిట్టాడట. ఆ సొమ్ము కట్టమన్నా డట. చిన్నన్నయ్య మొహం వేలాడేసుకు వచ్చాడు.

నాకు సొమ్ముపోతే ఫరవాలేదు. మాట పోయింది. గౌరవం పోయిందని యిదయాడు. నేనుండగానే వాళ్ళు బాధపడుతున్నారు. నేనూ ఏదో అన్నాను. వాడూ మనసు మళ్ళి ంచుకుని బయటకిపోయాడు.

ఆ తర్వాత బయటపడింది చిన్నవదిన. అటూ యిటూ తిరగేస్తూ నవ్వుతూ తెలివిగా వుండే చిన్నొదిన ఎంత గుట్టయిన మనిషో ఆరోజు తెలిసింది. భర్త మీద ఆవిడకున్నవన్నీ బయటపెట్టుకు ఏడిచింది. సంసారమంతా గుల్లయిపోతోందని యిలా అవటం యిదే



మొదటిసారి కాదంది. యిలా డబ్బులు పారేసుకుని కట్టడం యిది నాలుగోసారంది. ఇంట్లో ఉన్నవీ వంటి మీదున్నవీ కూడా అమ్మి తగలేసి కట్టేడనీ అంది.

"మీ అన్నయ్యంటే ఎందుకుండదమ్మా గౌరవం. బేరంకట్టి తిరిగి వచ్చేటప్పుడు ఎవరినయినా ఎక్కించుకు వచ్చినా అంతా ఆ డబ్బులు జేబులో వేసుకుంటారు. మీ అన్నయ్య వాళ్ళు ఎదాన పోస్తాడు. యిలాంటి దేదయినా వచ్చినపుడు వాళ్ళేమయినా చూస్తారా కనికరిస్తారా" అంది.

"అయినా మీ అన్నయ్యకి ఏదోపట్టింది. ఎంతమంది తాగటంలేదూ అంతా యిలా ఒళ్ళు మరిచిపోతున్నారా?" అంది.

అప్పుడు నేను చిన్న వదినను చాలా ఓదార్చాను. అన్నయ్యని తీసుకుని ఓసారి స్వామి దగ్గరకి రమ్మన్నాను.

"నాకూ అనిపిస్తోందిగాని శాంతా నీకు మగపిల్లాడు పుడితే మాకూ నమ్మకం కుదురుతుంది. మేమూ అనుకుంటున్నాం వస్తాం" అంది.

చిటికెలో అన్నయ్యని మార్చేస్తారు స్వామివారని చెప్పాను. రోజూ మేం ఎప్పుడో అప్పుడు ఆ మనిషి గురించి మాట్లాడుకుంటూనే వున్నాం. ఓ రోజు చిన్నొదిన అడిగేసింది.

"నువ్వు చెప్పినవన్నీ నిజమేగాని మీ అన్నయ్య నన్ను తినేస్తున్నారమ్మా!" అంది వదిన. ఏంటన్నాను.

"మరేం లేదు శాంతా! మీ ఆయన మాట తీసుకున్నారుట, డాక్టరు విషయం ఎత్తనని తెగయిదవుతున్నారు మీ అన్నయ్య"

"యింకా మీకు పిచ్చి పోలేదు వదినా"

"మాపిచ్చి మాది. ఒక్కమారు చూపించుకో! కళ్ళల్లో ప్రాణాలతో ఉన్నావు"

"నీకు తెలవదు. నాకసలు కడుపుతో ఉన్నట్టే లేదు. అసలు వేవిళ్ళేలేవు" అంటూ మొదలుపెట్టాను.

నిజంగానే ఆ మాటలన్నాను. అసలు ఏంటనుకోవాలో ఏంటో నాకు తెలీదు. మొదటి రెండు పురుళ్ళూ అంత చులాగ్గా రాకపోయినా ఈయన అన్నట్టు కడుపుతో వున్నమ్మ కనక మానుతుందా అనేసుకుంటే పురుళ్ళు రాకమానేవా? ఓ మారు బిడ్డ కదుల్తున్నట్టో, బిగబట్టినట్టో ఏదో ఒకటి అనిపిస్తూనే ఉంటుంది. నాకీ మూడోసారి ఏమయిందో! మోసి నన్నాళ్ళూ ఆదిలో వేవిళ్ళ బాధేగాని మరేం తెలిసేవికావు. ఆ మైకంలో తెలిసి చచ్చేవి కావేమో!

వాళ్ళు ఎక్కువబలవంత పెట్టలేదు. మా వదిన మాత్రం మీ చిన్నక్క వస్తుందిగదా అనేది. మరి వాళ్ళంత వాళ్ళే వచ్చారో మాచిన్నన్నగాడు రాసాడో మరి, తాడేపల్లిగూడెం చేరుకున్న మూడో వారంలో చిన్నక్కా చిన్నబావగారూ వచ్చారు.

ఇక్కడో ముక్క చెప్పాలి.

రాజమండ్రిలో మేమిద్దరం నా అజ్ఞాతవాసం ఎక్కడా అని కొంచెం కిందామీదా అయాం! మా అక్కయ్యల దగ్గరయితే బాగా చూసుకుంటారన్నాను. మా పెద్దక్క బావగారి గురించి అదీ యిదీ అనుకుంటున్నారు అందుకే గాబోలు, మా పెద్దక్క దగ్గర పెట్టలేదు. యిహ మా చిన్న బావగారితో పట్టుమని పది రోజులు గడపకపోయినా ఈయన ఆయన తత్వం పట్టేసారు. "దేముడూ దెయ్యమూ లేదంటాడు మా విశాఖపట్టణం తోడల్లుడు. నమ్మదగ్గమనిషి కాదు" అనేవారు మామగారితో! "ఎవళ్ళ పిచ్చులు వాళ్ళవి" అనేవారాయన! అందుకే గాబోలు వాళ్ళ దగ్గరా పెట్టలేదు. దానా దీనా నన్ను గూడెంలో ఉంచారు, మా పెద్దొదిన సయోధ్య తెలిసి.

మా రాణి గుమ్మంలో అడుగిడుతూనే నన్ను కావలించేసుకుంది. "నువ్వు పిఠాపురంలో ఉండగా వద్దామని ప్రయాణం. మీ బావగారికి తీరలేదు. ఏవో రైటర్స్ మీటింగులూ అవీనూ" అంది. నాకు దాన్ని చూసి పది నెలలు అయిపోయింది. పట్టరాని దుఃఖం వచ్చింది. ఓ రోజంతా అది నన్ను విడిచి పెట్టకుండా మాట్లాడింది. డాక్టరికి చూపించుకోవే అని పీకేసింది.

"మా ఆయన నావీపు చీరేస్తారు" అన్నాను విసిగిపోయి.

"ఆయనేం చేయమంటే అది చేసేస్తావా"





"నువ్వు చెయ్యవా" అన్నాను.

"నాకు నచ్చింది చేస్తాను"

"నేనూ అంతే! నాకూ నచ్చింది. నమ్మకం కుదిరింది. చేస్తున్నానూ" అన్నాను.

దానికి మాటతోచలేదేమో! ఉపన్యాసం మొదలుపెట్టింది. ఎక్కడ దాకాపోయిందంటే నీ మొగుడు పరమ మూర్ఖుడు. మీకు దేవుడు పిచ్చి. పశువుకీ మనిషీకీ తేడా ఉండాలి అంటూ ఈయన్ని నానా మాటలూ అంది. నాకన్ని మాటలు రావుగానీ ఈయన్నంటే మనసుకి కష్టం వేసింది.

"నువ్వేం నాకు చెప్పక్కర్లేదు, నీ హద్దుల్లో నువ్వుండు" అనేశాను. అది మొహం చిన్నబుచ్చుకుంది.

దాన్ని అలా తీసిపారేసినందుకు యిప్పుడు బాధేస్తుందిగాని, ఒక్కటి ఉంది. అది అలా మాటాడితే ఎవరికి కష్టంగా ఉండదూ, నువ్వు అన్నీ తెలుసుననుకుంటే మాత్రం నన్ను తీసిపారెయ్యొచ్చా? అదలా ఉంచి నాబోటి ఆడది ఏం చేయగలదు? వాళ్ళడిగినట్టు డాక్టరుకి చూపించేసుకుంటే మాత్రం నాకు కష్టాలు రాకుండా ఉండేవా?

అది ఏడుచుకుని మా బావగారితో చెప్పుకునుంటుంది. ఆయనా ఆడదానితో ఏంటని, వాళ్ళావిడని అన్నపుడు తననూ అనొచ్చని అనుకోవాలి. గౌరవం నిలబెట్టుకోవాలి. నన్ను కదపకూడదు. కాని కదిపారు.

నన్ను కూర్చోబెట్టారు. ఆ స్వామి ఎవరూ ఏంటీ అని ప్రశ్నించారు. నేను సరిగ్గా జవాబులు చెప్పలేదు. ఆ పని ఉందని యీ పని ఉందనీ తప్పించుకోబోయాను.

"చూడమ్మా! నువ్వూ చదువుకున్నావు. పేపర్లు చూస్తూంటావు. పుస్తకాలు చదవగలవు. లోకం తెలుసుకోగల మనిషివి"

ఆవిడేమో నా మొగుణ్ని పశువనీ మూర్ఖుడనీ అంది. ఇహ ఈయన దానికి వత్తాసయి తన తెలివంతా చూపిస్తాడుగాబోలు, అనుకుంటున్నాను. ఎంతయినా పరాయి మనిషే. అక్క భర్తనూ అక్కని అన్నట్టు అనకూడదు అని ఓపిక పడుతున్నాను. ఆయన మొదలెట్టారు.

"దేవుడున్నాడూ లేదూ అని నేను చెప్పటంలేదు శాంతా! లోకంలో దేవుడి పేరుతో ఎన్ని మోసాలు జరుగుతున్నాయో, ఆమధ్య కాకినాడలో స్వామి వారు ఆడపిల్లలని ఏం చేశారో! పోలీసులు పట్టుకోబోతే వరుగెత్తారనీ, యిలాంటివే చెబుతున్నారు... నమ్మకాలలోపడి కన్న పిల్లలను ఆమధ్య బలి యిచ్చుకున్నారమ్మా" అంటున్నారు.

"అయితే ఏంటండి" అన్నాను తలెత్తి.

"అహ(! నేనదేంటంటే" కంగారు కనపడుతోంది.

"మీరు తెలివయినాళ్ళు. మీరు పిల్లల్ని పెంచుకుంటారు. మేము మా పిల్లల్ని బలులు యిచ్చుకుంటాం! మీరు తెలివయిన వాళ్ళు. మేం పుచ్చిపోయాం! అంతేకదా మీరూ మీ ఆవిడా అనేది. నేనేం పిలవలేదు. మీ కాళ్ళ మీద పడి నాకు నీతులు చెప్పమనలేదు. నన్నుద్ధరించమనలేదు. మీరు తెలివిగా డాక్టర్ల చుట్టూ తిరగండి. మేం వెర్రి పీనుగుల్లా దేవుళ్ళ చుట్టూ తిరుగుతాం"

నేను అలాగే అన్నానని గుర్తు. చెరిగేసానని గుర్తు. మా చిన్నబావగారికి చాలా కోపం వచ్చిందేమో, లేచ్చక్కాపోయారు. బయటకు పోయారు. మా చిన్నక్క నన్ను ఊరుకోలేదు

"నీకు పెద్దంతరం చిన్నంతరం లేకుండా పోతోంది. నువ్వే గంగలో దూకితే ఆయనకేంగావాలే? పనిగట్టుకుని వచ్చిన పెద్ద మనిషిని అలా అంటావా?"

"ఏం నువ్వు నా మొగుడిని గూర్చి నీ యిష్టం వచ్చినట్లు పేలొచ్చా? ఆయనేం వచ్చి నీకు యిలా ఉండు అలా ఉండని బోడి సలహాలు యిచ్చారా? పశువన్నావూ మూర్ఖుడన్నావూ నేనేం అనలేదు నీ మొగుణ్ని. నా మొగుడూ నిన్ను అనలేదు. మీ యిద్దరూ మమ్మల్ని అన్నారు"

మేమిద్దరం యిలా మాటలనేసుకుంటుంటే మా చిన్నాదిన ఊరుకోండ్రా ఊరుకోండ్రా అంటూ విడదీయబోయింది.

"నీ యింట్లో నన్ను పెట్టినందుకు యిలా

అందర్నీ పిలిచి చివాట్లు పెట్టించావు. ఇష్టం లేదని ముందే మా ఆయనతో చెప్పలేకపోయావా, నీలాంటిదే పాముకనలేక పాగ బెట్టిందిట'' అంటూ ఆవిడని జాడించాను.

ఎందుకోమరి! మా చిన్నొదిన మాత్రం ఆరోజు కిక్కురుమనలేదు. నేను ఎవరితోనూ మాట్లాడకుండా పోయి మంచం మీద పడుకుని గట్టిగా ఏడిచేశాను. ఆ రోజు నాకేం పట్టిందో తెలీదు.

''ఉత్తి మనిషివి కాదు. ఊరుకోవే ఊరుకోవే'' అంటూ తనంతతానే తిరగదీసుకుని చిన్నక్క వచ్చి నన్ను దగ్గరికి తీసుకుంది.

''నాకు చాలా చాలా భయంగా ఉందక్కా! మీరన్నవన్నీ ఆ స్వామికి తెలిసిపోతాయి. ఆ స్వామి దూరంగా లేదు. నా కడుపులో యిదుగో యిక్కడే ఉన్నారు - నాకు ఏదో అవుతుంది'' అంటూ వెక్కివెక్కి ఏడిచాను.

నన్ను మానసిక వైద్యులకి చూపించాలన్నారు బావగారు. తర్వాత తెలిసింది. యింక **అయిందేదో అయింది** మరేం అనకండన్నాడట చిన్నన్నయ్య. వాళ్ళిద్దరూ మర్నాడు గోదావరికి వెళ్ళిపోయారు. నేను ఆ రాత్రంతా ఆ మనిషి జపం చేస్తూ గడిపేశాను.

ఆ రెండునెలలూ అయిందాకా మరెవరూ నన్ను చూడటానికి రాలేదు. నేను తతిమ్మా రోజులన్నీ జరిగినదంతా ఆ మనిషికి మనసులో చెప్పుకుంటూనే ఉన్నాను. నా తప్పేం లేదని వేడుకుంటూనే ఉన్నాను.

నాకు నాలుగూ నిండాయి.

ఈయన నెల్లిపాలెం తీసుకెళ్ళటానికి వచ్చారు. గడ్డమూ అదీ పెంచేసి బూచిలా ఉన్నారు. నా పిల్లల్ని చూడొచ్చు! నా స్వామితో జరిగింది చెప్పుకోవచ్చు అనుకుంటూ నెల్లిపాలెం బయల్దేరాం!

★ ★ ★

నా బంగారు తల్లులిద్దరూ నేను వెళ్ళేసరికి నెల్లిపాలెంలో ఉన్నారు. రెండు నెలలు దూరంగా ఉంటే ఏమవుతుంది అని అనుకునేవాళ్ళకి ఎవరూ చెప్పలేరు. ఏమవుతుందో తెలిసిన తల్లులకి ఎలాగూ తెలుస్తుంది! మా మరిది పిఠాపురం వెళ్ళి రాజ్యాన్ని తీసుకువచ్చాడు. అమ్మయినా, నాన్నగారయినా వస్తారేమో అనుకున్నాను. ఎవరూ రాలేదు.

స్వామి దర్శనమయ్యేదాకా పిల్లల్ని చూడొద్దు అన్నారీయన. ఎంత మారిపోయారీయన ఆ రెండునెలల్లో! మాట్లాడుతూనే కళ్ళు మూసేసుకోటం స్వామివారు పిలుస్తున్నారనటం! 'ఆగాగు నేను వెళ్ళాలి' అనడం! మాటమధ్యలో గంటయినా కూడా కళ్ళుమూసుకోనుండిపోడం! ఆయన్ని అలా చూస్తుంటే ఎంత అదృష్టం చేసుకుంటే అంత భక్తి పుడుతుందీ - అని దండం పెట్టబుద్ధేసేది. అందులోంచి బయటకొచ్చాక తెగ మాట్లాడేవారు మా యిద్దర్నీ ఎవరు ఎలా మోసం చేస్తున్నారో అందరూ ఎంత దొంగవెధవలో కథల్లా చెప్పేవారు. ఆ మనిషి వచ్చాకనే ఈయనకు మాటలు ఎక్కువయ్యాయనుకుంటాను.

పిల్లల్ని చూడకూడదూ అంటే ఏ తల్లికయినా ఎలా ఉంటుంది? యిప్పుడు గుర్తుచేసుకుంటే నాకేం పిచ్చిపట్టిందోమరి ఆనాడు అసలు బాధేలేదు. ఆరోజు రాత్రి మా తోటికోడలు చెప్పింది మా బావగారు చాలా హడావుడి చేశారుట. ఓరోజు వెళ్ళి స్వామిమీద పడ్డారుట! పార్వతీ వాళ్ళూ కలిసి రాటకి కట్టేసి చింతబరికలతో కొట్టారట. మామగారు వెళ్ళి కాళ్ళమీద పడ్డారుట. ఆ మనిషి నవ్వేసి ఆ లంజకొడుకు పిచ్చి వదిలిస్తున్నాను అందిట. రక్తాలు కారుతున్న మనిషిని యింటికి తీసుకువచ్చారుట.

అంతా చెప్పి మా తోటికోడలు అందీ 'కొడతారా చీరేస్తారా! పిచ్చీ గిచ్చీ అని వెధవ్వేషాలేస్తే దేవుడూరుకుంటాడా, మనుషులూరుకుంటారుగాని'

మా అత్తగారూ బాధపడ్డారు ''అంతేమరి! తల్లీ కొడుతుంది! దేవుడూ శిక్షిస్తాడు. తల్లయితే కాళ్ళూ వేళ్ళూ వెరిపిస్తుంది దేవుడలా కాదుగదా! అందుకే దేవుడంటే భయం!''

నాకసలే భయంగా ఉంది. యిది తెలిశాక యింకా పెరిగిపోయింది. నేనేం అనుకున్నా స్వామికి తెలిసిపోతూనే ఉందనిపించేది! అన్నీ తప్పులే చేస్తున్నట్టనిపించేది!




మర్నాడు ఆ మనిషి ముందు మా చిన్నబావగారూ, అక్కా వచ్చి అన్నమాటలన్నీ చెప్పేశాను. ఆ మనిషి నన్ను నించోబెట్టి ఏంది. నించోబెట్టి తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టింది. ఉగ్రరూపమెత్తేసింది. గుండె దడదడమనేసింది.

"నువ్వు నాకు చెప్పాలిటే! నీ కడుపున నేను లేసటే! ఆ దౌర్భాగ్యుడు ఎందుకొచ్చాడో నాకు తెలీదుటే! వాడి మాటల్ని ఎలా విన్నావో తెలీదుటే" అంటూ అరగంటకుపైగా తిట్టింది. అసలే నీరసంగా ఉన్నానేమో... కళ్ళు తిరిగి పడ్డాను. చటుక్కున వచ్చి ఈయన పట్టుకున్నారు. లేకపోతే అయిదోనెల చూలాల్ని ఏమయ్యేదాన్నో!

"ఓరి వెధవా దాన్నెందుకు ముట్టుకున్నావో అదెందుకు పడిందో తెలుసా?" అరిచింది.

ఈయన గాభరాగా చేతులు జోడించాడు. నేలమీద చతికిలబడి నేనూ ఆ మనిషి కాళ్ళు పట్టుకున్నాను. హఠాత్తుగా ఆ మనిషి వెనక్కి పడిపోయి శవమయిపోయింది. పార్వతి ఆ మనిషి పాదాలకు పసుపు రాయమన్నాడు. ఇద్దరం రాశాం! తర్వాత పొమ్మన్నాడు.

ఆ రోజు, మర్నాడూ మేం యింట్లోనే ఉన్నాం! స్వామివారింకా బతకలేదని మా మరుదులు కబుర్లు మోసుకొస్తున్నారు. మూడో రోజు బతికిందన్నారు. మేం వెళ్లాం.

"నీ వ్రతానికి ఆటంకం చేస్తోంది పార్వతి. ఎంత చెప్పినా వినటంలేదు. నీ కడుపులోంచి నిన్ను తరిమేసి తను కూర్చోవాలని చూస్తోంది. మూడోకన్ను తెరిచేద్దునా అనుకున్నాను. పెళ్ళాంగదా అవలేదు" అంది. ఈయనతో

"తండ్రీ! నువ్వే దిక్కు. నువ్వేం చెయ్యమన్నా చేస్తాము! మాకు మగపిల్లాడు కావాలి" అని కాళ్ళుపట్టుకున్నారీయన.

"చాలా చెయ్యాలిరా కొడకా" అంది.

నన్నూ నా వంటిమీద బంగారాన్నీ నా రెండోకూతురు కామేశ్వరినీ శుద్ధిచెయ్యాలిట. అందుకు నేను రోజుకి నూటపదహారు స్నానాలు చెయ్యాలిట. నా బంగారమంతా పూజలో పెట్టాలిట. కామేశ్వరికి పేరు మార్చాలిట.

"మీరు చిన్నమెత్తు బంగారం దాచుకున్నా అందులో పార్వతి ఉండిపోవచ్చు. ఒక్క స్నానం చేయకపోయినా తప్పినా నీ పెళ్ళాం శుద్ధికాకపోవచ్చు. దీని చిన్నక్క మొగుడిలా ఏదో రూపంలో పార్వతి వచ్చి దీన్ని ఏమార్చవచ్చు. మీ కూతుర్ని శుద్ధిచేస్తున్నప్పుడు మీ మనసు చెదిరిందా చాలా ప్రమాదం!-మీకు ఫలితం దక్కదు. పార్వతి చాలా మొండిగా ఉంది'

అన్నింటికీ సరేనన్నాం. మర్నాడు పొద్దుట రమ్మంది.

మామగారితో ఈయన చెప్పారు. "నువ్వేం నన్ను అడిగి చెబుతానన్నావా? ఒప్పేసుకుని వచ్చావు. తప్పుతుందా ఎవరంతటి వాళ్ళు వాళ్ళు" అంటూ కేకలేశారు. అప్పుడాయన తేలలేదుగాని తల్లి పేరు మార్చటం ఆయనకి యిష్టంలేదు.

మర్నాడు నా నగలు, మంగళసూత్రంతో సహా అన్నింటినీ, కామేశ్వరినీ తీసుకుని పొద్దుటే ఆశ్రమానికి వెళ్ళాం.

ఏవో ముగ్గులు పెట్టమంది. అందులో ఓ పళ్ళెంలో నగలన్నీ పెట్టమంది. ఓ పీట వేసుకుని ఆ మనిషి కూర్చుంది. పూజ చేయమనేది. అదంతా అయ్యాక ఆ నగల్ని ఒక్కోసారి తాను పెట్టుకునేది. ఒక్కోసారి విసిరేసేది. ఒక్కోసారి కాలితో తన్నేసేది. ఓరోజు యింటికి పట్టుకుపొమ్మనేది. ఓరోజు సాయంత్రం పట్టకెళ్ళమనేది. తొమ్మిదిరోజుల తర్వాత అన్నింటినీ తనదగ్గరే ఉంచేసుకుంది. శుద్ధి అవుతోందనేది. పార్వతి వదలటం లేదనేది.

యిహ నా శుద్ధి!

జపం చెయ్యాలి. స్నానం చెయ్యాలి. జపం, స్నానం. అలా నూటపదహారుసార్లు. తెల్లారకుండా ఈయనా, నేనూ లేచేవాళ్ళం. ఈయన తోడిపోసేవారు. ఒక్కోమారు నేనే తోడుకునేదాన్ని. పన్నెండూ, ఒంటిగంటా అయిపోయేది.

అన్నింటికన్నా దారుణం మా కాముడి శుద్ధి.

దానికోసం మా అత్తగారిచేత తద్దినం వంట చేయించింది. పిండాలు పెట్టించింది. ముత్తైదువ చచ్చిపోయినట్టే అపరకర్మలు చేయించింది. చేటలు దానం యిప్పించింది.



అవి చేస్తుంటే నాకు ఏడుపు ఆగేదికాదు. మా అత్తగారు ఏడవద్దని ఓదార్చేవారు. చిన్నదిగదా - ఆడేది, అటూ యిటూ పోయేది. చూశావ్... పార్వతి ఎలా వన్నాగాలు వన్నుతుందో - అనేది ఆ మనిషి. మా అత్తగారు కాముడిని కొట్టి కూర్చోబెట్టేవారు. ఆ తర్వాత చనిపోయిన దాన్ని బతికించే తంతు. బారసాల. నామకరణం. అన్నప్రాసన. దానికి గంగ అని పేరు మార్చింది.

నాకు స్నానాలతో నాలుగురోజులకి జ్వరం వచ్చేసింది. ఒళ్ళంతా నలువులూ, పోట్లూనూ. పండుగరోజులేమో చాలా చలిగా ఉండేది. మమ్మల్ని పెద్దపండుగ చేసుకోవద్దంది. ఇళ్ళకి సున్నాలూ, గుమ్మాలకి రంగులూ, అరుగులు అలుక్కోడాలూ ఏమీ లేవు. మొత్తం పదహారు రోజులు నేను స్నానాలు చేయాలంది. జ్వరానికి మందూ, మాకూ పనికిరావంది. అదంతా పార్వతి పెడుతున్న అల్లరి అంది.

రాత్రిళ్ళు జ్వరం. ప్రేలాపన... ఆ ప్రేలాపనలలో 'అమ్మ! అమ్మ!' అనేదాన్ని. మా అత్తగారు నన్ను నానా మాటలూ అనేసేవారు. 'మీ అమ్మ అమ్మ అని ఏడుస్తావు. చూడాలనుంటే మేం రావద్దన్నామా' అన్నారు







# సచిత్ర విచిత్రం

## సూదులపై కూర్చుని డ్రైవింగ్

పదునైన సూదులు అమర్చిన సీటుమీద కూర్చుని స్టీరింగ్ వీల్ పట్టుకున్న ఈ పెద్దమనిషి పేరు జాన్‌డీన్. ఐదువేల రూపాయల పైగా చేతి చమురు వదిలించుకుని ఈ ప్రత్యేక తరహా సూదుల సీటును తన కారులో పెట్టించుకున్నాడతను. ఎందుకయ్యా అంటే అయ్యగారు పెద్ద ప్లాన్‌మీదే ఉన్నారని చెబుతున్నారు అంతరంగికులు. అందుకు ఇది కేవలం తొలిమెట్టేనట! ఇలా కొన్నాళ్ళు ముళ్ల మీద కూర్చోడం అలవాటు చేసుకున్నాక ఈయనగారు ఏకంగా అంపశయ్యమీద రెండు నెలలపాటు పరుండి చరిత్ర సృష్టించాలని కుతూహలపడుతున్నట్లు తెలుస్తోంది. అందుకే ఈ రిహార్సల్స్. అయితే అబ్బాయిగారిలా ముళ్ళమీద కూర్చుని డ్రైవింగ్ గట్రా చేయడానికి రూల్సు ఒప్పుకోవు అని పోలీసులు అభ్యంతరపెట్టారు.

పోలీసుల చర్యకు తీవ్రంగా ప్రతిస్పందిస్తూ అబ్బాయిగారు, "నా సూదులు... నా కారు... నా యిష్టం... ఏదైనా బాధపడవల్సింది నేనేగానీ పోలీసులు కాదు గదా? అలాంటప్పుడు వారి కెందుకు అభ్యంతరం" అని కారాలు మిరియాలు నూరుతున్నారట.

పదవరోజున నా స్నానాలవుతుండగా మావాళ్ళు వచ్చారు.



అమ్మ దొడ్డివేపు వసారాలో ఉంది! నాన్నగారు వీధిలో ఉన్నారు. అమ్మేగదా బిడ్డకి లోకువ! అవిడ ఎలా వుందీ చూస్తేగదా! గూడెమయినా వచ్చి ఒక్కరు చూడొచ్చుగదా అన్న బాధ. మా అత్తారి మాటలు పడున్నానేమో ఉడికిపోయున్నాను. జ్వరంతో ఒళ్ళు తెలిసింది కాదు.

దానా దీనా అమ్మమీద రాక్షసిలా పడిపోయాను.

"మీకు ప్రేమా అభిమానం లేవు. మీరు కరోడా రకాలు. పెళ్ళయిన రోజునే ఆడపిల్ల చచ్చిందని నువ్వులనీళ్ళు వదులుకున్నారు" అన్నాను. అన్నీ మా అత్తగారి మాటలే! అమ్మా, నేనూ వసారాలో కూర్చునుంటే కాఫీ పట్టుకొచ్చిన మా తోటికోడలందీ 'అవేం మాటలే శాంతా! ఏంపనుండి రాలేదో అడగద్దూ శాంతా నీ పిల్లను సాకింది యీ రెండునెలలూ వాళ్ళేగదా' అని.

నేను అమ్మని ఆవిడెదురుగా అనలేకపోయాను. కళ్ళనీళ్ళు ఆపుకోలేకపోయాను.

'నీ మొగుడు రావద్దని ఆనాడు ఉత్తరం రాశాడు, రాలేదు. ఈరోజు పర్మిషన్ యిచ్చాడు, వచ్చాం' అంది అమ్మ. అమ్మ అలాగే మాట్లాడుతుంది. మాటకి మాట అప్పజెప్పేస్తుంది. నేను ఏ బాధలో అన్నానో పట్టనేపట్టదు అనిపించేసింది. అదే అనేశాను. నేనలా అనేసరికి అమ్మకి మాట తోచలేదు.

"పోనీ తల్లీ! నువ్వనదగ్గదానివి. మేం పడదగ్గవాళ్ళం" అంది. ఇంతలో ఈయన వచ్చి పదపద తతిమా స్నానాలు పూర్తవ్వాలి అని లేపారు. వచ్చేస్తున్నానంటూ లేవబోయాను. కడుపంతా బిగబట్టినట్టయింది. అమ్మా అంటూ పొట్టమీద చెయ్యి వేసుకునేసరికి అమ్మ గాభరాగా ఏంటయిందేంటయిందమ్మా అంటూ పట్టుకుంది.

ఇదేంటే ఒళ్ళిలా కాలిపోతూంది ఎప్పట్నించీ జ్వరం?" అంది గాభరాగా.

"నాకేం జ్వరం లేదు. యిదంతా పార్వతి చేస్తోంది". అన్నాను.

"నీ మొహం సంతకెళ్ళా! జ్వరం లేకపోవటమేంటే ఏంటి సుందరం! యింత జ్వరంగా ఉంది. మందు వేశారా?" అంది ఈయనతో.

"మీకన్నీ అలా అవుపిస్తాయి. అంతా స్వామే చూసుకుంటారు" అనేశారు.

నేను స్నానాలకు పోయాను. ఆ రాత్రి అమ్మ తెగ విసుక్కుంది. 'ఈ పల్లెటూరి సజ్జుకిచ్చాం చంపేస్తారుగాబోలు! నువ్వూ వాళ్ళతో కూడావు యింత జ్వరంలో నీటిలో మునగటమేంటే" అంది.

"నీకు తెలవదులే! వారంరోజులనుంచి జ్వరం కాస్తూనే వుంది. ఏమైనా అయ్యానా? అంతా స్వామి మహిమ!" అన్నాను.

మావాళ్ళ గురించి నేను కలవరిస్తుంటే ఈయనే స్వయంగా రమ్మని వాళ్ళకి ఉత్తరం రాశారుట. అమ్మ అలా చెపుతూంటే నేనంటే యీయనకి ఎంత ప్రేమో అనిపించింది.

మావాళ్ళు నన్ను చూడటానికొచ్చినా వెంటనే వెళ్ళిపోలేదు. తర్వాత అమ్మ చెప్పింది "పిల్ల అలా వుంది. దాన్ని యింటికి తీసుకుపోతే పురుడొచ్చేదాకానయినా మనం చూడొచ్చు" అందిట అమ్మ నాన్నగారితో.

"మూడోపురుడుగదా" అన్నారుట నాన్నగారు.

అయన నా దగ్గరకు వస్తేగదా నన్ను సరిగ్గా చూస్తేగదా! అందరి ఎదురుగానే ఎలా ఉన్నావమ్మా అన్నారంతే! అమ్మ వీలు చూసుకు మాట్లాడితే అవును బాగా పాడ

యింది అన్నారుట. అలా అన్న మనిషి గూడా మూడోపురుడు అని నసిగితే అమ్మ ఊరుకోలేదుట.

"వాళ్ళు ఒప్పుకుంటే చాలు మన పిల్లను తీసుకెళ్ళి దాని బరువు దింపేసి పంపిద్దాం. మీకూ, నాకూ శంకలెందుకూ? రాణికి పొయ్యి లేదా. ఏదో ఒకటి చేసి పిల్లని దక్కించు కుందాం" అందిట.

వాళ్ళలో వాళ్ళలా అనుకున్నాక మర్నాడు మా మామగారితో మాట్లాడారు నాన్నగారు. "నాకు తెలీదు. నీ అల్లుడిని అడుగూ" అన్నారట ఆయన.

"పెద్దవారు! మీరు చెప్పాలి, అతను వినాలి" అన్నారుట నాన్నగారు.

నా పెద్దరికం మీరు పెళ్ళినాడే ఉంచలేద న్నాడు ఆయన. అప్పటికి అయిదేళ్ళక్రితం అయిన పెళ్ళి గురించి, ఆ గొడవల గురించి సందు దొరికినప్పుడల్లా మామగారు నాన్నగారితో అనడం ఉంది. నన్నుమాత్రం మామగారు ఒక్కరోజు కూడా ఆ విషయం ఏం అనలేదు. పెళ్ళిలో అలా తీసుకొచ్చేసినా దేనికీ అడ్డుపెట్ట లేదు. నాన్నగారు ఆరోజు ఊరుకున్నారు.

ఈయన్ని అడిగారు నాన్నగారు.

స్వామి ఒప్పుకుంటే తీసుకెళ్ళమన్నారు ఈయన.

"మీ నాన్నకి ఏళ్ళొచ్చాయిగాని బుద్ధి రాలేదు. మాటవరసకి మీ అల్లుడినే అడుగూ అంటే అడిగేస్తాడా? వియ్యంకుడిని మరోమారు బతిమాలితే పరువుపోతుందా" అని నన్ను జాడించారు అత్తగారు. ఆమాట నాకు ఆనాడే నచ్చలేదు. సమాధానం చెప్పకపోయినా మా నాన్నగారిని అంటే ఏడుపురాదా? ఏడిచాను.

"పెద్దాయన... మామగారున్నారు. మొగుడు... తనున్నాడు. ఎక్కడాలేని విడ్డూరం ఆ స్వామివారిని అడగమంటాడేమిటీ?" అని మా అమ్మ ఈయన మాటను తప్పుబట్టింది. పెళ్ళాడింది ఆ స్వామా, నీ మొగుడా అన్నంత ధీనుగా అంది. నేను ఊరుకోలేదు.

"మాకు ఆ స్వామే సర్వస్వం. ఆ స్వామివారు పంపిస్తేనే నేనయినా వస్తాను. లేపోతే లేదు" కరాఖండిగా చెప్పేశాను. ఏమనుకుందో గాని నాతో ఏమీ అనలేదు అమ్మ.

ఆరోజు మధ్యాహ్నం అమ్మా, నాన్నగారూ, నేనూ, ఈయనా ఆ మనిషి దగ్గరకి వెళ్ళాం. అదేం చిత్రమో! ఆ మనిషి, నవ్వుతూ నవ్వుతూ మాట్లాడుతూనేవుండేది. అంతట్లోనే తిట్ల పురాణం విప్పేసేది. తిడుతూనే జాలిపడేది. జాలిపడుతూనే తిట్టేది.

మొట్టమొదటిసారి అమ్మా, నాన్నగారూ రావటం! నాకూ బలే గొప్పగానూ, సంతోషంగానూ ఉంది. ఆ మనిషి చాలాసేపు నించోబెట్టేసింది. అమ్మ సన్నగా, పొడుగ్గా ఉంటుంది. నాన్నగారు బలంగా ఉంటారు. నించోబెడితే ఫరవాలేదుగానీ... నాకు? కూర్చోమనేదాకా కూర్చోకూడదుగదా! మమ్మల్ని ఎప్పుడోగాని అంతలా నిలబెట్టేది కాదు. మావాళ్ళు ఏమనుకుంటున్నారో తెలీడానికి వాళ్ళ మొహాలు నేను చూస్తేగదా? చేతులు జోడించి వింటున్నాను. జ్వరంగా ఉన్నా ఆ మనిషిముందు నిలబడితే ఒళ్ళు తెలిసేది కాదు.

అంతా బాధలు చెప్పుకుంటున్నారు. నా కోడలు నా మాట వినటంలేదనొకరు. మాకింకా పిల్లలు పుట్టలేదనొకరు. మా ఋణస్తులు బాకీ తీర్చటంలేదనొకరు. నా కొడుకు పారిపోయాడనొకరు. మొహమంతా బూడిద పూసుకుని ఆ మనిషి జుత్తు విరబోసుకుని ఉంది ఆరోజు. నాతోబాటే ఆ మనిషి కడుపుతో ఉందిగదా! పొట్ట నాకన్న ఎత్తుగా అవుపిస్తోంది.

"కూర్చోవే!" అంది నావేపు తిరిగి. కూర్చున్నాను.

"ఏమే దౌర్భాగ్యురాలా! నువ్వు దానికి అమ్మవా?" అంది.

"అదేంటమ్మా ఆ తిట్లూ?" అంది అమ్మ కోపంగా. దాంతో ఆ మనిషి కోపం తారాస్థాయికి వెళ్ళిపోయింది.

"ఓసినీ! నీ వయసులో నువ్వెవడితో ఉన్నావో ఎవరెవరితో ఏం చేశావో! నీ కూతుళ్ళని నీలాగే చేశావు. నీ కొడుకుల్ని నీలాగే చేశావు. నీ భాగోతమంతా మనుషులముందు దాచొచ్చు. నీ మొగుడిముందు దాచొచ్చు. ఈశ్వరుడిముందు దాచలేవు" అంటోంది.




నాకా మనిషి సంగతి తెలిసిందే అయినా అమ్మ మొహంలోకి చూడకుండా ఉండలేకపోయాను. నా జన్మలో ఆవిడనలా చూడలేదు. అసహ్యం, కోపం, బాధ... అమ్మ మొహంలో! తటాలున బయటకు వెళ్ళిపోయింది.

హఠాత్తుగా ఆ మనిషి దండకం ఆగిపోయింది.

ఏం జరుగుతుందోనని వణికిపోతున్నాను. అంతమందీ ఉన్నారక్కడ!

"ఇలా రారా పెద్దాడా'?" అంది నాన్నగారిని. ఆయన వెళ్ళి చేతులు కట్టుకుని నిలబడ్డారు. ఇంకా దగ్గరికి రమ్మంది. ముందుకు వంగమని నుదిటిమీద చెయ్యి వేసి తడిమింది.

"నీ తలమీద ఏముందో చదివాన్రా"

"ఏముంది?" అన్నారాయన.

"వినాయకుడికి నువ్వంటే యిష్టం! సరిగ్గా ఆరేళ్ళ తర్వాత వాడు నీ కష్టాలన్నీ తీరుస్తాడు. నీచేత యిల్లు కట్టిస్తాడు. నీకు బంగారపు ఊయల వేయిస్తాడు. నువ్వు దానిమీద ఎక్కి ఊగుతావు. నీ పెళ్ళాం లోపల ఎన్ని ఏడిసినా, నువ్వంటే ప్రాణం బెడుతుంది. నిన్ను పిల్లలు నెత్తిమీద పెట్టుకుంటారు. నువ్వు గీసిన గీటులో ఉంటారు నీ పిల్లలు. నీ అల్లుళ్ళు నిన్ను పూజిస్తారు. నీ కోడళ్ళు నిన్ను దేవుళ్ళా చూసుకుంటారు. నువ్వుపట్టిందల్లా బంగారమవుతుంది" అంది.

నాన్నగారు ఆవిడ కాళ్ళు ముట్టుకుని దండం పెట్టారు.

కొంతసేపు కళ్ళు మూసుకుని చటుక్కున కళ్ళు విప్పింది.

"ఏరా దౌర్భాగ్యుడా! నా పెద్దకొడుకుని ఏడిపిస్తావా?" అంది ఈయన్నే కాల్చేసేలా చూస్తూ... వణికిపోతూ చెంపలు వేసుకున్నారు.

"నువ్వు వీడిని ఏమన్నా అన్నావో సర్వనాశనం చేసేస్తాను. వెంటనే వీడి కూతురిని వీడితో పంపు" అంది.

"అలాగే స్వామీ" అన్నారు.

"బయట ఏడుస్తున్న దాన్ని జుత్తు పట్టుకు రారా" అంది. ఈయన కదలబోతూంటే నాన్నగారు నేను తీసుకొస్తాను అన్నారు. 'వెళ్ళు' అంది. వెళ్ళారు. అమ్మ రాననేసిందిట. నాన్నగారు నానా మాటలూ అన్నారుట. 'నువ్వెప్పుడో ఏడిసిన దానికి నిన్నేం వదిలెయ్యనులే! తప్పు చెయ్యకపోతే మొహం తప్పించడమెందుకూ-పద" అన్నారుట. జేవురించిన కళ్ళతో అమ్మ కొంతసేపటికి వచ్చింది. తతిమా వాళ్ళందర్నీ పంపేసింది ఆ మనిషి. భజనకోసం కొత్తగా కొన్న మైక్ సెట్టుకు కనెక్షన్ యిస్తున్నారు ఈయన. నేను జపం చేస్తూ కూర్చున్నాను.

అమ్మ వచ్చేసరికి 'ఇలారావే' అంది.

అమ్మ రెండడుగులు ముందుకువేసి నించుంది.

'దణ్ణంపెట్టవే' అంది.

అమ్మ కదలలేదు.

ఆ మనిషి ఫకాలున నవ్వేసింది. ఎందుకు నవ్వుతోందో అర్థమవలేదు. నవ్వింది నవ్వింది తర్వాత "నువ్వు నా పెద్దపెళ్ళాం చుట్టానివన్న మాట" అందీ. గంగాదేవి ఈశ్వరుడి పెద్దభార్య. ఆవిడ శంతునిడి వెనకాలపోయిందిట. ఆ అంశే అమ్మకూ అబ్బిందిట. "సిరి అబ్బకపోయినా చిడుము అబ్బిందే నీకూ గంగమ్మ పాపాలు పోగొడుతుందని దాని చుట్టాలు పాపాలు చెయ్యొచ్చుటే నువ్వు నా కాళ్ళ మీదెందుకు పడతావూ ఫో'" అంది.

'ఫో' అనగానే అమ్మ గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది. నాన్నగారూ ఈయనా నేనూ దణ్ణాలు పెట్టి బయటకొచ్చి బండి ఎక్కాం.

అమ్మ ఆరోజంతా ఏడుస్తూనే ఉంది.

ఆ మనిషికేమయినా రహస్యమా అది అన్నవన్నీ మా అత్తారింట్లో తెలిసాయి.

"ఇంత బతుకుబతికాను. ఎవ్వరిచేతా వేలెత్తిచూపించుకోలేదు. పన్నెత్తి అనిపించుకోలేదు. యిప్పుడు అది నన్ను అంటుందా? నేనేం అపకారం చేసాను దానికి, నేను మళ్ళీ ఆయన మొహం ఎలా చూస్తాను" అంటూ ఏడిచింది అమ్మ.

"స్వామి ఏదీ లేకుండా అనదు. నీకు తెలీకుండా అవొచ్చుగదా" అన్నాను పొరపాటున. అమ్మ చెంప ఛెళ్ళుమనిపించింది. ఆ

తర్వాత అయ్యో తల్లీ ఎంత దెబ్బకొట్టానే పాపిష్టిదాన్ని'' అంటూ నన్ను హత్తుకుని ఏడిచింది.

ఆరోజు అమ్మ అన్నం తినలేదు. నా స్నానా లయిందాకా వుండి తీసుకువెళ్ళమన్నారు ఈయన. అమ్మ వినలేదు. 'తరువాత వచ్చి పిల్లను తీసుకురండి! నన్ను దిగబెట్టె య్యండి!'' అంది అమ్మ.

అమ్మ అలా పట్టుబట్టగలదని అంతదాకా నాకు తెలీదు. మంచి ముహూర్తం చూసి వచ్చి తీసుకెళ్తానని చెప్పి మర్నాడు పొద్దుటే బయ లుదేరారు అమ్మ, నాన్నగారు. అమ్మ ఆ యింట్లో పచ్చిమంచినీళ్ళు కూడా ముట్టలేదు. మొహం కడగలేదు. కాఫీ తాగలేదు.

మా అత్తగారు బొట్టుపెట్టి రవికలగుడ్డ పెట్ట బోయారు. అమ్మ పుచ్చుకోలేదు. మా అత్తగారికి బాధేసింది, ''యింటికొచ్చిన పునిస్త్రీవి. వియ్యా పురాలివి. నువ్విలా వెళ్ళిపోతే నాకు బాధగా ఉంటుంది. నీ కూతురికీ మంచిదికాదు'' అంది చేతులు పట్టుకుని.

అమ్మ బొట్టుపెట్టించుకుని దాన్ని తీసుకుని వెళ్ళిపోయింది. ఆవిడ వెళ్ళిపోయాక 'ఎంతదే వుడయినా ఆడదాన్ని అలా వీధిలో పెట్టకూడ దు' అన్నారు అత్తగారు. ''నువ్విదింతా మన నులో పెట్టుకోకు! కడుపులో బిడ్డమీదే దృష్టిపె ట్టుకో' అని కూడా అన్నారు నాతో.

వారం తర్వాత పెద్దన్నయ్య వచ్చి నన్ను తీసుకెళ్ళి పిఠాపురంలో దింపాడు.

★ ★ ★

పిఠాపురంలో నేను ఎవరితోనూ ఎక్కువ మాట్లా డేదాన్ని కాదు. రోజూ రాత్రిళ్ళు జ్వరంగా అనిపించినా ఎవరికీ చెప్పేదాన్ని కాదు. ఒక్కో మారు చెమటలు పట్టి తగ్గినట్లనిపించేది. రాత్రింబవళ్ళు స్వామి జపమే! నేను మామూ లుగా ఉంటే అమ్మ మామూలుగా లేదని గ్రహించేదాన్నేమో! ఓమారు చిన్నన్నయ్య వచ్చి చూసి వెళ్ళాడని గుర్తు. నాన్నగారు డబ్బులకి ఏ కష్టాలు పడుతున్నారో కూడా నేను పట్టించుకోలేదు. మూడో పురుడు గనక డబ్బు పంపుతానన్నారని ఓమారు అమ్మ అంది. ఓమారు అడిగితే నువ్వు బావుంటే చాలమ్మా అనేసింది.

ఆరోజు నేను నా గదిలో వున్నాను. పిల్లలు బయట ఎక్కడో ఆడుకుంటున్నారు. జపంచే సుకుంటున్నారు. పెరట్లో అమ్మ అమ్మమ్మా కబుర్లలో వున్నారు.

అమ్మమ్మ నాకు వత్తాసుగా అంటోంది. ఎవ రూ లేకపోయినా ఆ స్వామి ప్రసక్తి అస్తమానూ తెస్తుండేది. 'సాక్షాత్తూ శంకరుడే దాని కడుపున పడ్డాడు. దాన్ని మీరు నెత్తిమీద పెట్టుకోవాలి. మీకూ ముక్తిదొరుకుతుంది' అనేది. నన్నూ నీ పురుడయి వెళ్ళేటపుడు తీసుకెళ్ళవే. ఆ పీను గలు నన్నెలా కాల్చుకుతింటారో చెప్పుకుంటా ను. వాళ్ళ రోగాలన్నీ ఆ స్వామి అణిచేస్తుంది' అని బతిమాలేది. 'మీ పెద్దమామయ్య ఉత్తి చెవలపిల్లి! ఒక్కమారు ఆ స్వామి దగ్గరకు తీసుకువెళ్ళరా అంటే అబ్బే ఆ పిరికిసన్యాసికి పెళ్ళాం పర్మిట్టివ్వలేదు' అనేది.

ఆరోజూ వాళ్ళ కబుర్లలో స్వామి వినబడ టంతో బయటకు వచ్చాను.

''నువ్వెంత భయం భక్తీగా ఉంటావు, ము ప్పొద్దులా దేవుణ్ని తలుచుకోకుండా ఏం చె య్యవుగదా, ఆ స్వామిని ఒప్పుకోవేమే'' అమ్మ పేలు చూస్తూ అంది అమ్మమ్మ.

అమ్మ ఏమీ అనకుండా వెళ్ళి నేను మధ్యలో అన్నాను.

''అమ్మ చిన్నప్పుడు చేసిన తప్పులు స్వామి చెప్పేశారు అందుకని''

ఆ మాటకి అమ్మచూసిన చూపు నేనెన్నటికీ మరిచిపోలేను. ఇప్పటికీ గుర్తొస్తుంటుంది. ఆవిడ అలా చూసి ఓ కన్ను బాగా తెరిచి అదోలా మొహం పెట్టి అంది.

''నా కోసం గోదావరిలో పడిచచ్చిందెవరే?''

''ఏమో! నాకేం తెలుసు?''

''అలాంటివాడొకడు ఉన్నాడంటావు''

''ఉండకుండా స్వామి అనరు'' అన్నాను. ''స్వామీ వల్లకాడూనూ దొంగముండ'' అనేసి అమ్మ చటుక్కునలేచి వెళ్ళిపోయింది. అమ్మ మ్మ ఏంటేంటని తినేస్తోంది. నాకు మాటరా టంలేదు. వణుకు వచ్చేస్తోంది. గదిలో దూరి




తలుపేసుకున్నాను. జపం మొదలెట్టాను. నువ్వలా అనకూడదు. 'ఏంటవుతుందో ఏంటో' అంటోంది అమ్మమ్మ. 'యిప్పటికి వెయ్యిన్నొక్క సార్లు తిట్టుకున్నాను. అయేదేదో యీపాటికే అవాలి' అంటోంది అమ్మ. వాళ్ళ మాటలు వినబడకుండా చెవులు మూసుకుని జపం చేసుకుంటూనే ఉన్నాను.

అమ్మ కాఫీ పట్టుకొచ్చింది. ఎంత పిలిచినా నేను తలుపు తియ్యలేదు. 'తప్పయిపోయింది తల్లీ! చెంపలు వేసుకుంటాను. నీ కాళ్లమీద పడతాను' అంది ఏడుపు గొంతుతో! తర్వాత తలుపు తీశాను. బలవంతాన కాఫీ తాగాను.

ఆరోజో మర్నాడో ఓ రాత్రివేళ నొప్పులు మొదలయ్యాయి. అది ఏడో నెల చివర. నొప్పులు అనుకోలేదు. నాన్నగారు డాక్టరు కోసం పరుగెత్తారు. వద్దువద్దన్నాను. 'అవసరమయితే ఆస్పత్రిలో చేర్చమని అల్లుడుగారు పర్మిషన్ యిచ్చారు, ఆ స్వామివారు కూడా ఒప్పుకున్నారు' అని ఖండితంగా చెప్పేసింది అమ్మ. నేను వాదించబోతే 'అబద్ధమాడతానా నోరు ముయ్యమంది'

డాక్టరు వెంటనే ఆస్పత్రిలో చేర్చమన్నాడు.

రాత్రికి రాత్రి ఆస్పత్రిలో చేర్చారు. తెల్లారి ఎనిమిదిగంటలకి పురుడు వచ్చేసింది. నాకు స్పృహ తప్పింది. కోమాలోకి వెళ్ళిపోయాను.

డాక్టరు మా వాళ్ళని చాలా తిట్టిందిట 'పల్లెటూరివాళ్ళూ, చదువురానివాళ్ళూ కూడా యింత ఘోరంగా ఉండరు. స్పృహ వచ్చేదాకా ఏమీ చెప్పలేను' అందిట.

బతుకుతానో లేదోనని అమ్మ కంటికీ మంటికీ ఏకధారగా ఏడుపుట. 'నావల్లే అయింది. నోరు పారేసుకున్నాను. తిట్టాను. అందుకే నా కడుపులో చిచ్చుపెట్టి నా కూతుర్ని తీసుకుపోతోంది ఆ మహమ్మారి'

'నువ్వు మొక్కుకోవే' అందిట అమ్మమ్మ. 'తిట్టిన దాన్ని నేను. కాళ్ళు పట్టింది అది. నీతీ న్యాయమూ ఉన్నదేవుడయితే నన్ను తీసుకుపోవాలి. అదేం జేసింది? దాన్ని దాని పిల్లల కెందుకు కాకుండా చెయ్యాలి. ఆ మాత్రం యింగితంలేని దెయ్యానికి నేను కాళ్ళు పట్టినా, పీకపట్టినా ఒకటే!' అని ఏడిచిందిట అమ్మ.

మా నాన్నగారు అందరికీ టెలిగ్రాములు యిచ్చారు. అంతా వచ్చేసారు... ఈయన మాత్రం రాలేదు. ఎవరినయినా పంపుదామా అని ఊగారట. అన్నయ్యలో, బావగార్లో ఎవరయినా వెళ్ళేవారే! "మగపిల్లాడు పుట్టాడనగానే పరుగెత్తుకొస్తాడనుకున్నాను" అన్నాడు రామయ్య.

"రాదల్చుకున్నాడు పెళ్ళాం చావుబతుకులమీదుందంటే రాడా? రాదలుచుకోనపుడు మనం వెళ్తే మాత్రం వస్తాడా?" అన్నారుట నాన్నగారు.

'బావా! నువ్వా అబ్బాయినెందుకలా అనుకుంటున్నావు? టెలిగ్రాం అందితే రాకుండా ఉండడు" అన్నాట్ట పెద్దమామయ్య.

"నీకు తెలవదు బావా' ఆస్పత్రిలో చేర్చామని ఓ కార్డురాసాను ... త్రి! నాకో పిచ్చి! వాళ్ళకో పిచ్చీనూ" అన్నారుట. మర్నాడు ఎవరినయినా పంపటానికి పెద్దమామయ్య ఒప్పించాడట.

అప్పటికి మూడోరోజు కోమా! మధ్యాహ్నానికి స్పృహ వచ్చింది. సాయంకాలానికి పూర్తిగా తెలివివచ్చింది. మగపిల్లాడని తెలీగానే స్వామికి వెయ్యి దణ్ణాలు అనుకున్నాను మనసులో! వాడిని చూడగానే ఓవక్క ఎంత సంతోషం కలిగిందో మరో పక్క అంత బాధేసింది.

నెల తక్కువవడంవల్లో ఏమో పిల్లాడు చాలా నాసిగా ఉన్నాడు. అరచేతిలో పట్టేస్తాడన్నట్లున్నాడు. కాళ్ళూ చేతులూ అన్నీ తిన్నగా వున్నాయి. ఏ లోపం లేదు. నా బిడ్డ నాకు దేవుడిలా కనిపించలేదు. నా బిడ్డలా కనిపించాడు.

ఆ రాత్రి పదీ పదకొండు గంటలకు వచ్చారు ఈయన.

కార్డూ టెలిగ్రాం ఓసారే అందాయిట. "నన్ను నమ్ముకోలేదు. దానికి చావు తప్పదు" అందిట ఆ మనిషి. కాళ్ళు పట్టుకుని రక్షించమన్నారుట ఈయన. పూజలూ అవీ చేయించిందిట. "నేను చేసింది చేశాను. నీ అదృష్టం- ఫో! ఈలోగానే నా శక్తి దాన్ని

చంపేసిందా దాని కర్మ!'' అందిట. రాత్రి ఏడు గంటలకు అనుమతినిస్తే పాపం! లారీలు పట్టుకుని వచ్చారు. ఇప్పుడు అది తల్చుకుంటే ఎంత ఏడుపొస్తుందో! ఆ దెయ్యం మా కాపురంలోకి రాకపోతే ఎలా ఉండేవాళ్లం!

అంతా విని పిల్లాడి నక్షత్రం మంచిదని చూడమన్నారుట. నాన్నగారు ఒప్పుకోలేదుట. 'శంకరం' అని పేరు పెట్టిందిట స్వామి.

'మీ పిచ్చికొద్దీ ఆస్పత్రిలో చేర్చారు! తడాఖా చూపించారు స్వామి! చూశారా ఆ స్వామి పట్టు. మగపిల్లాడు పుడతాడన్నారు. పుట్టాడు. తనే పుడతానని అన్నారు. పుట్టేశారు'' అంటూ మొదలెట్టారుట.

మర్నాడు మధ్యాహ్నం భోంచేసి నాకు స్వామి జపం చేసుకోమని చెప్పి వెళ్ళిపోయారు ఈయన. అందరూ వెళ్ళారు. పెద్దక్క పెద్దన్నయ్య ఉండిపోయారు. నేను ఆస్పత్రిలో ఉన్నన్నాళ్ళూ వాళ్ళుండిపోయారు. 'పిల్లల చదువులని చాకిరీ తప్పించుకుంది పెద్దకోడలు- నీకు నోట్లో నాలుక లేదు' అంది. అమ్మతో అమ్మమ్మ. ''పాపం వాడి ఫొటో స్టూడియో తెరిస్తేనే గదా. నాలుగు డబ్బులు వచ్చేది. పావలా పెట్టకపోయినా వచ్చేది పోగొట్టుకుంటున్నాడు గదా!' అందిట అమ్మ.

నన్ను ఆస్పత్రినుంచి విడుదల చేశారు.

★ ★ ★

నెలయింది.

మా అత్తారు ఎవరూ రాలేదు. ఈయన మునుపు వారాని కోమారయినా వచ్చేవారు. ఉత్తరం కూడా రాయలేదు. ఎందుకు రాలేదో నాకు ఏం తెలుస్తుంది?

'మీ వాళ్ళురాలేదు. పుట్టెడు జబ్బుపడింది. చచ్చిబతికింది. మనవడిని చూసుకుందామనయినా లేదు మీవాళ్ళకు' అనేది అమ్మ. నాకు ఓ పక్క నీరసం. మరోపక్క బాధ. వీటికితోడు పచ్చికామెర్లుట. పథ్యం.

మా అమ్మమ్మ మరోలా తినేసేది- ఆవిడకి సరిగ్గా ఆనేది కాదు. పెద్దాళ్ళిద్దరికీ ఉగ్గూపాలూ ఆవిడే చూసిందిగాని యీ బిడ్డ అలా లేదు గదా. మరీ బెంగగా ఉండేది. ఎక్కడ ఏం చేసేస్తుందోనని భయం. అంతే బాధపడిపోయింది. ఓమారు చెపితే గ్రహించుకునే రకంగాదు. ఆవిడనుంచి దాచాలనుకునేదాన్ని 'నాదేవుడే నాకొండే' అంటూ వెంటబడేది.

వియ్యాలవారన్నాక ఏవో చిరుబురులుంటాయి. ఆ మాటకొస్తే ఆ నాటికి వాళ్ళమధ్య ఏమున్నాయని? ఉత్తరాలు రాయరు. బారసాల విషయం ఎత్తరు. కనీసం మగపిల్లాడిని చూసుకుందామనయినా ఈయనకి లేదా? నాన్నగారు వెళితే బావుండుననిపించేది. అనలేకపోయేదాన్ని.

ఓరోజు అర్ధరాత్రి లేచికూర్చున్నాను. తర్వాత అమ్మ చెప్పింది.

'ఒసేవ్ శాంతా! ఆరోజు మేం హడిలిచచ్చాం! అప్పటికప్పుడు స్వామిని తెమ్మంటావు! నీ మొగుడు కావాలంటావు. ఏం చెప్పం తల్లీ మాలోకం లేదు, మా చూపులేదు. నాన్నగారు పరుగెత్తారు. పళ్ళు గిట్టకరిచేశావు. కాళ్ళూ చేతులూ తన్నేసుకుంటావు. మేం ఎక్కడా పట్టుకోలేకపోయాం! డాక్టరొచ్చి యింజక్షన్ చేశాడు. నీ మొగుడిని పిలిపించమని చెప్పాడు. పొద్దుటికిగాని మనుమల్లో పడలేదు''

మర్నాడు ఈయనకి మిల్లుకి ఫోను చేశారు నాన్నగారు. రెండు నెలలనుంచి రావటంలేదని తెలిసింది. నాన్నగారి కనలే కంగారు. ఆ కబురువిని కడుపు గుడగుడలాడేసిందిట. పెద్ద విరోచనమయిపోయి మనిషి జావగారిపోయి యింటికొచ్చారు.

మా అమ్మ నాకిదంతా తెలీకుండా కమ్ముకొచ్చింది. మనిషితోడు లేకపోతే నాన్నగారికి కాలాడదు. నెల్లిపాలెం వెళ్ళమందిట అమ్మ. నే వెళ్ళలేనని కాళ్ళు జాపేసారుట. 'తప్పుతుందా మనకు' కాకినాడ వెళ్ళి అన్నయ్యని తీసుకుని వెళ్ళిరమ్మని' వంపించింది.

ఆ మరునటిరోజు సాయంత్రానికి మొహాలు వేలాడేసుకు వచ్చారు యిద్దరూ! ముందుగా నాన్నగారు రిక్షాదిగి లోపలికొచ్చి మండువాలో చతికిలబడిపోయారు. అమ్మ మంచినీళ్ళు యిచ్చి నన్ను వినరమంది హార్లిక్సు తేవటానికి వెళ్ళింది. రిక్షావాడికి చిల్లర మార్చి డబ్బులు యిచ్చి వచ్చి 'అదేంటి బావా! ఆ మాత్రానికే? యింకా ఎన్ని చూడాలి' అంటూ నా చేతిలో





వినవక్రపుచ్చుకున్నాడు శంకరానికి పాలిచ్చి వచ్చిన నేను కళ్ళు అప్పజెప్పి చూస్తున్నాను.

హార్లిక్సు తాగుతున్నారు నాన్నగారు. 'ఏం జరిగిందిరా అన్నయ్యా?' అని అమ్మ అడిగింది.

'ఏముందీ ఆ దొంగముండ వీళ్ళని బ్రహ్మాండంగా బుట్టలో వేసింది. అది కా అంటే కా, కీ అంటే కీ, మన కుర్రాడు అప్పుడే నాలుగు నెలలనుంచి డ్యూటీకి సరిగా వెళ్ళటంలేదు. ఏవే శాంతా నీకు తెలీదా?' అన్నాడు.

నేను గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళిపోయాను. మా అమ్మ అంటోంది. 'ఆ స్వామంటే దీనికీ పిచ్చే! యింకా నయం నీ మీదపడి కరిచెయ్యలేదీరోజు'. నాకు కోపంగా ఉన్నా ఈయన ఎందుకు రాలేదో చెవుతారని వింటున్నాను.

వాళ్ళు ముందస్తుగా రాజమండ్రి వెళ్ళారుట. మా వాటాలో ఎవరో వేరేవాళ్ళున్నారుట. ఇంటి ఫ్లీడరుగారు వీళ్ళని నానా మాటలూ అన్నారుట. అద్దె కట్టలేదు. మీ అల్లుడు అన్నం తింటున్నాడా మరేమయినా తింటున్నాడా అన్నారుట. ఎంతో చెప్పు వంపేస్తానని పౌరుషపడబోయారుట నాన్నగారు. మామయ్య ఆయన చెయ్యి పట్టుకు నొక్కి అసలు సంగతి రాబట్టారుట. యిరవై రోజులక్రితం ఈయన వచ్చారుట. సామానంతా ఎత్తిగట్టేసి నెల్లిపాలెం మకాం ఎత్తేస్తున్నామన్నారుట. తన వేలి ఉంగరం తీసిచ్చి అద్దె కట్టేదాకా ఉంచుకోమన్నారుట. అంతా విని అబ్బాయితో చెప్పి డబ్బు ఏర్పాటుచేస్తామని బయటపడ్డారట. మిల్లుకి వెళ్ళి వాకబుచేశారుట. అయిదారు నెలలనుంచి సరిగా రావటం లేదన్నారుట. వచ్చినా నాలుగయిదు రోజులు డ్యూటీ చేసి వెళ్ళిపోవడటం. వార్నింగ్ యిద్దామనుకుంటున్నామన్నారుట.

అప్పట్లో నేను నెల్లిపాలెంలోనే ఉన్నాను. ఈయన ఆఫీసుకెళ్ళటంలేదని తెలుస్తూనే ఉండేది. ఎందుకెళ్ళటంలేదని ఎన్నడూ అడిగేనేగాను. నేను అజ్ఞాతవానం చేసినవుడు 'ఈయన అత్తారింట్లో ఉండగూడదు పుట్టింట్లో ఉండగూడదు' అంటే ఆ మనిషి వంచన ఉన్నారన్నమాట అనుకుంటున్నాను.

అమ్మతో పెద్దమామయ్య చెప్పుకుపోతున్నాడు.

"బావని పట్టుకునేసరికి తలప్రాణం తోక్కి వచ్చింది. అడుగడుగుకీ యిదిగో యిలాగే జావగారిపోయేవాడు. బస్సు పట్టుకుని నెల్లిపాలెం వెళ్ళేసరికి రాత్రయిపోయింది. మీ వియ్యపురాలు వంట చేసిపెట్టిందిగాని పెద్దాయన ముంగిలా మాటాడలేదు. ఇతగాడితో మాటాడదామంటే ఎక్కడా కనపడలేదు. పక్కలు వేశారు. ముసిలాయనా మా పక్కనే పడుకున్నాడు. పొద్దుట్నించి తిరిగున్నానేమో- నాకు వళ్ళు తెలీలేదు. ఓ రాత్రివేళ బావ లేపాడు. ఏం చేద్దామంటాడు. పడుకో పొద్దుట చూసుకుందామంటే వినడు. లేపి అడిగితే బాగోదయ్యా అంటే యింతకన్న చెడేదేమంటాడు మీ వియ్యంకుడు గుర్రుపెడుతున్నాడు సరేనని లేపాం! అగ్గిబరాటా అయిపోయాడు.

"వచ్చిన మనుమలు ఫలానా అందుకొచ్చామని ముందు చెప్పొచ్చు. నాతో పనిలేనప్పుడు నా గడప ఎందుకు తొక్కాలి?" అంటాడు. పోనీ బావయినా తగ్గాలా 'నీ కొడుకు గురించి నిన్నడగకపోతే ఎవరినడగాలి. నీ గడప తొక్కకపోతే ఎవరి గడప తొక్కాలి?' అంటూ లేచాడు. 'నా కొడుకేగాని నీకు అల్లుడు కాడా నీకు బాధ్యత లేదా?' అంటాడాయన. ఒకంమాట ఒకరు వినిపించుకోరు. ఎవరనేది వాళ్ళు అనేస్తూన్నారు.

'ఆ స్వామిదగ్గరే ఉన్నాడు. పొద్దుట వంపుతాను' అన్నాడు ముసిలాయన.

ఆ మాట విన్నాక బావ మరి మాటాడలేదు. గుండెలమీద చెయ్యేసుకు నిద్రోయాడు. మా యిద్దరికీ నిద్రపట్టలేదు. మనిషికి మనమీదెందుకో కోపం మండిపోతోంది. లోలోపల న్యాయంపాకంగాడు. తన కొడుకుని ఎవరూ దోవలో పెట్టలేకపోయారని ఉన్నట్టుంది. ఆ మాట తేలడు. కాలుకేస్తే మెడకూ, మెడకేస్తే కాలుకూనూ! బెంగగా అవుపించాడు. పైపై బింకమేగాని సుద్దదొల్ల.

పొద్దుట లేచాం. కాఫీలూ, టిఫిన్లూ మర్యాదలన్నీ బానే వున్నాయి. వాళ్ళ ఆఖరి కుర్రాడిని

తోడిచ్చి పంపారు. అక్కడున్నాడు నీ అల్లుడు. వచ్చేరా అనీ అడగడు. బావున్నారా అనడు. వెర్రివాలకమూ, వెర్రిచూపూనూ! బావకి పైప్రాణాలు పైనేపోయాయి. అంతలో ఆ స్వామి ఒకర్నీ ఒకర్నీ రమ్మంటోంది. మావంతు వచ్చింది. లోపలికి రమ్మంది.

దాని బండబడ! అవ్వ అవ్వ! అదేం మనిషే - అవేం తిట్లే చిచ్చిచ్చీ! దానికీ మన పిల్లకీ పదిరోజుల తేడాలో పురుడొచ్చిందిట! ఆడపిల్ల! యింకా నడుంకట్టు ఉంది.

'నేనక్కడ లేనట్రా నాకు తెలవదా మీరేంటనుకుంటున్నారో నేను నీ కూతురి కాపురం నిలబెట్టాలా మీరు నామీద వన్నాగాలు చేస్తారా' అంటోంది.

ఒక్కటందా! అసహ్యం వేస్తుందనుకో దాని మాటలకు! దానిలో ఏదో ఉంది. మనసలా తిట్టిపోస్తుంటే మనం ఏం చెయ్యకపోతే అది దాని మహాత్మ్యం కాదూ! తర్వాత అందీ 'మీకు మీ అల్లుడు కావాలి. తీసుకుపోండీ నేనేం పట్టుకోలేదు!'

ఈయనగార్ని రావయ్యా మగడా నీ పెళ్ళానికి బాగులేదూ అంటే మావేపు మొహం కూడా తిప్పాడుగాదు. వెళ్ళి పళపళలాడించేద్దామనుకున్నాను. అణుచుకున్నాను. బావ వెళ్ళి దాని కాళ్ళు పట్టేసుకున్నాడు నాకు మతోయింది. 'లేరా పెద్దాడా నువ్వు నా కొడుకు చుట్టానివి' అంది. 'నీ కూతురు నాకు అమ్మరా! అది నాకు పాలిస్తోంది. పెంచాలి. దాన్ని చంపుతానా? - ఈ మందు పట్టుకెళ్ళి దానికి వెయ్యి. నీ కూతుర్ని దాని అమ్మతో పంపరా!' అంది. అదేంటమ్మా! చచ్చి బతికింది. యింకా రెండో నెల అంటున్నాడు. దాని సిగదరగ! ఎంత గొంతుకే బాబూ! నీ కూతురు కాపురం కావాలంటే నేను చెప్పినట్టు చెయ్యి అంది.

మామయ్య మాటలు వింటున్న అమ్మ దీనమ్మ కడుపు కాలా శనిముండ - నన్నెందుకు రమ్మందీ అంటోంది. అంతే! 'స్వామీ స్వామీ' అంటూ అరుస్తూ ఆ గదిలోకి వెళ్ళాను. శాంతా శాంతా అంటూ చుట్టూ మూగుతున్నారు. మగతలా కమ్మేస్తోంది. పడిపోయాను. మళ్ళీ ఆరోజులాగే పళ్ళు గిట్టగరిచేసి కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటున్నానుట. నాన్నగారు పాపం! బీపీ వచ్చేసింది.

డాక్టర్ని తీసుకొచ్చాడుట పెద్దమామయ్య. డాక్టరు నాకూ, నాన్నగారికీ యింజక్షన్లు చేశాడట. పురిటిలో కొందరికి అలాగే అవుతుందన్నాడట. ఆ మాట నాతో అప్పుడు చెప్పలేదు. నాకు మెలకువ వచ్చేదాకా నాన్నగారు తప్ప మిగిలినవాళ్ళు మెలకువగా ఉన్నారు.

ఇంత జరిగినా నాన్నగారెంత కేకలు వేసినా అమ్మ నెల్లిపాలెం వెళ్లనుగాక వెళ్ళననేసింది. మామయ్య మాట కూడా సాగలేదు. మూడురోజులు వరసాగ్గా నా స్వామి పిలుస్తోందనటం, స్పృహపోవటం, కాళ్ళూ, చేతులూ కొట్టుకోటమూనూ! హిస్టీరియాగాని ఎపిలెప్సీగాని అవొచ్చని కాకినాడలో చూపించమనీ అన్నారట డాక్టరు. నేను రానన్నాను. చస్తానన్నాను. నన్ను నెల్లిపాలెంలో దింపెయ్యమన్నాను.

చివరికి నా గొడవ అమ్మని భయపెట్టిందో నాన్నగారి కేకలు పనిచేశాయో మామయ్య ఒప్పించాడో మరి అమ్మ తన పట్టు విడిచిపెట్టింది. అమ్మ అంతలా పట్టుబట్టగలదనుకోలేదు. అలాంటి పట్టు నా చదువుకోసం పడితే ఎలా ఉండేదో!

మామయ్య ముహూర్తం పెట్టాడు. ఫలానారోజున ఫలానా టయిముకు వస్తున్నారని ఉత్తరం మా అత్తారికి రాయించి పోస్టు చేయించాడు. మా అమ్మను కూర్చోబెట్టి చెప్పాడు. వాళ్ళేమన్నా నోరు మెదపకు! పిల్లనొదిలేసి వచ్చేయ్! ఏవో పిచ్చులూ అవీ వున్నా సాంప్రదాయికులు! మనవడిని చూసుకోవాలనే ఉంది. ఏంచేస్తారు పాపం! ఏదో పిచ్చిలోపడ్డారు. కాలమే మారుస్తుంది.

ప్రయాణం నిశ్చయమయ్యాక నా భయం నగం తీరినట్లయింది.

అమ్మ యధావిధిగా కడుపు చలవకోసం చలిమిడీ, జంతికలూ చేసింది. పిల్లలతో సామాన్లతో నెల్లిపాలెం రోడ్డుమీద దిగేసరికి ఎండ పేల్చేస్తోంది! సూర్యుడు నడినెత్తిన ఉన్నాడు. మా అత్తారు రోడ్డుమీదకు బండి పంపే మనుమలే! ఆరోజు పంపలేదు.

* * *

"నేననుకున్నంతా అయింది" అంది అమ్మ.




అవును నిజమే! ఆరోజు ఎండ మండించే స్తోంది. కదపరాని శిశువుని కదిపి ఆడమనిషి ఒక్కత్తీ నానా హైరానాపడి, పిల్లముండలు అదీ యిదీ కొనమని తినేస్తూంటే కొంటూ, నాతో అంతదాకా ఏమీ మాట్లాడకుండా అక్కడికి చేర్చింది అమ్మ.

అలాంటి దొంగస్వామి వెనకాతల పడిన పిచ్చి పీనుగలు మీరు! బండి పంపొద్ద నుంటుంది. యింకా నయం చంటిబిడ్డను నడిపించి తీసుకురమ్మనలేదు అంది.

నాకు మళ్ళీ ఆవేశం వచ్చింది. 'స్వామీ స్వామీ' అంటూ పడిపోయాను. బస్సుకోసం చూస్తున్నవాళ్ళు వచ్చేశారు. సోడా తెచ్చి యిచ్చారు. అది తాగించి మొహం తుడిచింది. నాకు స్పృహ వచ్చింది. పోగయినవాళ్ళలో మా బావగారున్నారు. పిల్లల్ని ఆయన భుజానికె క్కించుకున్నారు. అమ్మ చంటిబిడ్డకు ఎండ తగలకుండా కప్పి ఎత్తుకుని నా దండ పట్టు కుని నడుపుతోంది. మా పిచ్చిబావగారితో చె ప్పుకుంటోంది అమ్మ.

ఇంటికి చేరుకున్నాం. బావగారు ముందుగా పరుగెత్తి పందిరికింద పడుకున్న మామగార్ని పంచెపట్టుకు లాగి లేపేశారు. ఆయన చిర్రుబుర్రులాడుతూ లేచారు. మా రాక గురించి ఆయన చెప్పారు.

"అదేంటమ్మా - ఉత్తరమయినా రాశారుగా దూ" అంటూ వెనకాతల వస్తున్న మాకు ఎదురొచ్చారాయన. అమ్మకి ఒళ్ళు తెలీలేదు.

"నడిచొస్తే ఎలాగుంటుందోనని రాయలే దండన్నయ్యగారూ" అంది.

ఆ మాటకి ఆయనకి చాలా కోపం వచ్చే సింది. మాట అనెయ్యటానికి ఆడమనిషి, నోట్లో నోరు పెట్టాలా అని సంకోచంగాబోలు. ఇంతట్లో మా అత్తగారు ఆయన వెనకనే వస్తూ అందుకున్నారు

"అదేం మాటమ్మా - పెద్దమనిషిని పట్టు కుని అందుకే స్వామి చెప్పారు - లోపలికి రండి!"

ఎండలోనుంచి వచ్చామేమో కొంతసేపు మా కళ్ళకి ఏదీ కనబడలేదు. అమ్మ అలాగే వాకిట్లో నిలబడి "ఏంచెప్పారు?" అంది.

"చెపుతాను లోపలికి రండి" అంది అత్తగారు.

"వచ్చినంతవరకూ చాలు వదినగారూ! మీ కోడలునీ, మనవలనీ తీసుకొచ్చాను. పెట్టాల్సి నవన్నీ శక్తికొద్దీ పెట్టాము., మీవన్నీ మీకు అప్పజెప్పాము. నావనయిపోయింది. నేను పోతాను" అంది అమ్మ.

మా బావగారు 'బండి పంపలేదు, పంపలే దు' అంటూ పాటపాడుతున్నారు. ఇంటి ముందున్న పాకలో వాల్చిన మంచంమీద చతి కిలబడిపోయాను. మామగారు అమ్మ మాట లకు ఆశ్చర్యంతో అలా నించుండిపోయారు. ఒక్క ఉదుటున వెళ్ళి మా బావగారిమీద చెయ్యి వేసుకుని 'బయటికి పోరా వెధవా' అన్నారు, ఆయన పరుగెత్తారు. అప్పుడు అమ్మవేపు తిరిగారు

"చూడండి! మిమ్మల్ని రమ్మన్నదీ, మీ అమ్మాయిని తీసుకురమ్మన్నదీ నేను కాదు. మీ అల్లుడున్నాడు. స్వామి ఉన్నారు! వాళ్ళకి మీ పిల్లనీ, దాని పిల్లల్నీ అప్పజెప్పి వెళ్ళిపోండి" అన్నారు.

"అలాగే అప్పజెపుతాను! వాళ్ళని రమ్మ నండి" అంది అమ్మ.

మామగారు మాట్లాడేలోగా అత్తగారు అందుకున్నారు. "మాటకి మాట బానే చెపుతు న్నారే! మీ అల్లుడు స్వామివారి ఆశ్రమంలో ఉన్నాడు! తీసుకువెళ్ళండి!"

అంతవరకూ విన్నాను. అంతవరకూ స్వా మి జపం చేస్తున్నాను. మంచంమీద కూర్చున్న దాన్ని అలాగే ఒరిగిపోయాను. ఎండ, నడక, అన్నీ కలిసొచ్చాయి.

నీరసం కమ్మేసింది. కాళ్ళూ, చేతులూ కొట్టు కోటం, స్వామీ, స్వామీ అరుపులూ లేవు. అమ్మ కేం చెయ్యాలో తోచలేదు. భాస్కరమూ, తోటికో డలూ పరుగెత్తుకు వచ్చారు. మా అత్తగారు నీళ్ళు తెచ్చారు. నీళ్ళు జల్లి మొహం తుడి చింది అమ్మ. పెట్టె తెరిచి యింగ్లీషుమందు తీసింది. మా అత్తగారు వీల్లేదంది. భాస్కరం ఈయనకోసం పరుగెత్తాడు. స్వామి విభూదిని పెట్టారు మా అత్తగారు. ఇంటిచుట్టూ దారాలు

కట్టించింది స్వామి. ఎవరో యింటిమీదకు దేన్నో పంపారట. అన్నీ కష్టాలేనట. ఆ దారాలు అందరికీ కట్టిందిట. నావంతు ముక్క ఆ క్షణంలో కట్టారు అత్తగారు. మామగారితోసహా అంతా నా మంచంచుట్టూ చేరి జపం ఆరంభించారు.

కొంతసేపటికి కొంచెం నీళ్ళు తాగగలిగాను. వేడివేడి పాలు యిచ్చారు. అమ్మ అక్కడే అరుగుమీద కూర్చుని చంటిబిడ్డకు గొంతు తడుపుతోంది. 'చూశావా స్వామిపట్టు - ఎలా తేరుకుందో శాంత!' అనుకుంటున్నారు అత్తగారూ, మామగారూ, సూర్యమూనూ! రాజ్యాన్నీ, కాముడినీ తీసుకెళ్ళి అన్నం పెట్టింది మా తోటికోడలు. వాళ్ళు అన్నలతో ఆటల్లోపడ్డారు.

లేచి కూర్చున్నాను. ఆడాళ్ళకూ, మగాళ్ళకూ ఒక్కటే తేడా! మగాళ్ళది ఆకలి. ఆడాళ్ళది నీరసం. తిండీ తిప్పలు లేవు. నీరసంతో ప్రాణాలు పోయినా సహించటం అమ్మకయినా, నాకయినా ఆడవాళ్ళకెవరికయినా అలవాటే!

భాస్కరం ఆ మనిషి యింటినుంచి వచ్చాడు. ఈయన రానన్నారుట! స్వామి శవంగా ఉందిట! బతికాక అక్కడికే రమ్మన్నారుట.

ఆ కబురు విని అంతా ఒకరిముహాలొకరు చూసుకున్నాం! అంతా అమ్మవేపు చూశాం! పాపం! అమ్మ! వెర్రిదాన్లా అక్కడే కూర్చుని చంటిపిల్లాడికి ఉగ్గుగిన్నెతో చుక్కా చుక్కా పాలుపడుతోంది. నాకారోజు అమ్మ ఏనాడూ మరుపురాదు! ఇది రాస్తూంటే ఈ అమ్మనేనా యిన్నాళ్ళూ నా కాపురం ఇలా అయిపోటానికి కారణమనుకున్నానూ! అనిపిస్తుంది. అందుకే ఆరోజు అయిన ప్రతిదీ నాకింత గుర్తు. ఎండిన పసుపుకొమ్మలాంటి అమ్మను నేను ఎప్పుడు అర్థంచేసుకున్నానూ!

"నేను వెళ్ళిపోతాను" అంది అమ్మ నీరసంగా.

"ఒమాట అన్నానంటే అంతే! చూడండీ... మిమ్మల్ని రప్పించింది స్వామివారు. ఆపని చూసుకుని వెళ్ళండి. లేదంటారూ మీ అమ్మాయిని తీసుకుపోండి" అన్నారు మామగారు.

అమ్మ మాట్లాడలేదు.

"పదండి లోపల కూర్చుందాం" అన్నారు అత్తగారు.

అమ్మ కదలలేదు. నేను లేచి అమ్మదగ్గరికి వెళ్ళాను. 'రా అమ్మా' అన్నాను. దూడవెంట ఆవులా నా వెనకే వచ్చింది. మా అత్తగారూ, తోటికోడలూ నన్ను నించోబెట్టి దిష్టితీశారు. లోపలికి వెళ్ళాక అమ్మ అన్నానికి రాలేదు. నువ్వు తింటేగాని నేను తిననన్నాను. అమ్మ బిడ్డకోసం ఏం చెయ్యదూ? నవమాసాలూ మోస్తుంది! నానా అసహ్యాలూ భరిస్తుంది. చంటిపిల్లలంటే ఎంత ముద్దున్నా బట్టలు పాడుచేస్తారేమోనని చిన్నప్పుడు యిదయిపోయేదాన్ని. ఏంచేస్తున్నానిప్పుడు? వాటిని చేత్తో ఎత్తుతున్నాను. కాలితో రాస్తున్నాను. ఆ బట్టలు ఉతుకుతున్నాను. ఒంటికి అంటుకుంటే కోసేసుకోవాలనిపించేది. అలాంటిది లేచిపోతుందేమోనని అలాగే పడుకుని ఆ తడికి అది లేచి కదిలితేనే లేచి దాని బట్టలూ, నా బట్టలూ మారుస్తున్నాను.

అమ్మా, నేనూ ఏదో కతికి నిద్రోయాం! మందుబిళ్ళ మింగుతోంది అమ్మ. అప్పుడు తెలిసింది ఆవిడకి జ్వరమని! 'స్వామికి దండం పెట్టుకో తగ్గుతుంది' అన్నాను. అమ్మ దుప్పటి కప్పుకు పడుకుందారాత్రి.

ఈయన యింకా కనపడలేదని మనసు కొట్టుకుపోతోంది. ఆ రాత్రి మా తోటికోడలు చాలా విశేషాలు చెప్పింది. 'మా యింటిమీద ఎవరో ప్రయోగాలు చేసార్ట! స్వామి అవన్నీ వదిలించిందిట. భాస్కరానికి కరిణీకం యిప్పించిందిట. సూర్యానికి సినిమాహాల్లో టిక్కట్లమ్మే పని కుదిరించిందిట! మామగారికి ఓరోజు రాత్రి కాలూ చెయ్యీ లాగాయిట. వెంటనే పిలిచినట్టు వచ్చేసి రక్షించిందిట. ఈయన అప్పుడప్పుడు డ్యూటీకి వెళ్తున్నారుట. 'మీరెప్పుడొచ్చినా ఫరవాలేదండీ' అన్నాట్ట వాళ్ళ యింజనీరు.

మర్నాడు స్వామి బతికిందనీ, రావొచ్చనీ పన్నెండు గంటలకి కబురొచ్చింది. బండి కట్టారు. పిల్లల్తోసహా వెళ్ళాం. రెండుగంటలదాకా రానీలేదు ఆ మనిషి. ఇంటిముందు పెరడంతా మొక్కలూ, అవీ పెంచారు. చావలు వేశారు. 'ఆరోజు ఎక్కువమంది లేరు, తీర్థప్ర




జే' అంటున్నాడు భాస్కరం. ఈయనకోసం చూస్తున్నాను. కావిడి వేసుకుని నీళ్ళు తెస్తున్నారు. గడ్డం పెరిగిపోయింది. సన్నబడిపోయారు. మనిషిని చూస్తుంటే కడుపులోంచి బాధ తన్నుకొచ్చింది. నన్ను చూడలేదు. నీళ్ళు పోసేసి వెళ్ళిపోయారు. అమ్మ చెయ్యి పట్టుకున్నాను. ఓదార్చలేదు. విరక్తిగా కూర్చుంది. ఆ రెండు గంటలూ నీళ్ళు మోస్తూనే వున్నారు. అమ్మ మాట్లాడటంలేదు, పిల్లలు ఎండలో ఆడుతున్నారు.

లోపలికి రమ్మంది! వెళ్ళాం. డబుల్‌కాట్ మంచంమీద కూర్చునుంది. ఆ పరుపు, రబ్బరుగుడ్డా చూడగానే అవన్నీ మావేనని అమ్మ పట్టేసింది. నేను ఆ మనిషినే భక్తిగా చూస్తున్నాను.

"ఇది నీ అమ్మా?" అంది. అవునన్నాను చేతులు జోడించి. 'ఇలా రావే!' అంది. చంటిబిడ్డతో కదిలాను. 'ఆగవే!' అంది. ఆగాను. 'పార్వతీ! ఏడే వాడూ?' అంది. ఈయనని పిలిచారు. వచ్చారు.

'నన్నిలా తీసుకురారా' అంది. ఏమంటోందో ఎవరికీ అర్థంకాలేదు. పార్వతి ఈయనకి చంటిబిడ్డని తీసుకెళ్ళమని చెప్పాడు.

'యింకా బారసాల చేసుకోలేదు స్వామీ' అన్నారీయన.

'వెర్రిపీనుగా నాకు తెలవదా! నీ కోరిక మీద నేను నీకు పుట్టాను. నాకు గ్రహాలూ, శాంతులూ ఏమిట్రా తీసుకురా' అంది.

ఎన్నాళ్ళయిందో ఆయన నాదగ్గరికొచ్చి. నా చేతుల్లోంచి బిడ్డని తీసుకున్నారు. ఆ మనిషి దగ్గరకు వెళ్తూంటే ముక్కు ఎగబీలుస్తూ - 'ఏంటా వానన... ఏంటా వాసన' అంది.

'నన్నెవరో మైలచేశారు' అంటూ చుట్టూ చూసింది. కళ్ళు పెద్దవిచేసి కోపంతో ఊగిపోతూ అమ్మనే చూస్తూ అంది

"ఒసి నువ్వటే... గంగ అంశను పుట్టి నీచురాలా! నువ్వెందుకొదుల్తావు నన్నూ నువ్వు నాకు ఉగ్గూ, నీళ్ళూ పోశావు అన్నీ నీవి ఎక్కించావు' అనేసి కళ్ళుమూసుకుంది.

'నీకేం భయంలేదే! నిన్నూ నీ మనవడినీ శుద్ధిచేస్తాను' అంది.

అమ్మ మాట్లాడకుండా సినిమా చూస్తున్నట్టు చూస్తోంది. నేను అమ్మనే చూస్తున్నాను. 'గంగకి పిల్లలు దక్కలేదు. నీకూ దక్కలేదు. పెంచావు. వాళ్ళు నీకు అవలేదు. నీ కోడళ్ళరూపంలో వచ్చి నీకు కాకుండా చేసింది పార్వతి. నీకెంత మందున్నా నమ్ముకున్నప్పుడొకళ్ళనే నమ్ముకున్నావ్!' అంటోంది.

"పిల్లని తెమ్మంటే వచ్చాను. నువ్వేం శుద్ధి చేస్తావో నా అల్లుడికీ, కూతురికీ చెయ్యి! నేను పోతున్నాను" అనేసి అమ్మ బయటకి వెళ్ళిపోయింది.

నేనలా నించుండిపోయాను. ఆ మనిషి పకపకా నవ్వింది.

'అది నా పెళ్ళాంరా! నా మాట వినదు! దాని కూతురినీ, మనవడినీ తీసుకుపొమ్మని చెప్పు! నీ మామతో పంపమని చెప్పు. దాని రోగం నేను కుదురుస్తాను' అంది.

ఈయన చేతిలో శంకరాన్ని ఆ మనిషి కాళ్ళదగ్గర పెట్టారు. నేనూ వెళ్ళాను. ఇద్దరం దణ్ణం పెట్టాం! మా యిద్దర్నీ దగ్గరకు తీసుకుంది. నుదుట ముద్దుపెట్టుకుంది.

'పొండర్రా! మిమ్మల్ని జన్మలో విడదీయలేరు. నీ పెళ్ళాంకూడా దారిలోకొచ్చింది. అందుకే మీ కడుపున పుట్టాను. నీ బాబుని తీసుకురా! వాడు గణపతి! నన్ను శుద్ధిచేసుకోవాలి' అంది.

మేం బయటకొచ్చాం! 'మామగారితో పంపండి మీ అమ్మాయిని. మీరు తీసుకుపొండి' అన్నారు ఈయన. అమ్మ చెపుతున్నది వినిపించుకోకుండా వెళ్ళిపోయారు.

'పదపద! చేసుకున్నాళ్ళకి చేసుకున్నంత' అమ్మని అసహ్యంగా చూస్తూ అన్నాను. దిక్కుతోచనట్టు అమ్మ ఉండిపోతే నేనే పురమాయించాను భాస్కరానికి - మమ్మల్ని రోడ్డుమీద దింపమని! ఈయన తీసుకెళ్ళిన పిల్లల్ని తీసుకురమ్మని!

మమ్మల్ని రోడ్డుమీద దింపాడు. మరో అర

గంటలో వచ్చి రాజ్యాన్నీ కాముడినీ పంపొద్దని స్వామి చెప్పిందన్నాడు. మేం బస్సు ఎక్కాం!



"ఓమాట చెపుతాను వింటావా?" రెండు గంటలయినా అయింది మేం మాట్లాడుకుని. అమ్మ ఆ మాట అంది.

"ఏంటి?' అన్నాను.

"నువ్వింక నెల్లిపాలెం వెళ్ళనని మీ నాన్నగారితో చెప్పవే శాంతా!" నేను ఆవిడవేపు చూసే సరికి మొహం తిప్పుకుంది. నేను నోరు విప్పే లోగా తనే అంది

"నువ్వు అలా పట్టుబడితే నేనూ గట్టిగా చెపుతాను"

"ఒప్పుకుంటారా?" అన్నాను అమ్మ ఏమంటుందోనని. జవాబివ్వలేదు అమ్మ.

"నీకెందుకే మా కాపురంలో నిప్పులు పొయ్యాలనుందీ?" అని అడిగాను.

"కన్నాను గదమ్మా అందుకనీ" అమ్మ కొంగు నోట్లో దోపుకుని దుఃఖం ఆపుకోబోయింది. ఆ క్షణంలో నాకు జాలివెయ్యలేదు. బస్సు వెళుతోంది. నేనే మళ్ళీ అన్నాను.

"స్వామివారిమీద అంత కోపమెందుకే నీకూ?"

"కోపమనిగాదే" ఏదో చెప్పబోయింది.

"దేవుడిమీదా కోపమేనా?" అన్నాను.

"తనేం దేవుడు కాదు' అంది.

"నీకెలా తెలుసును?" అన్నాను.

"దేవుడు తిట్టడు"

"వెధవ పనులు చేస్తే ముద్దెట్టుకుంటాడా?"

"ఛండాలం తిట్లు తిట్టడు" అంది.

"నువ్వెప్పుడయినా చూశావా ఎలా తిడతాడో తెలీడానికి"

"పోన్లే అమ్మా, నువ్వూ నీ మొగుడూ ఊడిగాలు చెయ్యండి. తిట్లు తిట్టించుకోండి"

మేం బస్టాండులో దిగి రిక్షా కట్టించుకున్నాం. అప్పుడు మళ్ళీ అంది "నామాట విను, అక్కడకెళ్తే నువ్వు నాకు దక్కవు" అంది చెయ్యి పట్టుకుని.

"ఎందుకమ్మా అంత భయం?" అన్నాను. అమ్మకి ఏం చెప్పాలో తెలీలేదు. "నీకాపురం సరవుతుంది. ఈ పీడ వదిలిపోతుంది. తిరపతికి మొక్కుకో!" అంది.

"నీకు మరీ పిచ్చెక్కువవుతోంది. దేవుడు నా ఒడిలో ఉన్నాడు. నెల్లిపాలెంలో ఉన్నాడు. తిరపతెందుకే?" అన్నాను.

మమ్మల్ని చూసి గాభరా అయిపోయారు నాన్నగారు. అమ్మ ఆయనతో మాట్లాడుతుంటే నేను చంటాడికి దిష్టి తీసి పాలు పట్టి పడుకోబెట్టాను. "పిల్లల్నుంచేసుకున్నారా ఏంటి వాళ్ళ ఉద్దేశ్యం" కేకలు వేస్తున్నారు నాన్నగారు. అమ్మ ఏం చెప్పిందో నాకు తెలీలేదు. నా పిల్ల నాకు బరువా, మంచీమర్యాదాలేనివాళ్ళు" అంటున్నారు. నేను వెళ్ళాను.

"పిల్లల్ని అటూ యిటూ తిప్పటమెందుకని ఉంచేసుకున్నారంతే! వాళ్ళకి మాత్రం మనవలుగాదా?" అన్నాను. ఆ మాటకి నాన్నగారు ఎంత సంతోషించారనీ! "అదీ నా కూతురంటే! అత్తారిని వీధిలో పడకుండా కాసుకొస్తోంది" అన్నారు. అమ్మ మాత్రం విస్తుపోయింది. ముక్కుమీద వేలేసుకొని నమ్మలేనట్టుగా బుర్ర ఊపింది.

ఆ రాత్రి అన్నాలూ అవీ తిని పడుకున్నాం!

మర్నాడు సాయంకాలానికి పెద్ద మామయ్య వచ్చాడు. అమ్మే ఫోన్ చేయించిందేమో! మామయ్య పక్కింట్లో ఫోన్ ఉంది. నాన్నగారు వీధిలో పేపరు చూస్తున్నారు. అమ్మ, అమ్మమ్మ, మామయ్య చేరారు. అమ్మ నన్ను వెళ్ళమంటే




వెళ్ళలేదు. 'ఫరవాలేదు చెప్పవే!' అన్నాడు మామయ్య.

"ఏం చెప్పనూ దీనికి నా మాట పడదు, నోరెత్తితే యిది సామీ సామీ అని విరుచుకు పడిపోతుంది" అంది.

"నేను కావాలని చేయటంలేదు, అదంతా స్వామి ప్రభావం" అన్నాను.

"అలాగే అనుకుందాం, నిన్ను చూస్తే తెలుస్తూనే వుంది ఆ విషయం! నువ్వెళ్ళి నీ పిల్లాణ్ని చూసుకో" అంది వెటకారంగా.

నేను కదలలేదు. అమ్మ విసుక్కుంది. నేను నానా మాటలూ అన్నాను.

"నాకాపురం కూలుస్తున్నావు, నా కొంపకి నిప్పెడుతున్నావు" అంటున్నాను. నాన్నగారెప్పుడు వచ్చారో నా మాటలు ఎక్కడనించి విన్నారో అమ్మ మీదకి వెళ్ళారు. అమ్మ ఏం అనకపోయినా ఎందుకంత కోపమొచ్చిందో "నీ వల్లే నీవల్లే" అంటూ కూచున్న అమ్మని రెండు గుద్దులు గుద్దారు.

మామయ్య లేచిపోయాడు "మనవల్నెత్తిన మనిషిని కొడతావా, నువ్వు మనిషివా పశువ్వా. మీ యింట్లో నా చెల్లెలు గనక కాపురం చేసింది, మరొకరైతే నూతిలో పడి చచ్చేవారు. పదవే పోదాం, యిక్కడ ఒక్క నిముషం ఉండొద్దు, నువ్వొక్క మనిషివి నాకేం బరువుకాదు"

నాన్నగారు తగ్గిపోయారు. "కన్నకూతురి కాపురం విడదీస్తాననటుందేంటి? అదేమయినా న్యాయమా చెప్పు?"

"అవునయ్యా, అంది. ఎందుకందో ఏంటో నువ్వు అడిగావా? నిన్నగాక మొన్న పుట్టిన బొడ్డూడని పిల్ల ఏదో కూస్తే, అదేంటే అలా అంటావూ అనాలా? నిజమనేనుకోవాలా? కన్నతల్లి తనకూతురి కాపురం నిలబెట్టాలనుకుంటుందా? విడదీసి నెత్తికెక్కించుకోవాలనుకుంటుందా?" అన్నాడు పెద్ద మామయ్య.

"అమ్మకి ఆ స్వామి అంటే భయం! తన రహస్యాలన్నీ తెలుసునని" అంటున్నాను.

"ఛీ ఛీ ఛీ ఛీ..." అంటూ తల అటూ యిటూ తిప్పుతూ, "నువ్వు కన్నకూతురివి గనక యింకా నీ మొహం చూస్తున్నాను! తల్లి భయమంతా పిల్ల బ్రతుకు గురించేనే! పోతే పోనీ దిక్కుమాలిన కాపురం నువ్వు బతకాలనేనే నా ఏడుపు! కన్నావుగదా- పెళ్ళిళ్ళు చేస్తావుగదా, అప్పుడిలాంటి నజ్జు నీకూ తగిలితే తెలుస్తుంది" అనేసి అక్కడనించి వెళ్ళిపోయింది.

నాన్నగారికి నా మీద పట్టరాని కోపం వచ్చింది. ఎప్పుడూ మాతో సరిగా మాట కూడా అనని మనిషి వచ్చి, "చాలా సంతోషించాం! చదివేస్తే ఉన్న మతి పోయినట్టు బాగా తయారయావు? వెళ్ళు- వెళ్ళి మీ అమ్మ కాళ్ళు పట్టుకో"

నేను కదలలేదు. రాయిలా నిలుచుండిపోయాను.

కోపం ఉన్నా ఏడుపున్నా కన్నపిల్లలు మాట వినకపోతే ఏం చేస్తారు ఎవరయినా? మా నాన్నగారిని ఆడపిల్లలు ఎదిరించలేదు. ఎదిరించిన అన్నయ్యలని చిన్ని చిన్ని వాటికే తాళ్ళు నలిగిపోయేలా చెక్కపేళ్ళు విరిగిపోయేలా చితకగొట్టిన మనిషి. ఆ ఆవేశంలో ఏం చేసేవారో! మామయ్య నాన్నగారి చెయ్యిపట్టుకు లాక్కుపోయాడు.

నేను గదిలోకి పోయి శంకరానికి పాలిచ్చి పడుకున్నాను. ఆ రోజు స్వామి జపం కూడా చేశాననుకోను. అమ్మమ్మ వచ్చింది."మగాళ్ళు తినేశారు. భోంచేద్దువుగానిరావే" అంది. "నాకాకలిలేదు" అన్నాను.

"అన్నం మానేసి ఎవరినుద్ధరిస్తావే" అంటోంది. కసిరేశాను. తొమ్మిదింటిదాకా ఎవరూ నన్ను కదపలేదు.

లైటువేసింది అమ్మ. "శాంతా! శాంతా!" అంటూ లేపింది. మాట్లాడలేదు. "నన్నింక సాధించకమ్మా, నావల్ల పొరబాటే అయింది. చంటిబిడ్డ తల్లివి చచ్చిబతికావు, నీ బిడ్డకోసమయినా తిను, ఆ స్వామిగారు ఏంచెపితే అది చేసేస్తున్నారు. వాళ్ళు నిన్ను చూట్టానికయినా పంపలేదు. నీ మొగుణ్ని నీతో మాట్లాడనీలేదు. నిన్నేదో చేసేస్తారని భయంతో ఏడిశాను. ఇంక నేను నోరెత్తను. అంతా ఆ పరమేశ్వరుడి చిత్తం! రేపు నాన్నగారు నిన్ను తీసుకెళ్తారు. వాళ్ళ కాళ్ళు పట్టుకునయినా అప్పజెపుతారు,



లే! అన్నం తిను'' అంది. ఏడుపు వచ్చేసింది నాకు. అమ్మ నా చెయ్యిపట్టుకుని అన్నం కంచం ముందు కూర్చోబెట్టింది.

మర్నాడు నాన్నగారు నన్ను నెల్లిపాలెం తీసుకెళ్లారు. ఏమంటారో ఏంటోనని అడలి చచ్చున్నామేమో వాళ్ళు భోజనాలూ అవీ మర్యాదగా చేశారు. దాంతో నాకు కొంచెం బెంగ తీరింది. వియ్యంకులిద్దరూ వీధరుగు మీదున్నారు, మా అత్తగారి పెద్ద గొంతుక వినిపిస్తోంది.



''అసలు ఆడదాని లక్షణాలేనా అవి! చెట్టంత మనిషి మగాడూ ఊరంతా లేచి నించుంటారు, చేతులు కట్టుకు మాట్లాడతారు, అలాంటి మనిషిని...''

ఆవిడ అలా దులిపేస్తోంది. మా తోటికోడలొచ్చి ''చూశావుటే శాంతా! ఒక్కర్నీ చేసి ఈ పీనుగలెలా ఆడిస్తున్నారో! అసలు వీళ్ళు మనుమలేనా, అవునులే నీకేం తెలుస్తుంది. చుట్టపు చూపుగా వచ్చిపోయేదానివి'' అంది. యింకా అత్తగారి గొంతు పెరిగేసరికి కాళ్ళూ చేతులూ వణికాయి. గుండెలు గుబగుబలాడుతూండగా వీధిలోకెళ్ళాను. నాన్నగారు ముద్దాయిలా తలొంచుకు కూర్చుంటే నాకు ఒళ్ళంతా చచ్చుపడిపోయినట్లయింది. నన్ను చూడగానే అత్తగారు అన్నారు,

"ఆ స్వామి చెప్తున్నారని మళ్ళీ మీ కూతుర్ని యింట్లోకి రానిచ్చాను" మా నాన్నగారు మంచం మీంచిలేచి "నువ్వు లోపలికి పో శాంతా" అరిచారు. దిగ్గుమంటున్న గుండెలతో లోపలికి నడిచి తలుపువారన నించున్నాను.

"అయ్యా! మీరు రమ్మన్నారు. వచ్చాను. పిల్లని తీసుకొచ్చాను. మీరు ఆర్డరు వేశారని నేను నా పెళ్ళాన్ని వదిలెయ్యలేను, నేను చెపితే మీరు వదిలెయ్యలేరు" అంటున్నారు నాన్నగారు. మామగారింకా మాట్లాడనే లేదు.

"నేనేం చేశానని నన్ను వదిలెయ్యాలయ్యా?"

"ఎవరేం చేశారో చేసినాళ్ళకి తెలుస్తుంది. చూసినాళ్ళకి తెలుస్తుంది. అన్నీ కనిపెట్టుండే ఆ భగవంతుడికి తెలుస్తుంది" అనేశారు నాన్నగారు. "ఏంటి నీ ఉద్దేశం?" మామగారు లేచారు. "మీ ఉద్దేశమేంటి?" నాన్న అరిచారు. ఎవరేం అంటున్నారో తెలీటంలేదు. భయంతో కాళ్ళూ చేతులూ ఒళ్ళూ వణికిపోతున్నాయి. 'నీ పెళ్ళానికి చెప్పుకోటం రాదు నీకు' అన్నారు మామగారు. "నీ కొడుక్కి చెప్పుకోటం నీకొచ్చా? ఉద్యోగానికి సరిగా వెళ్ళటం లేదని అడిగావా?" అన్నారు నాన్నగారు. 'ఏం! నాకే కొడుకా? నీకు అల్లుడు కాడా? నువ్వు అడగలేకపోయావా? నీ కూతురి చేత అడిగించలేకపోయావా' అన్నారు మామగారు. 'మీకు లేని అధికారం నాకెక్కడినుంచి వస్తుంది' అన్నారు నాన్నగారు.

"మీరు ఇంటికొచ్చారు. మాట తూలితే నాకు మాట మిగిలిపోతుంది. మాటకి మాట తెగులు! నీటికి నాచు తెగులు! రమ్మన్నదివాళ్ళు మీపని వాళ్ళతో చూసుకోండి' అనేసి దుప్పటి కప్పేశారు మామగారు.

వాళ్ళ మాటలవుతూండగా అత్తగారొచ్చి 'నువ్వెందుకే అక్కడ! పోయి పడుకో' అంటూ కసిరారు. మర్నాడు పొద్దుటలేచాను. రాజ్యానికి స్నానం చేయిస్తూంటే చూశాను. జూకాలు లేవు. కన్నాలు పూడుకోకుండా చీపురు పుల్లలున్నాయి.

'స్వామివారి అమ్మాయికి యిచ్చేశాను' అంది. నాలుగురోజుల్లో రాజ్యం ఎంత మారిందీ! స్వామి స్వామి అని జపంతో స్నానం చేస్తుంటే! ఎందుకో ఏడుపు తన్నుకొచ్చింది. నీకేం భయంలేదే శాంతా, అంటోంది మా తోటికోడలు. ఎందుకేడిచానో నాకే తెలీదు. తనకి తెలిసినట్టు ఆవిడ అంటుంటే నాకు అసలు నచ్చలేదు. పిల్లలిద్దరికీ స్నానాలు చేయించేసి అక్కడనుంచి బయటకు వచ్చాను.

తొమ్మిది గంటలకు వచ్చింది పిలుపు.

పొద్దుట్నించి నాన్నగారు ఏమైనా తిన్నారో లేదో తెలీదు. వెంటనే బయలుదేరాం! పిల్లలూ వెంటబడ్డారు. వెంటనే లోపలకు రానిచ్చింది ఆ మనిషి. ఈయన విసనకర్రతో విసురుతుంటే కాలు మీద కాలు వేసుకు కూర్చుంది. రాజ్యాన్నీ కాముడినీ తీసుకెళ్ళి ఆ మనిషికీ కూతురికీ దణ్ణాలు పెట్టించారు.

"నువ్వేం బాధపడకురా గణపతీ! యిలా రారా" అంది. నాన్నగారు వెళ్ళారు. చేతులు జోడించి దణ్ణం పెడితే కాలిని నెత్తి మీద పెట్టింది. నాన్నగారి అన్నదమ్ముల వివరాలూ కుటుంబ విశేషాలూ అడిగింది.

"నీ కూతురు నా బిడ్డరా! నా అమ్మరా! దాన్ని నేను చూసుకుంటాను! నీ పెళ్ళాం నన్ను మైలజేసింది! నాకు నేను శుద్ధి చేసుకోవాలి" అంది.

"అలాగే స్వామీ!" నా కూతుర్ని నీ చేతుల్లో పెడుతున్నాను. నువ్వే వాళ్ళని కాపాడాలి" అన్నారు. మరునటి రోజునుంచి శుద్ధి కార్యం చేయించింది. ఆరెండు రోజులూ నాన్నగారు అక్కడే ఆశ్రమంలో ఉన్నారు.

ఆ రెండు రోజులూ నాకేమయిందో నాకు తెలియదు. నాన్నగారి నెత్తిన తన్నిందని బాధేసిందో, పిల్లలు ఆ గుంటముండని పూజలు చేస్తే అది వాళ్ళని కొడితే వాళ్ళూదాన్ని కొడితే కన్నతండ్రే చావబాదేసారని బాధేసిందో, నా పిల్లల చెవులవి దాని పిల్లల చెవులకు వేలాడుతూంటే చూడలేకపోయానో! మనసంతా దొలిచేసింది.

మరునటిరోజు పొద్దుట నాన్నగారి ప్రయాణం. ఆశ్రమంలో బయట చాపల మీద పడుకునున్నారు. నేను లేపాను, "ఏంటమ్మా" అన్నారు.





కళ్ళనీళ్ళు పెట్టుకున్నాను.

"ఏం భయపడకమ్మా! ఆ స్వామిని నమ్ముకో! నీ మొగుడిని నమ్ముకో! ఆ స్వామికి నేనంటే వల్లమాలిన అభిమానం. నీ మొగుడిని ఉద్యోగానికి పంపమని అడిగాను. రాజమండ్రిలో కాపురం పెట్టించమని అడిగాను. అలాగే అంది. నీకేం భయం లేదు. మాకేంటి? అన్నీ అయిపోయినవాళ్ళం. మాగురించి బెంగవద్దు' అన్నారు.

ఆయనని రాజుగారనేవారంతా! మేం రాజకుమార్తెలమనుకునేవాళ్ళం! ఆ మర్నాడు ఆయన ఎంతో బరువు మోస్తున్నట్లు మెల్లగా నడుచుకుంటూ వెళ్ళిపోతుంటే నేను చూస్తూ నించున్నాను.

మళ్ళీ ఏడాది దాటేదాకా ఆయనని చూడనని నాకు ఆరోజు తెలీదు. ఎప్పుడు తలుచుకున్నా ఆ రూపమే గుర్తొస్తూంటుంది.

★ ★ ★

నాకు ఆ మనిషిమీద ఆ రెండు రోజుల్లోనూ పుట్టినదేదో ఎన్నాళ్ళో నిలవలేదనుకుంటాను. మేమిద్దరం నెల్లిపాలెంలోనే ఉన్నాం! ఆ మనిషిని రోజా సేవించుకున్నాం! నా పిల్లల చేత ఆ మనిషి పిల్లల కాళ్ళు కడిగించాం! అంతా కలిసి భజనలు చేశాం! పది రోజుల్లో ఈయన చేత చేయిస్తున్నవ్రతమేదో పూర్తయింది. ఉద్యోగానికి పంపింది. దాంతో మరీ గురి పెరిగింది. నేను పాలెంలోనే ఉన్నాను. ఈయన వారానికో మారు వచ్చేవారు. జీతం ఆ మనిషి పాదాల ముందుంచే వారు. మరి ప్రయాణాలు ఎలా చేశారో ఎలా తిన్నారో ఎక్కడున్నారో నాకు తెలిసేదికాదు. నేను అడిగితే చెప్పేవారేమో! మరి ఆ మనిషి యిచ్చేదేమో.

మా అత్తారింట్లో నానాగొడవగానూ ఉండేది. మామగారు ఆశ్రమానికి ఎక్కువ వచ్చేవారుకారు. అత్తగారూ మరుదులూ ప్రతిరోజా వచ్చేవారు. పగలూ రాత్రి అక్కడే. మామగారికి ఓ వక్క కరిణీకం మరోపక్క వ్యవసాయమూనూ! మునుపు పిల్లల్ని పొలం మీదకి పంపేవారు. యిప్పుడు వాళ్ళు వెళ్ళరు. ఆయనకి తిడదామన్నా భయంగాబోలు, వాళ్ళని ఏం అనేవారుగారు. అందుకని ఆయనే పోయేవారు. పొరపాటున విసుక్కుంటే అత్తగారు మీదపడిపోయేవారు. ఆవిడకి ప్రతిరోజా స్వామి కావాలి. ఆ మనిషి శవంగా ఉన్నానసరే వెళ్ళాల్సిందే.

ఆవిడంటే ఆ మనిషికి చాలా పట్టు. ఒక్కోసారి టీ యిచ్చేది. అది తాగేసి పాటలు మొదలెట్టేవారు. ఎంత దీనంగాపాడేవారో చెప్పలేను. ఆవిడకి ఆ మనిషంటే మరీనూ! యింట్లోవున్న పప్పులూ ఉప్పులూ బియ్యం సమస్తం నడిపేసేవారు. చివరకి మా పిల్లల బట్టలు నా పెళ్ళి చీరెల్లూ మామగారి బట్టలూ ఆవిడ నగలూ పూర్వోత్తరం పెట్టెలూ అన్నీ ఆ యింటికి తరలించేశారు. యింతకు ముందూ పెత్తనం ఆవిడదే! పైకి తెలిసేదికాదు. యిప్పుడు ఆవిడగొంతు పెరిగిపోయింది. అన్నింటికీ కోపమే! మేమంతాసరే మామగారు కూడా భయపడేవారు ఆవిడంటే.

స్వామివారికి చెప్పేస్తానని బెదిరించేవారు. ఓ మారయితే రాజ్యాన్ని ఏం చేశారనీ. ఆ రోజు నేను ఆశ్రమంలో ఉన్నాను. ఆ మనిషికి పవ్వళింపుసేవ. భక్తురాళ్ళంతా కలిసి ఒళ్ళంతా నలుగుపెట్టి తలంటేవాళ్ళం! మగరాయుళ్ళా ఒళ్ళు నలుగుపెట్టించుకునేది. గోళ్ళు తీయించుకుని కాళ్ళు రాయించుకునేది. ఓమారు బూడిద ఓమారు వసువూరాయమనేది. ఉయ్యాలమంచంలో పడుకోబెట్టేవాళ్ళం. ఊపుతూంటే మైకులోంచి పాటలు. భక్తులు చూసి పరవశంతో కానుకలు వేసేవారు. ఆ సేవ చూసినవాళ్ళకి చేసినవాళ్ళకి పిల్లలు పుడతారనేవారు. కొంతమంది నీళ్ళోసుకున్నామని వచ్చి చెప్పేవారు. నేను ఆ సేవలో ఉండగా మా రాజ్యం దాని కూతురిని తీసుకుని పొలానికి వెళ్ళిందిట.

పిల్లలుగదా ఏం గొడవాడుకున్నారో దాన్ని రాజ్యం తోసేసింది. అది ఏడుస్తూ వెళ్ళి అత్తగారితో చెప్పింది. ఆవిడ ఎప్పుడూ పవ్వళింపు సేవకి వచ్చేది గాదు. రాజ్యం యింటికి రాగానే అట్లకాడ కాల్చి వాతలుపెట్టింది.

అవిచూసి పిచ్చెక్కిపోయాను. అంతలా వాతలుపెట్టి అయ్యో! అనుకోలేదు, ఆవిడ. నేను పరుగెత్తుకువెళ్ళి స్వామికి చెప్పాను. రాజ్యాన్ని చూపించాను. అత్తగార్ని పిలిపించి

బండబూతులు తిట్టింది, "నీ కోడల్ని ఏమన్నా అన్నా మనవల్నేమైనా చేసినా నిన్ను బూడిద చేస్తానే దెయ్యమా!" అంది.

దాంతో నాకు మరీ భక్తి పెరిగిపోయింది.

ఈయన వచ్చాక నన్ను తిట్టారు, "పిల్లలకి భయం నేర్పొద్దూ, అమ్మ వాతలుపెడితే-మళ్ళీ జన్మలో దేవుడిని తిట్టదు" అన్నారు. అలా తిట్టారని ఆ మనిషికి చెప్పాను. ఈయన తలమీద మొట్టి "వెర్రిమొహంవాడా! నీకంటే ఈశ్వరుడి భక్తి, జన్మజన్మలనుంచివుంది. యిది ఎంత మొండిదో నీకు తెలుసు. దాన్ని పట్టు తప్పనీకూడదు" అంది.

నా పిల్లలకి పాడు మాటలన్నీ వచ్చేశాయి. కొట్టుకోడం పెరిగింది. భరించలేక చచ్చేట్టు కొట్టేసేదాన్ని. ఆ మనిషి కూతురుకి ఏదో బాధ నుకుంటాను, అస్తమానం ఏడిచేది. అలా ఏడుస్తుంటే కుమారస్వామిలా ఏడుస్తున్నాడు, అనేవారు. నిద్రోతే సమాధి అనేవారు. దానికి చాడీలు అలవాటు! నేను రాజ్యాన్నీ కాముడినీ బాదేదాన్ని. దాన్ని గంగ అనమని తినేసేవారు మా వాళ్ళు.

మా యింట్లో రెండు ఆవులూ, గేదె ఉండేవి. ఒకటి చూడిది. రెండోది సోలడంటే సోలడు పాలు యిచ్చేది. గేదె మాత్రం బాగా యిచ్చేది. అందరికీ పాలూ పెరుగూ ఎక్కి తక్కిగా ఉండేవి. ఆ గేదెను ఆ మనిషి రెండో కూతురి పాలకు తీసుకెళ్ళి ఆ వాకిట్లో కట్టేశారు ఈయన. శంకరానికి నా పాలు సరిపోయినా అలవాటయిన పిల్లలు వదిలేవారుగారు. వాడికలుపెట్టారు అత్తగారు. డబ్బులు యివ్వకపోతే వాళ్ళు పొయ్యడం మానేశారు. మామగారికి సర్ది కాఫీయిచ్చి అంతా డికాక్షన్ తాగేవాళ్ళం. నా పెళ్ళికి కట్నం డబ్బుల్తో యింటికి కరెంటు వేయించారు. దీనికి బిల్లులు కట్టకపోయేసరికి **ఫ్యూజులు** పీకేశారు. మడత మంచాలకు గుడ్డలు చిరిగిపోయాయి. పట్టెళ్ళు నలిగిపోయాయి. కిందపడుకున్నాం! చాపలు కూడా చాలేవికావు. పిల్లల్ని గుడ్డ పరిచి దాని మీద పడుకోబెట్టే వాళ్ళం.

ఇవన్నీ వెళ్ళి ఓరోజు మామగారు ఆ మనిషితో చెప్పుకున్నారు. నేను వెంకన్నతో మాట్లాడాలి. తిరపతి మొత్తం అందరూ పదమంది. మామగారు రాయప్పారావుకి యిల్లు తాకట్టుపెట్టారు. ఆ మనిషీ పార్వతీ పిల్లల్నీ తీసుకుని అంతా తిరపతి వెళ్ళాం. 'దర్శనాలు ఎంత బాగా అయ్యాయో! అంతా స్వామి పట్టు!' అనేవారు అత్తగారు. ఎప్పుడూ గుమ్మం విడవని మనిషి మా తోటికోడలు. తునిలో రైలు ఎక్కుతూంటే ఆవిడగాభరా చూడాలి. కొండ మీద బావగారు తప్పిపోయారు. పాపం అత్తగారు గోల! పార్వతీ ఈయనా వెతికి తీసుకొచ్చారు, 'నన్ను నమ్ముకుంటే ఏమీ అవదే, చూశావా' అంది ఆ మనిషి. మా భాస్కరానికి వాళ్ళ పెద్దన్నయ్యంటే చాలా అపేక్ష. బెంగెట్టేసుకున్నాడు ఆ రోజు. అన్నయ్య దొరక్కపోతే యీ స్వామిని ఏం చేస్తానో, అన్నాడు నాతో! ఆ మాట చెప్పొద్దని బతిమాలాడు.

తిరపతియాత్ర అయి వచ్చాక పదిపదిహేను రోజులకి భాస్కరానికి పెళ్ళి సంబంధంవచ్చింది. ఒక్కత్తే కూతురు ములగపూడి. ఏడుగురు అన్నదమ్ములు. యిల్లూ వాకిలీ భూమీ కరిణీకం అన్నీ ఉన్నాయనుకున్నారు వాళ్ళు.

వాళ్ళలా వెళ్ళగానే మామగారొచ్చి ఆ మనిషి కాళ్ళమీద పడ్డారు. నేనక్కడే అరుగులు మెత్తుతున్నాను. పార్వతి కొన్న కొత్త బజాజ్ బండిని ఈయన కడుగుతున్నారు. రాజాలాంటి సంబంధం అన్నారు మామగారు.

'చెప్పలేదా! స్వామి స్వయంగా వెంకటేశ్వరుడితో రోజూ మాట్లాడుతున్నారు. చూసారా ఎలా నిదర్శనమిచ్చిందో! వారం తిరక్కుండా సంబంధం!' అన్నారు ఈయన.

'పెళ్ళివాళ్ళని మీదగ్గరకు తీసుకొస్తాను స్వామీ!' అన్నారు మామగారు. వద్దంది. కట్నం, కానుకలు ఏం చెయ్యమంటారని అడిగారు. 'యిరవైదాకా యిస్తారు. తీసుకో' అంది. అలాగే అయిందిట! యిరవై రెండన్నారు వాళ్ళు. సరేనన్నారు మామగారు. వాళ్ళు మాటలకొచ్చేసరికి పోలునించి తీగలు లాగి దీపాలు వెలిగించారు. డబ్బులు చేతిలో పడగానే ముందుగా కరంటు బిల్లులు కట్టారు.

ముహూర్తం పెట్టారు.

మామగారు యింటిల్లిపాదికీ బట్టలు కొన్నా





రు ఆ మనిషికీ, పార్వతికీ, పిల్లలకీ కూడా కొన్నారు. మావాళ్ళకి శుభలేఖయినా వెయ్యలేదు. ఈయనే వద్దన్నారుట. "నీ మొగుడికి మహా పట్టుదల మానాన్నగారి పోలిక! మరిచిపోడు" అన్నారు మామగారు నాతో!

ఈయనతో ఎందుకు పిలవకపోవాలని గొడవపెట్టుకున్నాను. "నీ అమ్మకీ నాన్నకీ మర్యాద లేదు. మీకు నీతీ జాతీ లేదు. స్వామివారు చెప్పారని ఏలుకుంటున్నానుగానీ..." అంటూ మొదలెట్టారు.

వాళ్ళేం అపరాధం చేసారు - నన్ను కనడమూ - మీ కాళ్ళు కడగడమూనా? అన్నాను 'తెలియనివాళ్ళకి చెప్పొచ్చు' అన్నారు.

నాకు చాలా బాధ కలిగింది. నిజమే! నాన్నగారెళ్ళాక ఉత్తరాలు లేవు. మొదట్లో నేను మూడో నాలుగో వ్రాసాను. అవి మా సూర్యానికిచ్చి పోస్టు చేయమన్నాను. తర్వాత మావాళ్ళ ఉత్తరాలేవీ నాకు అందలేదని తెలిసింది. పండగకి పిలవటానికి రాకపోయినా రమ్మని రాసారట. అదీ అందలేదు. మా సూర్యమే ఏదో చేసుండాలని నా అనుమానం.

పెళ్ళయిపోయింది మా వాళ్ళ కరిణీకాలు పోయాయి.

బంగారబ్బొమ్మ లాగుంది మా తోటికోడలు. కాపురానికొచ్చిన రెండోరోజున తీసుకెళ్ళారు. విశ్వరూపమెత్తేసింది ఆ మనిషి. కొత్త మనుషులొస్తే అదేం జబ్బో మరీ ఛండాలంగా మాట్లాడేది. నీవల్లే నీ మొగుడుకీ నీ మామకీ ఉద్యోగాలు పోయాయి. నేనున్నాను గనకే వాళ్ళకింకా తిండిపుడుతోంది" అంది. భయపడిపోయిందా అమ్మాయి. నేను ఆ రాత్రి దగ్గరపడుకోబెట్టుకున్నాను 'దేముడలాగే కోప్పడతాడు తప్పులేదు. భయపడకు' అన్నాను. ఆ అమ్మాయి ఆమనిషి దగ్గరకి తనంత తాను వచ్చేది కాదు. పవ్వళింపుసేవకి బలవంతాన పంపేది మా అత్తగారు.

కట్నమంతా వెర్రిపీనుగుల్లా ఖర్చుచేసేశారు. యింటిమీద కొంత బాకీ తీర్చేశారన్నారు. కరిణీకాలు పోయిన కొత్తలో చాలా కంగారయిపోయారు. ఆ తర్వాత మా పరిస్థితి కొంత మెరుగయింది 'పంట బాగుంది ధరపలికింది' అన్నారు. 'స్వామి ప్రభావం' అన్నారీయన. ఒప్పేసుకున్నారు మామగారు.

ఇంట్లో తలకోగోలానూ! సినిమాహాల్లో టిక్కట్లమ్మే వాడు సూర్యం. వాడికి చిల్లరలో మిగిల్తే స్వామి యిచ్చిందనే వాడు. పేకాటలో స్వామి దయజూసిందీరోజు అనేవాడు భాస్కరం. మామగారు తప్పించి అంతా స్వామి స్వామి అనేవారు.

నాకు రకరకాల బాధలు! ముఖ్యంగా పిల్లలు. రాజమండ్రిలో ఉంటే యీపాటికి కాన్వెంటుకెళ్ళేవారుగదా అనిపించేది. ఒకటి రెండుసార్లు స్వామి ఒళ్ళు పడుతూ కాళ్ళు పడుతూ రాజమండ్రి పంపించమన్నాను. అలాగేననేది. ఈయన నా మొహం చూసేవారుగాదు. తిట్టిపోస్తుండేవారు. అస్తమానూ ఊళ్ళో ఉంటే ఆశ్రమంలోనే ఉండేవారు. తిండికయినా యింటికొచ్చేవారు కారు. ఉద్యోగం మానేసి మీ సేవలో ఉండిపోతానని ఆ మనిషితో అనేవారు. టైం వస్తుంది అనేది. ఉద్యోగం చేసి నాకు ఒరగబెట్టేదేం లేదుగాని మానేస్తారేమోనని ఓ బెంగ. ఇంటికి అమర్చుకున్నవన్నీ హరించుకుపోయాయి. ఇవన్నీ అలా ఉండగా అమ్మా నాన్నగారూ అన్నయ్యలూ అక్కయ్యలూ ఎవరూ నాకంటపడలేదు. వాళ్ళకి గీరలని, తలబిరుసనో మా అత్తగారు కొత్త వియ్యాలవారితో చెపుతూంటే చాలా బాధగా ఉండేది. ఏబాధయినా ఆ మనిషితో చెప్పుకునేదాన్ని కొత్తలో. ఆ మనిషి ఒక్కోసారి ఒక్కోలా మాట్లాడేది. ఓ మారు నన్ను తిడితే యింకోసారి ఈయన్నీ వాళ్ళనీ తిట్టేది. క్రమంగా చెప్పటం మానేశాను. రాత్రింబవళ్ళు చాకిరీ చాకిరీ! ఆ మనిషి ఇంట్లో అరుగులు మెత్తి అంట్లుతోమి వండమన్నవి వండి పనిమనిషిలా చేసేదాన్ని! ఇంటికొస్తే మా అత్తగారు అరక్షణం కూచోనిచ్చేవారుకాదు. పిల్లల్ని పట్టించుకోవాలని ఉండేది. అక్షరం ముక్కలు చెప్పుకోవాలని ఉండేది. ఏరాత్రివేళో కూచోబెట్టాలని ఉండేది. వాళ్ళు లొంగేవారు కాదు. నాకూ కళ్ళు కూరుకుపోయేవి.

ఈయనతో చెప్పుకోటానికిలేదు. ఆ మనిషితో లేదు. పిచ్చెత్తినట్టుండేది. ఆ పిచ్చిలో ఏం చేసేదాన్నో! ఏమయేదాన్నో!

మా చిన్నబావగారు ఓరోజు దిగారు.

★ ★ ★

ఆయన్ని చూసి నాకెంత ఆనందమయిందో చెప్పలేను. అయితే ఎలా మాట్లాడటం! పద కొండయింది అప్పుడు. నేను యింటిదగ్గరే ఉన్నాను. మా అత్తగారు మంచినీళ్ళు యిచ్చి యోగక్షేమాలు అడుగుతున్నారు. నేను కాఫీకా స్తున్నాను.

'వచ్చిన మనిషి ఎంతసేపుంటాడూ - వెళ్ళి పలకరించు. ఆవిడకేంలే... అలా మాటాడు తూనే వుంటారు అంటోంది మా తోటికోడలు. నాకు బిడియంగా వుంది. మాయింటికి పెద్ద క్క, బావగారు పెళ్ళి టైంలో వచ్చారు అంతే!

కాఫీ పట్టుకెళ్ళాను. మా అత్తగారు చాలా ఆనందంగా ఉన్నారు 'మీ బావకియ్యేవే శాంతా! అన్నారు. యిచ్చివస్తున్నాను.

'బావున్నావా అమ్మా!'

"ఊఁ" అన్నాను.

"మీ బావకి స్వామి దర్శనం చేసుకోవాల నుందిట. నువ్వేన్ని చెప్పు! చదువుకున్నవాళ్ళు చదువుకున్నవాళ్ళే! భయం, భక్తి అన్నీ ఉంటాయి! ఏం బాబూ! ఉండిపో యీ పూట కి! పిల్లలు వస్తారు! ఆశ్రమానికి తీసుకెళతా రు" అంది.

'లేదమ్మా' వెంటనే వెళ్ళాలి! మిమ్మల్ని స్వామివార్నీ చూద్దామని వచ్చాను'

అప్పుడు మా అత్తగారు నన్ను తీసుకువెళ్ళ మన్నారు. మా రాజ్యం వెంటబడింది. ఆదిలో బండిమీదే వెళ్ళేవాళ్లం. యిప్పుడు మా అత్త గారూ, నేనూ నడిచేపోతున్నాం. ఆ రోజు చిన్న బావగారూ రాజ్యం నేనూ నడుస్తున్నాం. నాకు మాటతోచటంలేదు. ఆయనకీ అలా ఉందేమో. వీధిమలుపు తిరిగేసరికి రాయప్పా రావు కనిపించాడు.

'ఎవరండమ్మాయిగారూ' అని పలకరించా డు. చెప్పాను. నించోబెట్టి వివరాలన్నీ అడిగా డు. ఆయన చెప్పారు. 'ఎల్లుండి బాబూ! ఎల్లుండి! ఎంతో పుణ్యాం చేసుకుంది మావూరు! దేవుడు మా వూళ్ళో కొచ్చాడు! సినిమావాళ్ళు కూడా వస్తారుట! పాములమల్లారంకి రాలేదూ అలాగే! అంటూ ఏంటేటో మాట్లాడాడు. అతను వెళ్లాక బావగారు ఎవరీయన అన్నారు. చెప్పా ను.

"నువ్వు బాగా పాడయిపోయావు"

"ఏం పాడవలేదు"

"మీ అమ్మగారు నీ గురించి బెంగెట్టుకున్నా రు"

నేను మాట్లాడలేదు.

"కనీసం ఉత్తరమయినా రాయొచ్చుగదా?"

"రాసిందానికి వాళ్ళు జవాబివ్వనపుడు నేనేం చేయను"

ఆయన అదోలా చూసి "నిజంగా రాసావా నువ్వు?"

'నేను అబద్ధాలాడను' అన్నాను. ఒకరి ఉత్త రాలు ఒకరికి అందలేదన్నమాట అన్నారు. నాలుగుసార్లు అన్నాక నాకూ నమ్మకం కలి గింది. అమ్మానాన్నగార్ని చూడాలనుంటోంది. కాని ఎలా కుదురుతుంది? వాళ్ళు రారు. వీళ్ళు పంపరు. ఈయన మాట్లాడరు. అదే అన్నాను.

'నాతో వచ్చెయ్! తీసుకెళ్తాను" అన్నారు.

"వాళ్ళు పంపొద్దూ-?"

"నేను అడుగుతాను. పంపితే సరే! లేదంటే నాతో వచ్చెయ్" అన్నారు. 'నేను రాను' అన్నాను. అన్నానేగాని వెళ్ళిపోవాలనే ఉంది. ఎగ్గిరిపోవాలనే ఉంది. అమ్మ ఒడిలో పడుకోవాలనే ఉంది. అక్కలతో దెబ్బలాటలా డాలని ఉంది. పరీక్షలు రాయాలని ఉంది. చదువుకోవాలని ఉంది., బతకాలని ఉంది.

అక్కడకు చేరుకున్నాం. ఈయనా భాస్కర మూ పుల్లలు కొడుతున్నారు. మర్నాడు ఎవరో సంతర్పణ చేస్తారు. ఆ పనిలో తిరుగుతున్నా డు భాస్కరం. ఈయన ఆ రోజు ఉదయమే రాజమండ్రినుంచి లారీలో వచ్చారు. ఈయన చినబావగార్ని చూసి మాట్లాడలేదు. చినబావ గారే వెళ్ళి పలకరించారు 'బావున్నారా?' అని.

"మీరెందుకొచ్చారూ?" అన్నారీయన.

"స్వామివారి దర్శనం కోసం"

అప్పుడు చూడాలి, ఈయన మొహం





అంతయిపోయింది. 'నేను చెప్పలేదూ. స్వామి వారి పట్టు! ఎప్పుడూ దేవుడూ దెయ్యమూ లేదనే అన్నయ్యగారికే యిలా బుద్ధివచ్చిందంటే' అంటున్నారు నాతో! నాకు ఆశ్చర్యంగానే ఉంది. 'గుడికే వెళ్ళడు. మా చిన్నక్క శ్రావణమాసం నోములయినా నోచదు. పిల్లలకి బారసాలలయినా చెయ్యలేదు. అలాంటి మనిషి??' అప్పటివరకూ నాకు ఆ విషయమే తట్టలేదు. మమ్మల్ని చూట్టానికి అమ్మ పంపిందేమో- అనుకున్నాను. అప్పుడప్పుడే నాకు అనుమానాలొస్తున్నాయి ఆ మనిషి గురించి. చినబావగారు కూడా ఆ మనిషిలో ఏదయినా ఉందనుకున్నారంటే' యింక ఏ అనుమానమూ అవసరం లేదు. ఆ మనిషిని సేవించుకుని ముక్తి సంపాదించుకోవటమే! చూద్దాం ఏమంటారో అనుకుంటున్నాను.

ఈయన ముందుగా వెళ్ళారు. ఓ పదినిమిషాల తర్వాత మమ్మల్ని లోపలికి రమ్మంది. ఆ క్షణంలో ఆ మనిషి ఆడిన వీరంగాన్ని మరిచిపోలేను.

''ఒరి దేవుడు లేడనే నాస్తికప్పీనుగా! నువ్వు నా రహస్యాన్ని తెలుసుకోడానికి వస్తావురా నేను లేనంటావ్రా! నీ రహస్యం నాకు తెలీదట్రా! నీ మరదలిని తీసుకుపోటానికి వచ్చావురా నువ్వు! మీ యిద్దరికీ ఉన్నది నాకు దాచగలవురా! నీ కొంపంతా కంపే- నీ అత్తా నీ అమ్మా అంతా తొత్తులే- నీ మరదలికి రోగమొస్తే మానపాలా? దానికి ఏడుపొస్తే తీర్చాలా? జన్మజన్మలనుంచీ ఈళ్ళ కాపురాన్ని యిడదియ్యటానికి పుట్టిన నా కొడకా! యిప్పుడాపని చెయ్యటానికి వచ్చావా'' ఆ తిట్లు భూమ్మీద ఎవరూ మాట్లాడలేరు. నేను ఎలా రాయగలను? నాకే ఒళ్ళు ఉడికిపోతోంది. యీ దేవుడే లేడనే పెద్దమనిషి ఏం చేస్తున్నాడు? లేవడేం? దాని పీక పట్టుకు పిసకడేం? మా పిచ్చి బావగారిపాటి చెయ్యడా? చేస్తాడు- అటోయిటో తేలిపోతుంది. అనుకుంటున్నాను. ఆయనలా కూర్చునే ఉన్నాడు. ఆ మనిషి తిడుతూనే ఉంది. అరగంటసేపు తిట్టింది.

అలుపు తీర్చుకోటానికి గాబోలు ఆగి మంచినీళ్ళు తెమ్మంది. చిన్నబావగారూ మంచినీళ్ళు కావాలన్నారు.

'నీకు మంచినీళ్ళిస్తే అందులో ఏదో కలిపాననుకుంటావురా' అంది. అతనిమీద నాకు జాలేసింది. ఆ మనిషి నీళ్ళు తాగింది.

చిన్నబావగారు లేచి వెళ్ళి మోకాళ్ళమీద వంగి మంచంమీద కూర్చున్న ఆ మనిషి కాళ్ళు పట్టుకుని నెత్తిన పెట్టుకున్నారు.

నాకాళ్ళకింద భూమి కదిలిపోతున్నట్లయింది. తేలిపోయింది. ఆయనే పాదాలు నెత్తిన పెట్టుకున్నారంటే అనుమానం లేదు! సందేహంలేదు. ఆ మనిషి దేవుడే! అన్నీ తెలుసు. నా మనసు కుళ్ళు మనను. ప్రతీజన్మలోనూ ఈయన్ని భక్తినుంచి దూరం చేస్తున్నాను. రాజమండ్రి కాపురం కావాలని అడుగుతున్నాను. పోనీ! ఉద్యోగం పోనీ! పిల్లలుపోనీ! ఈయనకి ముక్తి వస్తే చాలు! ఈయన తపస్సు ఫలించితే చాలు! పిచ్చిపిచ్చిగా అనుకుంటున్నాను.

చిన్నబావగారు - 'తల్లీ! నువ్వే వీళ్ళ కాపురాన్ని నిలబెట్టాలి. అంతా నీ చేతిలో ఉంది' అన్నారు. నాకు కళ్ళు తిరుగుతున్నాయి. పడిపోయాను. మెలకువ వచ్చేసరికి భాస్కరమ్మా, ఈయనా నా పక్కన చేరి స్వామి జపంచేస్తున్నారు. నేను లేస్తూనే వెళ్ళి స్వామి పాదాలు పట్టుకున్నాను.

'నేనున్నాను నిన్నెక్కడికీ పోనివ్వను' అంది.



చిన్నబావగారు అటునుంచటే బస్సెక్కేసేరుట. ఇదంతా చదివి ఏమనుకుంటారో! కోప్పడతారో! బాధపడతారో! ఎవరినీ బాధపెట్టాలని

రాయటంలేదు. నా బాధ చెప్పుకోవాలనే రాస్తు న్నాను. ఏడాదిపాటు కుక్కలా కాపలాకాసి గాడిద చాకిరీ చేసాను. ఎంత మతిలేని దాన్న యినా ఆ మనిషి అంటున్నదేంటో తెలీకపో యినా ఏం చేస్తోందో చూట్టంలేదా? చాతన యితే నన్ను అందులోంచి లాగాలి. లేదా వదిలెయ్యాలి. తరవాత ఆయన ఏదో చెప్పినా, నా మనసులోంచి ఇప్పటికీ ఒక్క అనుమానం పోదు. ఆయన నా నమ్మకాన్ని ఆరోజు పెంచ టంవల్లనే ఆ మనిషి ప్రళయం గురించి చెపితే నమ్మేసానేమో!

ఓ రాత్రివేళ మాకుటుంబమంతటినీ కూర్చోబెట్టింది. హఠాత్తుగా కళ్ళు మూసుకొంది. చెప్పటం మొదలెట్టింది.

భూమికి అయిదేళ్ళలో ప్రళయం వచ్చే స్తుందిట. కొండలు ఎగురుతాయిట. సముద్రా లు నడిచి భూమిమీదకు వచ్చేస్తాయిట. నీటిలో నిప్పులు తేలతాయట.

"ఏం చెయ్యాలి స్వామీ? ఏం చెయ్యాలి?" మా అత్తగారు ఆ మనిషి కాళ్ళు వదల్లేదు.

-"మీరేం చెయ్యలేరు. మీరంతా పాపాత్ము లు. చెట్టుకొకరూ పుట్టకొక్కరూ అయి చెదిరిపో తారు. తగలబడిపోతారు. మీ వంట్లో మాంస మంతా కాలిపోతుంది. మిమ్మల్ని కాకులు పొడుచుకు తింటాయి! కుక్కలూ నక్కలూ పీక్కుతింటాయి. మీరు చూస్తూనే ఉంటారు. తెలుస్తూనే ఉంటుంది. మీరెప్పుడయినా ప్ర ళయం చూసారా?

"లేదు స్వామీ!" అన్నారు మామగారు.

"నేను కొన్ని కోట్ల ప్రళయాలు చూసాను. చక్రంలా ఉన్న భూమిని చాపలా వత్తాను నేను. చాపలా ఉన్న భూమిని మైదాముద్దలా పిసికేసి ఉండచుట్టాను! ఆకాశంలోంచి సము ద్రాలను తెచ్చి ఆ ఉండలో కలిపి అలిపిండి నీళ్ళు పుట్టించాను. మనుషుల్ని ఆ ఉండలో పెట్టి నొక్కేసాను! ఆ నీటిలో పెట్టి తొక్కేసాను! నిప్పులో పెట్టి వేయించాను! వాళ్ళ అరుపులూ కేకలూ విని ప్రళయతాండవం చేశాను.

ఆ మనిషి చెపుతూంటే వినాలి. నేనింకా సరిగా చెప్పలేకపోతున్నాను. ఆ మనిషికి అన్ని సంగతులు ఎలా తెలుసో నాకు యిప్పటికీ తెలీదు. మేమంతా ఆ సమయంలో వణికిపో యాం!

"నేనప్పుడు తలుచుకుంటే దేన్నయినా చే యగలను. యీ భూమినంతటినీ చెట్టుగా చెయ్యగలను. ఆవుగా చెయ్యగలను. పందిగా చెయ్యగలను. ఆకాశంగా చెయ్యగలను. నమ్ము కున్న వాళ్ళని రక్షించగలను. అందరినీ తినె య్యగలను. హ్హహ్హ" అంటూ నవ్వుతూంటే మా నాలికలు పిడచగట్టుకపోయాయి. పార్వతి. అన్నాడు "వాళ్ళని రక్షించు స్వామీ"

చటుక్కున కళ్ళు విప్పి "ఏంటయింది?" అంది.

"మరో అయిదేళ్ల తర్వాత ప్రళయం గు రించి చెప్పేసారు" అన్నాడు పార్వతి.

'ఎంతపనయిందీ! ఆ దేవరహస్యం చెప్పే సానా? వీళ్ళు తప్ప ఎవరూ లేరా?" పార్వతి బయటకెళ్ళివచ్చి లేరన్నాడు.

"మీరు భక్తవత్సలులు! ఆర్తత్రాణపరాయ ణులు! వీళ్ళని రక్షించాలనే చెప్పారు" అన్నా డు పార్వతి.

"అవును స్వామీ! మీరు రక్షించాలి మమ్మ ల్ని

"నేను చెప్పినట్టు చెయ్యాలి. ఇది మూడో కంటివాడికి తెలీకూడదు. చెయ్యలేదా మీ ఇంట్లో అంతా ఆహుతయిపోతారు" అంది.

సరేనన్నాం... అంతా భగవత్కైంకర్యం చె య్యమంది. మేం ఏమిస్తే అదంతా మిగు ల్తుందిట ప్రళయం తర్వాత! భూమిని యిచ్చే య్యమంది. యింటిని రాసిచ్చెయ్యమంది. ఆ ఇల్లు ప్రళయంలో తెప్పలా తేలుతుందిట. అందులో మేం ఉండవచ్చుట. తనకి తెలీ కుండా ఏం దాచుకున్నా అది తెప్పకు చిల్లుపె డుతుందిట. ప్రళయం తర్వాత మాకు కావల్సి నవన్నీ యిప్పుడే అర్పించుకోమంది.

మా పిచ్చిబావగారిని రక్షించనంది. నాకు మొగుడు కావాలని ఏడిచింది మా తోటికోడ లు. మా అత్తగారూ ఏడిచింది. నా నలుగురు కొడుకులూ కావాలని. ఆఖరుకి సరేనంది ఆ మనిషి.

అలా ఒప్పుకొనేసరికి నేనూ కాళ్ళమీద పడ్డా

ను ''మా అమ్మా, నాన్నా, అన్నయ్యలూ, అక్కయ్యలూ కావాలి నాకు! వాళ్ళనీ రక్షించు'' అన్నాను. నన్ను బండబూతులు తిట్టింది. యింకా ఎవరు కావాలే నీకూ- అంది. ఈయనకి జాలేసింది. మా వాళ్ళని రక్షించమన్నారు. పార్వతీ అన్నాడు. మా అత్తగారు ఒప్పుకోలేదు.

''వాళ్ళని రక్షించటానికి వీల్లేదు. నా కొడుకూ అత్తారిలో కలిసిపోయాడు మమ్మల్ని వాళ్ళు తిట్టారు. ఏ ఆడపిల్ల తల్లిదండ్రులయినా ఎంత అగ్గగ్గలాడిపోతారూ! వీల్లేదు! మాతోబాటు ప్రళయం తర్వాత వాళ్ళుండటానికి వీల్లేదు'' అన్నారు.

అప్పుడా మనిషి తాండవ మాడేసింది. మా అత్తగారిని చేత్తో గుద్దింది. మామగారిని కాలితో తన్నింది. 'ప్రళయం తర్వాత కూడా మీరు దెబ్బలాడుకోవాలా? వాళ్ళు మీరంటే ఎంత భక్తిగా ఉంటారూ' అంది. నిజమే నన్నారు మామగారు. అయినా నాకాళ్ళు పట్టుకోవాలి గదర్రా వాళ్ళూ, దీన్ని చూస్తే నాకు జాలి. ప్రళయం తర్వాత దానివాళ్ళు లేకుండా ఎలా బతకగలదు? అంది. మామగారు అత్తగారూ సరేనన్నారు. మా వెర్రి తోటికోడలు అందీ, 'నాకు పుట్టిల్లు ఎలాగూ లేదు. వాళ్ళుంటే పండగకి తీసుకెళ్తారు' అప్పుడా మనిషి అంది, ''మొండిదానా! నీ మొండితనం మీవాళ్ళ ముందు ఏమాత్రమో చూస్తాను. నువ్వెళ్ళి మీ వాళ్ళని ఒప్పించు. వాళ్ళకి ప్రళయం తర్వాత ఏంగావాలో కనుక్కో! అవన్నీ అర్పించమను'' నేను ఆ మనిషి కాళ్ళు పట్టుకుని దణ్ణాలు పెట్టేశాను.

''నీ రెండో అక్కనీ దాని మొగుడినీ రక్షించను! వాళ్ళ దగ్గిరకు వెళ్ళకు'' అంది.

''అదేం స్వామీ! ఆయన మంచివారు! నీ భక్తులు! నిన్ను చూసి మారిపోయారు'' అన్నాను.

''వెర్రిదానా! వాడెవరో తెలుసా! భస్మాసురుడు. భస్మాసురుడు నా భక్తుడే! మీ బావగాడు నా పాదాలు పట్టుకోకపోతే యింకెవరి పాదాలు పట్టుకుంటాడు? అయినా వాడిది రాక్షసాంశ. మోక్షం కావాలన్నాడు. యిస్తానన్నాను'' అంది.

''మా చిన్నక్కనయినా రక్షించు''

''మీ నాన్నని దాని వంతూ అర్పించుకోమను'' అంది. మర్నాడే నన్ను ఊళ్ళు వెళ్ళమంది. ఈయన అనుమానంగా 'ఒక్కత్తినీ పంపటం మా యింటావంటాలేదు' అన్నారు. 'ఒరేయ్ మూర్ఖుడా! దాని వెనకాల నేనుండనా? నీ పిల్లల్ని నువ్వుంచుకుని దాన్ని పంపు' అంది.

''ఈ రహస్యం ఎవరికీ తెలియనీకండి! తెలిసిందా అంతా నా ప్రాణాలు తీసేస్తారు రక్షించమని'' అంది.

''రాయప్పారావో!'' అంది మా తోటికోడలు.

''వాడి గొడవ నీకెందుకే? వాడి ఆస్తంతా రాసేసి ఎప్పుడో ఏర్పాటు చేసుకున్నాడు'' అంది నవ్వుతూ.

ఇదంతా ఆసమ్మబూసమ్మ కబుర్లనుకుంటున్నారా? నమ్మకం కుదరటం లేదా? నిజంగానే మేమంతా అలాగే చేశాం. యిప్పుడా మాటలు గుర్తుండవుగదా! దుఃఖం సిగ్గూ ఉంటాయి గదా! అన్నీ దాచుకుని చెప్పాలి. ఎంత దాచుకున్నా ఆగదు. అందుకే ఎలా తోచితే అలా చెపుతున్నాను. యిప్పుడనిపిస్తుంది. ఎలా నమ్మానూ అని. నేను ఒక్కద్దాన్నీ నమ్మకపోతే ఏం ఆగేది? ఏమో!

మర్నాడు ఈయన రాజమండ్రి వెళ్ళానన్నారు, ఎందుకన్నాను. ఉద్యోగానికి రాజీనామా యిచ్చేసి ప్రావిడెంటు ఫండూ అదీ తీసుకుని మొత్తమంతా స్వామికి అర్పిస్తామన్నారు. ఆయన భక్తికి నాకు ఆనందం కలిగింది. నేనూ అంత భక్తురాలినయానుగదా అని తృప్తి. నేనూ వచ్చి ఆ పనయిందాకా ఉండి అక్కడ నుంచి గూడెం వెళ్తానన్నాను ఆ మనిషితో చెప్పాం సరేనంద.

ఇద్దరం సంతోషంగా రాజమండ్రి వెళ్ళాం. వాళ్ళ ఆఫీసువాళ్ళు ఉద్యోగం మానొద్దని చాలా దూరం చెప్పారు. మేం వినలేదు. రాజీనామా యిచ్చేసాక డబ్బులు తర్వాత వచ్చి తీసుకెళ్ళమన్నారు.

ఈయన నెల్లిపాలెమూ, నేను తాడేపల్లిగూడెమూ బస్సు ఎక్కాం.

★ ★ ★

'' నీ మొహం తగలయ్యా నీకు మతిగాని




పోయిందేమిటే?'' అన్నాడు చిన్నన్నయ్య. అంతదాకా నేను చెప్పినదంతా విని భయంతో వణికిపోయింది చిన్నొదిన. ఎన్నో అడిగింది. నాకు వత్తాసవుతుందనుకున్నాను. ఊరు కుంది.

''ఏం నా మతికేమయింది?'' అని అడిగాను.

''లేపోతే అంత మహా ప్రళయం వచ్చినప్పుడు మీస్వామి గారొక్కరే చాలతారా? మనం ఏ తిరపతి వెంకన్ననో అన్నవరం సత్తెన్ననో పట్టుకోడం మంచిది'' అన్నాడు వాడు.

వాడు వేళాకోళమాడుతున్నట్లుకూడా తోచలేదు. స్వామిని నేనెంత కష్టపడి ఒప్పించానోచెప్పాను. నీకూ డబ్బుకూ ప్రాణానికీ లంకె అని తిట్టాను. వాడంటే నాకెంత ప్రేమో చెప్పి ఏడిచాను. 'సర్లే అంతా ఒప్పుకుని డబ్బులిస్తే నా దగ్గరకురా నేనూ యిస్తాను' అన్నాడు.

అక్కడనుంచి అనపర్తి పాసెంజర్లో వెళ్ళాను. అక్క అంది-

''ఆ ప్రళయమేదో తొందరగా వచ్చేస్తే బాగుండును! యీ సంతకి చేసి ఏం లాభం? అదొచ్చినా యింట్లోనే తిష్ఠ వేసేస్తోంది. నలుగురూ చూస్తే ఏం బావుంటుంది చెప్పూ'' అలా అడిగితే. ''మనకి బావుంది ఎవరెలా ఏడిస్తేనేం?'' అంటారు మీ బావ. ''మనకి బావుంటే మాత్రం చూసే వాళ్ళకి బావుంటుందా శాంతా చెప్పూ'' అంది పెద్దక్క.

అది ఏ ముక్కా తిన్నగా అనదు. ఆ మాటకొస్తే అసలేం జరిగిందో నేనయినా కనుక్కున్నానా? ''ఈ వయసులో బావగారికివేం బుద్ధులే'' అన్నానంతే.

''మీ బావకేం వయసు మించిపోయిందీ. అయినా మగాడికి వయసేంటే? వేలెడంత లేడూ రవిగాడు దాని చెల్లెలికి ఉత్తరం రాసాట్ట. అదొచ్చి నాతో అనొచ్చా! ఓరి వెధవా వరసగూడా కాదురా అని చెప్పేలా చెప్పుకుందునా! మీ బావతో చెప్పింది. తాటిచెట్టు ఎక్కేసారు. అడ్డువడ్డందుకు నాకూ వడ్డాయి, నాలుగు. పడితే పడ్డాయిలే వెర్రివెధవ బతికాడు అంటూ మొదలెట్టింది.

''పోతామంటే మహారాజులా పొమ్మంటారు. ఎదుక్కొస్తున్న పిల్ల వెధవలూ నేనూ ఏ గంగలో దూకాలి. అమ్మా నాన్నాగారూ అంతా ఉత్తికబుర్లే! ఏమో నమ్మా! వాళ్ళు నాకేం అవరు. నువ్వంటేనూ పెద్ద చెల్లెంటేనూ ఉన్న యిష్టం నామీద ఉండదు'' అంది.

నాకు చాలా బాధేసింది. నా పెద్దక్క ప్రళయంలో పోవటమేనా వీల్లేదు.

''బావగారితో స్వామి వారి గురించి నువ్వు చెపుతావా? నేను చెప్పనా?'' అని అడిగాను.

''నువ్వు చెప్పొద్దు. నేనూ చెప్పను'' అంటూ మొదలెట్టింది. ''అదేఁవేఁ?'' అన్నాను మధ్యలోనే. ''ఆయనేం చేస్తారో తెలుసా? దానిని గూడా రక్షించమని స్వామి కాళ్ళు పట్టుకుంటారు. ఉన్నదంతా పెట్టేస్తారు. నీ అక్కాపిల్లలూ పోయాక ఆయనుంటేనేం పోతేనేం?'' అంది.

ఆ మాటా నిజమే అన్నాను ''ఓ పని చెయ్యవేశాంతా! అమ్మకీ నాన్నగారికీ ఎంత ప్రేముంటుందో తెలిసిపోతుంది. నాకూ పిల్లలకీ బావగారికీ కట్టెయ్యమను. ఆ అప్పుమేం ఎలాగోలా తీర్చుకుంటాం! ఆ పని చేసిన రోజున నా చెవి తెగ్గోయించుకుంటాను'' అంది.

ఆ రాత్రికి పెద్ద బావగారిని అడుగుదామా అని గుంజాటన పడ్డాను. పెద్దక్క చెప్పింది నిజమే. పక్కవాటాయే వాళ్ళది. పెదబావగారూ ఆవిడ తెగకబుర్లు. మగా ఆడకి మధ్య అన్నేసి కబుర్లు ఎలా వస్తాయే, అంటుంది పెద్దక్క రహస్యంగా. ఆ రాత్రంతా స్వామి జపం చేసుకొన్నాను. పొద్దుటే అక్కవచ్చి బస్సు ఎక్కించింది. పెద్దక్క బాగా పాడయిపోయినట్టు అనిపించింది. దానికి చీరకట్టు కోడం కూడా నమంగారాదు. ఏబ్రాసి! దానికీ నాకూ పదేళ్లు వార! ఎవరన్నా చూస్తే మా అమ్మ అనుకుంటారు! ఆవిడేనయం! జుట్టు చెదరనివ్వదు. బొట్టు చెరగనివ్వదు.

పెద్దాపురంలో మా పెద్దవదిన నానా మాటలూ అంది. నీకు యిలా అడుక్కోమని పంపించారా మీ అమ్మా నాన్నానూ! ఇంతకన్న మోసం ఎక్కడుంటుందీ? ఛీ సిగ్గు లేకపోతే సరి! స్వామి వారనీ అదనీ వాళ్ళ పేరు చెప్పుకోడమెందుకూ. మా దగ్గర ఏ వల్లకా

డుందని నీకూ నీ అమ్మకీ అమ్మమ్మకీ కళ్ళు కుడుతున్నాయి" అంటూంటే నేను వాళ్ళమీద జాలిపడ్డాను. కోపమూ వచ్చింది. అన్నయ్యలే డు. ఏవో పెళ్ళి ఫొటోలు తీయటానికి వెళ్ళాట్ట. మంచి నీళ్ళు కూడా తాగుతావా అని అడ క్కుండా తరిమేసింది పెద్దవదిన.

ఏం చెయ్యటం! పిఠాపురం బస్సెక్కాను. స్టాండులో దిగిరిక్షా కట్టించుకున్నాను. ఏణ్నర్థం అయిపోయింది అమ్మని చూసి! మనసంతా అమ్మ, అమ్మ అంటోంది. గడపలో అడుగు పెట్టగానే అమ్మని చుట్టేసుకున్నాను. నాన్నగా రు ఫ్యాక్టరీకి వెళ్ళారు. అమ్మమ్మ ఉంది.

"అయ్యో ఎలాంటి పిల్లవెలా అయిపో యావే కళ్ళూ పళ్ళూ పైకొచ్చేసాయి" అంది అమ్మ. "నిన్నొక్కదాన్నీ పంపించారుటే మీ వాళ్ళు ఎంత మారిపోయారూ" అంది. "ఆ శని వదిలిందా మిమ్మల్ని యింకాలేదా?" అంది.

నాకు ఆ మాటకి చాలా కోపం వచ్చింది. మా అమ్మమ్మే అమ్మ మీదపడిపోయింది. "నీకు వచ్చినేళ్ళు ఎవరికొచ్చేయే? దేవుడంటే నీకెలా కళ్ళు పైకొస్తున్నాయే? ఆ స్వామిని నేను దర్శించుకోలేదు. అయినా రోజూ జపం చేసు కుంటున్నాను. నా కోడలు, పీనుగలిద్దరూ గజ గజలాడిపోతున్నారు" అంది.

"అందుకేగాబోలు నువ్వు చీటికీ మాటికీ యిక్కడకొచ్చేస్తున్నావు" అనేసింది అమ్మ. అమ్మమ్మ ఎంత బాధపడిపోయిందనీ! అసలు అమ్మ ఎంతమారి పోయిందీ. ఒహప్పుడు యిలాంటి ముక్క అనే మనిషేనా? పోన్లేవే ఏదో అనేసానూ అంది అమ్మమ్మతో. పాత గొడవలు మరిచిపోలేదు అమ్మ. స్వామి మీద కోపంపోలే దు. ఇలాంటి పనిమీదొచ్చానని ఎలా చెప్పడం! తప్పదు. చెప్పాను.

భయపడ్డంతా అయింది. నీకిలాంటి బుద్ధి పుట్టిందేంటే? నీ చదువంతా ఏమయిందే, అంటూ తిట్టిపోసింది.

నేనూ ఊరుకోలేదు. చెడమడా అనేశాను, "నువ్వు శనివారం ఉపోషం ఉండటం లేదా? నోములు నోచలేదా? వ్రతాలు చెయ్యలేదా! నీ పిల్లలకి పీటలమీద కూర్చుని బారసాలలూ పెళ్ళిళ్ళూ చెయ్యలేదా? మొక్కులు మొక్క టంలేదా? నీ మనవలికి 'శ్రీరాముని దయచేత ను' అంటూ పద్యాలు కంఠతా పట్టించలేదా? ప్రతిరోజు రాత్రీ దణ్ణంపెట్టి హారతి పాటలు పాట్టంలేదా? యివన్నీ పిచ్చులు కాకపోతే నాదెలా పిచ్చవుతుందే? దేవుడూ తల్లీ సమానం. వెధవ పనులు చేస్తే అననూ అంటా రు కడుపులోనూ పెట్టుకుంటారు. ఆ మాటకొస్తే నువ్వు చిన్నబావగారికన్న ఎక్కువా? ఆయనే వచ్చి గంటన్నర సేపు కాళ్ళు నెత్తిమీద పెట్టు కోగా లేనిది నువ్వెంత?"

ఆశ్చర్యపోయింది అమ్మ, "నిజమేనా చిన్న బావదాని కాళ్ళు పట్టుకున్నాడా? మాకలా రాయలేదే! నేనే వెళ్ళి ఆ స్వామి గొడవ ఏంటో చూడమన్నాను. నీకేం భయంలేదనీ, నీ కా పురం సరవుతుందనీ రాశాడూ" అంది.

"అవునుమరి! ఆయనకయినా కళ్ళు విడాయి. నీకు విడటం లేదు" అన్నాను. "ప్రళయం రాదనుకుంటున్నావా ఏంటి?" అంటూ మా అమ్మమ్మ ఆరంభించింది. అమ్మ తగ్గిపోయింది, "వస్తేరానీ దిక్కుమాలిన ప్ర ళయం! అవుతే అవనీ ఆ స్వామి దేవుడు. మీ చిన్న బావగారు మరెవ్వరయినా ఆవిడ కాళ్ళు పట్టుకోనీ! నేను పట్టుకోను! నేను చెయ్యని పనిని చేశానంది ఆ స్వామి. ఎందుకందో ఆవిడకే తెలియాలి. నన్ను కోసేసినా సరే నేనా మాట ఒప్పుకోను" అంది. "నాన్నగారితో చెప్పు కో" అనేసింది.

ఆ రాత్రి మా నాన్నగారినే అడిగేశాను.

ఆయన చాలా బాధపడ్డారు. ఏవేవో పాత కథలు చెప్పారు. 'నీకు తెలీదు శక్తుల్నీ గట్రా నమ్ముకుంటే చాలా ప్రమాదం' అన్నారు. వాళ్ళ ఉప్పాడ మేనమామగారికి ఉపాసన ఉండేదిట. దేవి అందం చూసి మనను చెదిరి పిచ్చెక్కిపోయారట. ఒకతను ఏదో చేస్తూ బెడి సికొడితే రక్తం కక్కుకు చచ్చిపోయాడట, చేసే దేదయినా చాలా నిష్ఠగా చెయ్యాలిట, అన్నా రు.

అశక్తుడు దుర్జనుడుట! నన్నేం చెయ్యు మంటావు? నీ పెళ్ళి బాకీయే తీరలేదు. కాద నుకుంటే మాత్రం పోతుందా? మీ చిన్నన్నయ్యా





ఏదో వెధవ పనిచేశాడు. కాళ్ళ మీదపడ్డాడు. ఎక్కడో తెచ్చిచ్చాను. వడ్డీకూడా కట్టడం లేదు, అన్నారు. ''ప్రళయం వస్తే మీరంతా బతికుంటే చాలు! నాకు ఓపికాలేదు, ఉండాలనీ లేదు'' అన్నారు.

నేను వదలలేదు. ''అయిదేళ్ళ తర్వాత మాటగదా! నా పరిస్థితి బాగయితే నేనే వస్తాను'' అన్నారు.

పనయిందని సంతోషంలో ఉండగా అమ్మమ్మ పట్టుకొంది, 'ముసలి పీనుగని! నా కొడుకులకి విశ్వాసంలేదు. చవటలు! వాళ్ళని ముట్టెత్తినా లాభంలేదు. తల్లితల్లీ! నా దగ్గర అర్పించుకుందామన్నా యీ తెల్ల పంచెలే ఉన్నాయి. నువ్వు చెపితే ఆ స్వామి వింటుంది. నీకూ నీ పిల్లలకూ సేవచేసుకుని ప్రళయం వచ్చాక రుణం తీర్చుకుంటానే' అంది. సరేనన్నాను.

ఓ రాత్రి వేళ మెలకువ వచ్చింది. అమ్మా నాన్నగారూ మాట్లాడుకుంటున్నారు. స్వామి అంటుంటే విన్నాను.

''మనమేం చెప్తాం? వాళ్ళ పిచ్చి వాళ్ళది! దాని సంసారందానిది! చేతనయితే నడుం కట్టాలి! లేపోతే అవలేదమ్మా అని మంచి మాటలాడాలి. దాన్ని పంపొద్దంటావు. అది వినదు. మొగుడేం కొట్టే తిట్టే మనిషిగాదు. పిల్లమీద అంత అభాండం వేసినా అతను ఏలుకొంటున్నాడు. నిజంగానే దేవుడు మరి! దాన్ని మనం మొయ్యలేం? వదిలెయ్'' అన్నారు.

నాన్నగారిమీద జాలేసింది. అమ్మ మీద కోపం వచ్చింది. పూర్వం నోరు ఎత్తడానికి భయపడేది! యిప్పుడు యిలా తినేస్తోంది, పాపం! ఆవిడకి నచ్చేటట్టు మాటాడుతున్నారు, అనుకున్నాను.

రెండు రోజులుండమన్నారు. శుక్రవారం పూటా ప్రయాణం వద్దన్నారు. స్వామి చెప్పారు. వెళ్ళిపోవాలి అన్నాను. నేనొస్తుంటే అమ్మ ఏడిచింది. 'మళ్ళీ నిన్నెప్పుడు చూస్తానో' అంది. ఉత్తరాలు రాయమంది. మీరు రాస్తే రాస్తానన్నాను. పిల్లలకి ఏవో కొనియిచ్చారు.

నేను నెల్లిపాలెం చేరేసరికి మధ్యాహ్నమయింది.

★ ★ ★

నేనెంతో ఉత్సాహంగా ఉన్నాను. ఏం సాధించుకొచ్చానో చెపుతున్నాను: ఆ మనిషి తారాజువ్వలా లేచింది. కాళ్ళావేళ్ళా కుమ్మేసింది. జుత్తుపట్టుకుని గుద్దేసింది. స్వామీ స్వామీ అంటూ కాళ్ళు వదల్లేదు.

''దౌర్భాగ్యురాలా! దేవరహస్యం నీ మొగుడి భక్తిని చూసి మనసు కరిగిపోయి చెప్పేశాను. అందుకే నన్ను ఉబ్బులింగడు అన్నారు. నీ అమ్మనీ బాబునీ అప్పల్నీ అన్నల్నీ వాళ్ళ కొంపల్నీ రక్షించమని ఏడిస్తే వాళ్ళకు నచ్చజెబుతావనుకున్నాను. దేవరహస్యాన్ని చాటింపు వేస్తావా? వాళ్ళు వేళాకోళం చేస్తారా? యిప్పుడే మూడోకన్ను తెరిచేస్తాను'' అంటోంది. వాళ్ళనేం చెయ్యొద్దన్నాను. కావలిస్తే నన్ను చంపెయ్యమన్నాను. కాళ్ళు వదల్లేదు.

మూడు రోజులపాటు ఆ యింట్లోని ఓ గదిలో ఉండమంది. రోజూ ఉపవాసం ఉండమంది. బెల్లమూ ఒకమందూ రాత్రిళ్ళు తినటానికిచ్చింది. అదివేసుకున్నాక ఒళ్ళు తెలిసేదికాదు. మూడోరోజు మధ్యాహ్నం దాకా ఆ మనిషి తప్ప ఎవరూ కనబడలేదు. ఆ సమయంలో వచ్చి నన్ను ముద్దుపెట్టుకుంది.

నీ భక్తికి చాలా సంతోషంగా ఉందే అంది. నిన్నూ నీ అమ్మా బాబులనీ నేను రక్షిస్తాను, అంది. నీ బాబుని నా దివ్య దృష్టితో రమ్మన్నాను. యింకో గంటలో వస్తాడు. యీలోగా నిన్ను చంపేస్తాను. వాడు వచ్చి నిన్ను చూసి ఏడుస్తాడు. నువ్వు వింటావు కదలలేవు. నీ చూపంతా నా మీద ఉంటుంది. మంచుకొండలమధ్య నన్ను చూస్తుంటావు. నేనూ పార్వతీ డాన్సులో ఉంటాము. నీ బాబు నిన్ను పిలుస్తాడు. నోరు విడిందా నీ కళ్ళ నుంచి నిప్పులు పుడతాయి. నీ బాబు రక్తం కక్కుకుని చస్తాడు' అంది.

భయంతో బిగుసుకుపోయాను, అలాగే స్వామీ! అన్నాను. ఓ చాపమీద నన్ను పడుకోబెట్టింది. ఏదో మంత్రాలు చదివింది. నీళ్ళు పోసింది. మత్తుగా ఉంది.





కొంతసేపటికి నాన్నగారు వచ్చారు. 'శాంతా! శాంతా' అంటున్నారు. ఏడుస్తున్నారు. 'గుండె కొట్టుకుంటోంది స్వామీ. డాక్టరుకి చూపిస్తాను' అంటున్నారు.

"నువ్వు భ్రమలో ఉన్నావురా పెద్దాడా? దాని గుండె కాదురా అది. దాని ప్రాణం బలవంతాన నిలబెట్టి కట్టి చుట్టుపక్కల ఉంచాను. దేవతలు నీకు భ్రమ పుట్టిస్తున్నారు. నీకు నీ కూతురు కావాలా?"

"కావాలి స్వామీ"

"రా! చెపుతాను" అంది. అంతా వెళ్ళిపోయారు. ఈయన ఉండిపోయారు. వెర్రాడిలా చూస్తున్నారు. చెయ్యిపట్టుకుచూశారు. అరికాళ్ళు రాసారు. కళ్ళలో నీళ్ళు. అరికాళ్ళకి పసుపు పూశారు. గ్లాసులో నీళ్ళు నోటిలోపోశారు. వెళ్ళిపోయారు.

ఆ మనిషి నెమ్మదిగా మాట్లాడటంలేదు. అంతా వినబడుతోంది. దేవరహస్యం తెలిసినందుకు యముడూ అందరూ కోపంగా ఉన్నారట. వాళ్ళందరికీ శాంతి చేయాలిట! రెండు రోజులలో అయిదు వేలు తెచ్చి దేవతలను తృప్తి పరిస్తే నేను బతుకు తానుట. ఆ తర్వాత అమ్మా నాన్నలని ప్రళయం తర్వాత రక్షిస్తానంది.

ఆ రాత్రి నాకు అన్నం పెట్టింది.

ఏదో మంత్రం చెప్పింది. అది చేస్తున్నంతసేపూ బతికుంటానట! చేస్తుంటే నాన్నగారు చెప్పిన కథలు గుర్తొచ్చేవి. నీరసమనిపించేది. ఆయాసమనిపించేది. మనసు చెదరి మంత్రం పాడయితే బెడిసికొడుతుందేమోనని బెంగ! పిల్లల్నయినా చూస్తే బాగుండుననిపించేది. మనసు చెదురుతున్న కొద్దీ భయం.

రెండు రోజుల తర్వాత నాన్నగారు వచ్చారు. ఓ రోజంతా పూజలు చేయించింది. "శాంతా! లే! మీ నాన్నొచ్చాడూ!" అంది. నీరసంగా కదిలాను. నాన్నగారు వచ్చారు. ఏంటోంటో అడుగుతున్నారు. మాట సరిగా రావటంలేదు. పిల్లలు ముగ్గురూ నన్ను చుట్టేశారు. బండి ఎక్కించారు. ఇంటికి తీసుకెళ్ళారు. ఇంకా పూజలున్నాయని ఈయన్నీ నాన్నగార్నీ ఉంచేసింది.

మూడు వేలే తేగలిగేరుట నాన్నగారు. అందులో వెయ్యి చిన్న బావగారు యిచ్చా

రుట. పోలీసురిపోర్టు యిద్దామన్నారట ముందు. మనపిల్లని రక్షించుకోవాలంటే వెయ్యి యిచ్చారట. మరో నాలుగువేలు తెమ్మనీ అప్పుడు నేను పూర్తిగా బతుకుతాననీ అందిట. అదంతా రాత్రి నాన్నగారు అంటున్నారు. నాకు మాటరావటంలేదు. తేలుతున్నట్టుంది.

మర్నాడు ఆయన వెళ్ళిపోయారు.

చిన్నతోటికోడలు 'చచ్చిపోయాక ఎలా ఉందని' వచ్చి అడిగింది. పెద్దావిడ, అత్తగారూ ఏదో అడుగుతున్నారు. పిల్లలిని వదిలేసి పడుకున్నాను., రాత్రి పదిగంటలకు లేచాను. అన్నం పెట్టారు. ఆ మనిషి ఇచ్చిన మందు వేశారు ఈయన. ఏంటో! ఆ అన్నంలో ఉందో మందులో ఉందో ఏంటో - ఒకటే మత్తు. నరాలతీపు - పడుకుంటే పైనున్న కప్పుకిందకొస్తున్నట్లుండేది. గది నాలుగు గోడలూ మూసుకుపోతున్నట్లుండేది! లేచి ఆపుదామని చేతులు చాచేదాన్ని. నడుద్దామంటే నేల కిందకిపోతున్నట్లుండేది! బెల్లమూ, నెయ్యీ కలిపిన అన్నం ఎవరో పెట్టేవారు. అది ఓ ముద్ద ఇంటిమీదా, మరొకటి నోటిలోనూ ఉండేది. అన్నీ తెలుస్తూండేవి. ఏదీ తెలిసేది కాదు. ఎన్నాళ్ళు గడిచిందో సరిగ్గా తెలియదు.

ఆ రోజు మా అమ్మ వచ్చింది. లేకపోతే నేను చచ్చిపోయేదాన్నా? కాపురం చేసుకునేదాన్నా?

ఆ తర్వాత తెలిసినదాన్నిబట్టి జరిగిందేంటంటే-

నాన్నగారు నాలుగువేలూ తెచ్చి పూజలు పూర్తిచేసి నన్ను బతికించుకుంటారని వాళ్ళంతా అనుకున్నారుగాబోలు! మా మామగారూ ఆ మనిషే కలిసి నాటకమాడారు! ఏమో! నాకలా అనిపించదు. ఎవరయినా అన్ని తిట్లు ఏ భయంవల్లో తింటారుగాని. ఊరికే తినరు గదా!

మా అమ్మ వచ్చి ఈయనతో డబ్బు తేలేదందిట!

'మీ కుటుంబానికి నీతీ జాతీ లేవు. సిగ్గూ శరం లేవు. తెస్తానని వెళ్ళిన మగాడు మొహం చూపించలేక మిమ్మల్ని పంపాడా? ఆడమనిషంటే స్వామివారికి భయమా? మీకోసం మీ అమ్మాయి చావు తెచ్చుకుంది. మీకు అది అక్కర్లేదు. కావాలంటే పండూర్లో భూమి అమ్మకూడదా? యిల్లు తాకట్టు పెట్టగూడదా?' అని దులిపేస్తున్నారుట ఈయన.

మామగారు ఈయన్ని నోరు ముయ్యమని అసలు మీరెందుకొచ్చారన్నారట.

''నాలుగువేలు పుట్టించలేకపోయామని - మిగిలిన పిల్లలు శాంతని చూపిస్తే యిస్తామన్నారనీ'' అమ్మ అందిట.

'వెళ్ళి స్వామివారినడగండి' అన్నారుట ఈయన.

'నేను వెళ్ళనుగాక వెళ్ళను' అందిట అమ్మ.

ఆ మాటకి ఈయన పిచ్చెత్తిపోయారట. ఆ సమయంలో అమ్మ ఎలా ఉందో ఎలా నెగ్గుకొచ్చిందో తెలీదు. ఈయన ఎంత అరిచినా అమ్మ నోరెత్తలేదుట. మామగారు ఈయన్ని బయటికి పంపేసి అమ్మతో అన్నారట. బయట నించున్నారుట ఈయన.

'మీ వాలకం చూస్తుంటే మీకు కూతురి కాపురం అక్కర్లేదన్నట్టున్నారు - మీ అమ్మాయిని మీరు తీసుకుపోండి - మీరేంచేసుకుంటారో మీ కర్మ' అన్నారుట.

'కాపురం వద్దని ఎవరన్నారూ' అందిట అమ్మ.

'మీరిక్కడనుంచి మీ అమ్మాయిని తీసుకుపోతానంటే అర్ధమదే!' అన్నారట.

ఆ మాటేదో కట్టుకున్నాడిని అనమందిట అమ్మ.

అప్పుడీయన వచ్చి 'అనలేననుకున్నారా?' అన్నారుట.

'నీకు జన్మజన్మలనుంచీ పెళ్ళాంకదా' అనేసిందిట.

'అదన్నమాట మీ ఎత్తు. అందుకన్నమాట నేనూ, మా స్వామీ అంటే లోకువ' అంటూ నోటిమాట లేకుండా నిలబడ్డారట. 'నేను స్వామివారినడిగొస్తాను' అని బయల్దేరారుట.

మా మావగారు పెద్దపెద్ద కేకలు వేశారుట. ఊరంతా పోగయిపోయారుట. ''ఇంటి యజమాన్ని నేను. భగవంతుడొచ్చి చెప్పినా సరే ఆ




పిల్ల నా యింటిలో ఉండటానికి ఒప్పుకోను! తీసుకుపొండి!'' అంటూ నన్ను రెక్క పట్టుకు లేపి లాక్కొచ్చి పిల్లల్నీ నన్నూ వీధిలోనించి బె ట్టేశారు.

నాకింకా మత్తుగానే ఉంది. ఏం తెలీటంలే దు.

అమ్మ శంకరాన్ని భుజానికి ఎత్తుకొంది. నా చెయ్యి పట్టుకుని నడిపించింది. రాజ్యమూ, కాముడూ నా చెయ్యి పట్టుకు నడిచారు. అప్పు డు రాత్రి పదకొండయిందిట. మా బావగారు పిల్లల్నిద్దర్నీ భుజానికెత్తుకుని రోడ్డుదాకా వచ్చారు.

ఇద్దరు ఆడమనుషులం! ముగ్గురు పిల్ల లు! కట్టుబట్టల్తో అర్ధరాత్రివేళ రోడ్డుమీద ఉన్నాం! ఎవరో పుణ్యాత్ములు అమ్మకి సాయంచేశారు. ఒక లారీ ఎక్కించారు.

రాత్రి మూడున్నరకు తాడేపల్లిగూడెంలో దించారు.

అమ్మ ఆ తర్వాత చాలాసార్లు చెప్పింది - ''ఆ రాత్రి ఆ లారీడ్రైవరే శాంతా దేవుడంటే! నిన్ను తీసుకుపోదామని నేను రాలేదు. కను క్కొని వస్తాను. మీరు కంగారుపడకండి అంటే తిట్టిపోశారు. పెద్దమామయ్య లేరు. ఒక్కరోజు ఆగితే ఏమవుతుందో తెలీదు. ఎలాగో ఒప్పించి బయల్దేరాను ఒక్కద్దాన్నీనూ! సాయంకాలం ఆరుగంటలకొచ్చిన మనిషిని. నిన్ను చూస్తా నంటే చూడనివ్వలేదు, తర్కం పెట్టుకు కూర్చున్నారు. తొమ్మిదిగంటలకు వచ్చి మీ ఆయన నానామాటలూ అన్నాడు. నీ మొగు డూ, నీ మామగారూ నిన్ను బయటకి గెంటిస్తా రని కల్లోకూడా అనుకోలేదు. ఏం చెయ్యటం? ఏమైతే అయిందని బయల్దేరిపోయాం! పిచ్చో డయినా మీ బావగారు నయం! అన్నీ సరిగ్గా ఉన్న పీనుగులకన్న ఆడాళ్ళని పంపేస్తున్నా మని యిదయ్యాడు. పిఠాపురం గనక అర్ధరా త్రిపూట వెళితే మీ నాన్నగారి గుండాగినా ఆగిపోతుందని గూడెం అనుకున్నాను. లారీ ఎక్కేదాకా భయమే! ఎక్కడ ఆ మాయముండ వచ్చేస్తుందోనని! లారీ కదిలేసరికి ఏడుపు ఆగలేదు.

అప్పుడా డ్రైవరు 'ఏమయిందమ్మా భయంలేదమ్మా' అంటూ అడిగాడు. ఏదీ దాచుకోలేకపోయాను. అన్నీ చెప్పేశాను. 'పోన్లే తల్లీ! నీ కూతురు నీకు ప్రాణాల్తో దక్కింది. ఏమందో మాకో పెట్టారు. నిద్రపోతోందంతే! నువ్వేం భయపడకు' అంటూ ఓదార్చాడు. దోవలో టీ యిప్పించాడు, టిఫినిప్పించాడు. బలవంతాన చపాతీ తిన్నాను. పిల్లలకి బిస్కె ట్లు కొన్నాడు. నువ్వు నిద్రోతూనే వున్నావు. గూడెంలో దిగాక టాక్సీ కట్టించి యింటికి చేర్చాడు. మీ చిన్నన్నయ్యా, నేనూ ఎంత బతిమాలినా డబ్బులు తీసుకోలేదు. అతనూ దేవుడంటే''

మర్నాడు పొద్దుట లేచాను. ఒళ్ళంతా అదోలా ఉంది. మొహం కడిగి కాఫీ తాగాను. అమ్మ ఏదో చెపుతోంది. వింటున్నాను. ఎవరిని తిడుతుందో తెలీదు. ఏం జరిగిందో అర్థమవ టంలేదు. అర్థమయిందేంటంటే-

నా కాపురం పోయింది. మా ఆయన వదిలే శారు.

ఆరోజు మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో నేను ఎలకలమందు తాగేశాను.



ఎందుకు తాగాను ఎలకలమందూ? చావాల నేగదా ఆ విషయం గుర్తొస్తే మనసు పరిపరి విధాల పోతుంది. బతికుండగా మంచిపనులు చేస్తే స్వర్గం వస్తుందిట. ఉన్నదంతా దానమి చ్చేసి మంచిపనులు చేసి ఆత్మహత్య చేసు కుని స్వర్గాన్ని ఎవరయినా సంపాదించుకు న్నారా? పోనీ అలా స్వర్గంకోసం ఎవరయినా ప్రాణాలు తీసుకున్నారా?



మా కుటుంబాల్లో ఆడాళ్ళ గురించి వింతగా విశేషంగా చెప్పుకునేవి రెండే! ఒకటి బలవంతాన చావటం. రెండు లేచిపోవటం. అలాంటివాళ్ళని ఎవరూ మరిచిపోరు. కథలుగా చెప్పుకుంటారు కావల్సినవాళ్ళయితే బాధగానూ, సిగ్గుగానూ పైవాళ్ళయితే విచిత్రంగా మచ్చలాగానూ! మా నాన్నగారి వేలువిడిచిన మేనత్తకూతురొకావిడ నూతిలో పడి చనిపోయిందిట. ఆవిడ నెమలికంఠం రంగు పట్టుచీరతో పువ్వులు పెట్టుకుని పిల్లాడికి కడుపునిండా పాలిచ్చి తలుపు తాళంవేసి వెళ్ళి నగలూ, అవీ చూరులో పెట్టి నూతిలో దుమికిందిట. ఇదంతా మా యిళ్ళలో చాలాసార్లు అనుకునేవారు. ఆవిడ కట్టుకున్న చీర రంగూ, నగలు చూరులో పెట్టడం అస్తమానూ అనేవారు. అందుకే అంతా గుర్తు! మొగుడుకి నోట్లో నాలుక లేదనీ, అత్తగారు గండ్రమనిషనీ అస్తమానూ అనేవారు.

మా అత్తారితరపున ఒహావిడ గురించి చె

ప్పేవారు. అత్తకీ, కోడలికీ పడేదికాదుట. వాళ్ళిద్దరి దెబ్బలాటలో ఆ కోడలు నూతిలోకి ఉరికేసిందిట! మా అత్తగారనేది "దొంగపీనుగకి బాగా తెలుసు! నూతిలో నీరూ లేదు లోతూ లేదు అని చీర వరల్లో చిక్కుకుపోయింది. కప్పులు మీదపడ్డాయి. బాబోయ్ బాబోయ్ అని గెంతులు అంతా మూగేశారు. మా కొండమామయ్యా వేళాకోళం 'బయటకి లాక్కండర్రా చీర లేదూ అని' ఈ కథను ఆవిడ చెప్పడం నవ్వడం! మేమూ పొట్టచెక్కలయ్యేలా నవ్వేవాళ్ళం! యిప్పుడనిపిస్తుంది పాపం! ఆవిడయినా చావాలనేగదా ఉరికింది. నుయ్యి లోతు లేకున్నా ఏరాయి తగిలినా చచ్చిపోయుండేదే గదా! కోపమో బాధో అందుకేగా చావుకి తెగించింది మరయితే కప్పులకు ఎందుకు భయపడింది. విసిరిన తాడు ఎందుకందుకుందీ?

ఓమారు నా ఆత్మహత్య గురించి చిన్నబావగారన్నారు-

'చావు ఎన్నడూ సమస్యలకి పరిష్కారం కాదు శాంతా! అలా అనుకునేవాళ్ళుంటారు. అలా కథలు రాసేవాళ్ళుంటారు. అలా జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ప్రతివాడూ అనుకుంటాడు. కాని ఆ ప్రయత్నం చేసేవాళ్ళు తక్కువ. చేసినా నిజంగా చనిపోయేవాళ్ళూ కొద్దిమందే! కాబట్టి ఆత్మహత్య ఆలోచన సాగుతూ ఉన్నప్పుడు జరగదు. ఆలోచనల్లో ఆత్మహత్య ఓ పిల్లకాలవ. కనక ఆత్మహత్యకి అసలు కారణం ఆవేశమే!

ఆత్మహత్య ఆలోచనలు అస్తమానూ రావటం ఓరకమయిన మానసికవ్యాధి. అలాగే స్వల్పవిషయాలకు పెద్దపెద్ద ఉద్రేకాలు కలగటం మరో మానసిక వ్యాధి. అలాంటి రోగులూ ఒక్కోమారు ఆత్మహత్యలు చేసుకుంటారు. పోతే కొన్ని ఆత్మహత్యలకు కారణం ఓవిధమైన డిమాన్‌స్ట్రేషన్ ఎఫెక్ట్! ప్రేమలకోసం చావటం గురించి కథల్లో చదివి సినిమాల్లో చూసి వార్తల్లో గమనించి చస్తామని బెదిరించటం ప్రయత్నించటం ఒక్కోమారు చావటం ఇలాంటి ఎఫెక్ట్‌వల్లే అవుతాయి. అలాగే అత్తా కోడళ్ళ గొడవలు ఒకకాలంలో దేవుడిముందు తలలు నరుక్కోవటాలూ ఒకరిని చూసి యింకొకరు నీది ఆ క్షణంలో కలిగిన ఆవేశానికీ, దొరికిన అవకాశానికీ ఫలితమనుకుంటానమ్మా"

ఇంతకీ ఆరోజు చిన్నన్నయ్యకు అంతా చెప్పి నాన్నగారితో మిల్లుకు ఫోన్‌చేసి గూడెం రమ్మనమని కబురు పంపించింది అమ్మ. వాడెళ్ళి వచ్చి నాన్నగారు వస్తున్నారని కబురు తెచ్చాడు. పన్నెండుగంటలకు అన్నాలు తిన్నాం. నాకు బాగా మత్తు దిగిందని గుర్తు. అమ్మ, చిన్నొదిన, నేనూ కూర్చున్నాం. జరిగిందంతా అమ్మ చెప్తోంది.

నన్ను ప్రశ్నలు వేసి ఆయన ఉద్యోగానికి కూడా రాజీనామా యిచ్చేశారని యిల్లూ, వాకిలీ రాసేస్తున్నామని, బంగారం ఎప్పుడో యిచ్చేశామనీ తెలుసుకుంది. లబోదిబోమంది. నాకు ఏడుపు రాలేదు. రాయిలా కూర్చున్నాను. చిన్నవదిన అమ్మను ఓదారుస్తోంది కోర్టులనీ పోలీసులనీ అంటోంది.

నేను చిన్నన్నయ్య గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుని పడుకున్నాను. యింకా నాకు అదోలా ఉంది. అలా పైకి చూస్తుంటే కనిపించింది ఎలకలమందు. వెళ్ళి గ్లాసులో నీళ్ళు తెచ్చుకుని అందులో అది కలుపుకుని తాగేశాను. గొంతుక, కడుపూ మండిపోయాయి. ఉమ్మాలనిపించేది. వాంతులొస్తున్నట్టయింది. కళ్ళు తిరిగిపోతున్నట్లయింది. వెళ్ళి తలుపు గడియ ఎలా తీశానో... కాళ్ళూ, చేతులూ స్వాధీనం తప్పాయి. కిందపడిపోయాను.

డాక్టర్లూ, ఆస్పత్రీ, మావాళ్ళందరికీ టెలిగ్రాములూ అన్నీ అయ్యాయి. డాక్టర్లు నన్ను బతికించారు. నా కడుపులో గంజాయి కూడా ఉందన్నారు. ఆ మనిషి మా అత్తగారికీ, నాకూ యిస్తున్న మందు ఏమిటో కొంత అర్థమయింది. నాకు కనిపించిన స్వర్గాలన్నీ ఆ మత్తు ప్రభావమేననితర్వాత తెలిసింది. ఆస్పత్రిలో నేనుండగా ఎవరెలా బాధలుపడ్డారో ఏంటో నాకేం తెలియదు. నన్ను ఆస్పత్రినుంచి విడుదలచేశారు.

నేనలా ఉండగానే నాకు ప్రమాదం తప్పిందని డాక్టర్లు చెప్పగానే మావాళ్ళమధ్య ఓ గొడవయిందిట. ముందుగా నాన్నగారుగదా





గూడెం వచ్చింది.

మా పెద్దబావగారన్నారట - "మొగుడికీ, అత్తారికీ తెలియపరచటం మన ధర్మం"

దానికి నాన్నగారు అమ్మమీదకి ఒంటికాలి మీద లేచారుట. మనుమలకి ఎంతేసి కోపాలొస్తే అంతా చూపించేసుకోటమే! సుఖాల్లో శుభాల్లో కొట్టుకి చచ్చినా ఫరవాలేదుగానీ కష్టం వచ్చినప్పుడు అయినవాళ్ళకి తెలియపరచకపోతే ఏం బాగుంటుందని నేను సణుగుతూనే వున్నాను. నా పిల్లనింతచేశారూ వాళ్ళు కావాల్సినవాళ్ళేంటి నసేమిరా తెలియపరచొద్దంది - మీ అత్తగారు, మొగుడూ, మొగాడూ అని లేకుండా ఆవిడలా తీసిపారేస్తే, నోరుమూసుకుని ఆరోజు అందరికీ టెలిగ్రాములు యిచ్చాంగానీ వాళ్ళకి యివ్వలేదు. అప్పట్నుంచీ మనసు పీకుతూనేవుంది.

'మీ మామగారు అలాగే అంటారు. నా పిల్లకేమయినా అవనీ చెప్తాను. ఆ వెధవల్ని నరికేస్తాను పొడిచేస్తాను అని ఆరోజు మీరంతా వచ్చేలోగా ఈయన ఎంత గాభరా పెట్టేశారని! ఓపక్క ఆస్పత్రిలో పిల్లదగ్గరుండాలి. మరోపక్క ఈయన్ని పట్టుకోలేం! చిన్నదయినా చిన్నకోడలు ఆరోజు ఈయనని ఎలా ఆపిందో యిల్లు కదలనీలేదు. ఇహ అందుకుని మేం ముగ్గురం ఆలోచించి వాళ్ళకి తెలియబరచలేదు' అందిట అమ్మ.

"సర్లేండి అయిందయింది యిప్పుడయినా తెలియబరచటం ధర్మం. ఏమంటారు తమ్ముడుగారూ" చిన్నబావగార్ని కదిపారట.

"యిప్పటికి వాళ్ళు చేసిన నిర్వాకం చాలు! బంగారంలాంటి పిల్లను వాళ్ళచేతుల్లో పెట్టాం. ఈ గతి పట్టించారు! ఎవరికి లేవు దేవుళ్ళూ దయ్యాలూనూ! మేంమాత్రం బాబాగారిదగ్గరకి వెళ్ళటంలేదూ! ఎంత పల్లెటూరివాళ్ళైనా ఈరోజుల్లో యింత అన్యాయంగా ఉంటారా? వాళ్ళంతట వాళ్ళొచ్చి కాళ్ళమీద పడేదాకా, ఆ పిచ్చులేవో వదిలేదాకా యిహ ఈ యింటిమీద కాకి ఆ యింటిమీద వాలటానికి వీల్లేదు! మనపిల్ల రేప్పొద్దుట తెలిసీ తెలియకా కూసినా మనం దాన్ని వదలకూడదు! అయినా బావా... నువ్వు చీటికీ మాటికీ ఏంచేద్దామని నన్ను చంపుకుతింటావుగదా! యిలా యిలా అవుతోంది - ఆ ముండ డబ్బులు తెమ్మంటోంది అని ఒక్క ముక్క నాతో అంటే సరిపోను! ఏదో ఎక్కడో తెచ్చి దానికిచ్చి వదుల్చుకుందామని చూశావుగాని యిలాంటి ముండలు ఎలాంటి పనిచేస్తారో ఆలోచించావా నువ్వు? పోలీసు కంప్లెయింట్లూ వల్లకాడూ దేనికి. మావాళ్ళని పదిమందిని తీసుకెళ్ళి శుభ్రంగా రేవు పెట్టేసి గుడారం ఎత్తించేస్తే జబ్బులన్నీ కట్టేనును" అన్నాట్ట పెద్దమామయ్య.

"అదికాదు బావా" నాన్నగారు సర్దబోయారుట.

"కబుర్లకేంలే అంతా చెప్పగలరు! పదమంటే మావూరు మొత్తం వెళ్ళి దాన్ని అయిపు లేకుండా చేసేద్దుం అదాపని! అంతటితో అయిపోయిందా" అన్నాట్ట చిన్న చిన్నాన్న.

"ఏంటి నీ వుద్దేశ్యం" అన్నాట్ట మామయ్య.

"పిల్లని తెచ్చి యింట్లో పెట్టుకుంటే పడాల్సింది మేం! మొయ్యాల్సింది మేం! తతిమా పిల్లలకి పెళ్ళిళ్ళు చెయ్యాల్సింది మేం!" అన్నాట్ట చిన్నాన్న.

ఆ మాటకి మా పెదమామయ్యకి పట్టరాని కోపం వచ్చిందిట. 'నేను వెళ్ళిపోతా'నని ఆయన బయల్దేరేసరికి అన్నయ్యలూ, బావలూ నాన్నగారూ తెగ బతిమాలారుట.

"ఓపక్క పిల్ల అలాంటి కష్టంలో ఉంది. నా చెల్లెలికి అంత కష్టం వచ్చింది. కనక యిక్కడకు వచ్చాను. నాకు బాధ్యత ఉంది గనకనే ఆమాట అన్నాను. దాన్ని మీరు భరించలేకపోతే నేను మోస్తాను. నాకూ ఆడపిల్లల్లేరు. మా రాజుగాడితో పెంచుకుంటాను! సమయం అలాంటిదిగనుక ఊరుకున్నాను. మరోసారీ మరోసారీ యిలాంటి మాట అంటే అన్నవాడి జబ్బలు విరిచేద్దును" అన్నాట్ట పెద్దమామయ్య.

మా చిన్నాన్న నోరుమెదపలేదుట.

"అయితే ఇపుడేంచేద్దామో తేల్చిచెప్పు" అడిగారుట నాన్నగారు.



''నేనెవడిని చెప్పటానికి? తేల్చటానికి? ముందే చెప్పాను పిల్లనిమాత్రం పంపటానికి వీల్లేదు. పంపుతానంటే నేను ఊరుకోను! నాతో నా చెల్లెలినీ, దాని కూతుర్నీ తీసుకుపోతాను వాళ్ళొచ్చినప్పుడు చూస్తాను'' అన్నాట్ట.

''పెద్దవారు మీరలా తొందరపడకూడదు బాబయ్యగారూ!'' అన్నారుట పెదబావగారు.

''లేదులేదు తొందరపడం! మీరు మా పిల్లల్ని వేయించుకు తినండి! మేం నూనె, కారమూ నప్పై చేస్తాం! వాళ్ళనీ, వీళ్ళనీ తెచ్చి నెత్తిమీద పెట్టండి. మేమూ మా పిల్లలం మీకూ, వాళ్ళకీ కాళ్ళు కడిగి నెత్తిమీద జల్లుకుంటాం నాయనా!'' అనేశాట్ట పెద్దమామయ్య. వగిచినట్టూకాదు వాత పెట్టినట్టూ కాదు అన్నట్టు పెదమామయ్య అంటించిన మాటకు పెదబావగారు దొంగకు తేలుకుట్టినట్టుండిపోయార్ట.

''బాబయ్యగారన్నదే రైటు. అలాగే చే

ద్దాం!'' అన్నార్ట చిన్నబావగారు. ఒకరూ, ఒకరూ అంతా అవునవునన్నారుట.

తర్వాత అంతా వెళ్ళిపోయారు. పెద్దమామయ్యా, నాన్నగారు, చిన్నబావగారూ, చిన్నక్కా, అమ్మా, పెద్దన్నయ్యా నన్ను తీసుకుని పిఠాపురం వచ్చారు.



ఆరోజు పెద్దమామయ్యా, నేనూ అందరం మండువాలో కూర్చునిఉన్నాం. అప్పుడు అమ్మ పెద్దమామయ్యతో అంది. ''ఏంచేద్దాంరా అన్నయ్యా''

''యిప్పుడు చేసేదేంలేదు. కంగారుపడకు. ఆ కుర్రాడికయినా పెళ్ళాం, పిల్లలు అక్కర్లేదా? వీళ్ళకున్నదంతా వలిచేసుకుందిగదా! వట్టిపోయిన గొడ్డుని ఎవడు మేపుతాడు? రేపో, ఎల్లుండో అది దుకాణం ఎత్తేస్తుంది. లేదంటే వీళ్ళచేత ఎత్తిస్తుంది. అప్పుడు అన్ని పిచ్చులూ వదులుతాయి. అప్పుడు దేవిదేవరా అని దీని కాళ్ళమీద పడతారు అప్పుడు తెలుస్తుంది మన పిల్ల విలువ''

''మీరు స్వామినన్ని మాటలంటున్నారు గాని. స్వామి మహిమ మీకు తెలియదు'' అన్నాను. అంతా నావేపు చూశారు.

''ఏంటమ్మా దాని మహిమ?'' అంది అమ్మ.

నేను చెప్పాను చాలా విషయాలు. నా ఒళ్ళు నాకు తెలీకపోడం, స్వర్గం గట్రా అనిపించడం వగైరాలు. అన్నీ విని బావగారన్నారు - 'అదంతా గంజాయి ప్రభావం! రకరకాల వేర్లున్నాయి' అంటూ డాక్టరు చెప్పినవి చెప్పారు.

''మరయితే మీరేం తినలేదే తాగలేదే స్వామి కాళ్ళు ఎందుకు పట్టుకున్నారూ!'' అడిగేశాను.

''అవునయ్యా నువ్వు దాని కాళ్ళు పట్టుకున్నావుట - అదేంటీ?'' అంది అమ్మ.

మా పెద్దమామయ్య మరీ ఆశ్చర్యపోయాడు ''ఏంవిటి? నిజమేనా సుధాకరం?''

చిన్నబావగారికి నేనలా నలుగురిలోనూ నిలబెట్టడం నచ్చలేదేమో! నలుగురిలోనూ ఆయన ఆ పని చేశారుగదా! ఏ మహిమా లేకపోతే ఎందుకు చేస్తారు?

ఆయన వెంటనే మాట్లాడరుగదా!

''పోన్లే బావా! అతనుమాత్రం తప్పేంచేశాడు. నేను పట్టుకోలేదా అది పట్టుకోలేదా- వాళ్ళవాళ్లు సరేసరి. ఆరోజు నువ్వూ పెట్టావు దణ్ణం'' అన్నారు నాన్నగారు.

''అమ్మమ్మా! అలాకాదు బావా! నేనూ పట్టొకోవచ్చు. నాకూ దేవుడూ, దెయ్యం ఉన్నాయి. ఆ రెస్పెస్‌వాడిని. మరి సుధాకరం అలాకాదే. అతగాడికి ఏమీ లేవుగదా! కమ్యూనిస్టు కబుర్లు చెబుతుంటాడు. పిల్లలకి బారసాలలూ గట్రా చెయ్యలేదు. పీటలమీద కూర్చోలేదు అలాంటివాడు'' నవ్వుతూనే అన్నాడు. చినబావగారికి కోపం వస్తుందేమోనని నాకూ భయంగా ఉంది. అయినా ఆయనేం చెపుతారో వినాలనివుంది. అల్లుడిని ఎక్కడ వేళాకోళం చేస్తే ఉడుక్కుని అలిగి పిల్లని ఏడిపిస్తాడోనని నాన్నగారు మాత్రం మొహం అయిష్టంగా, అసహనంగా అటూ యిటూ తిప్పేసుకున్నారు. చిన్నఅక్క కుతూహలంగానూ, అమ్మ నిబ్బరంగానూ చిన్నబావగారినే చూస్తున్నారు.

ఆయన సన్నగా నవ్వుతూ తలఎత్తి ''అలా ఎందుకు చేశాననుకుంటున్నారూ''

''ఎందుకంటే ఎందుకంటే పైకి ఏవో కబుర్లూ గట్రా చెప్పినా మీ కమ్యూనిస్టులకీ భయాలూ అవీ జాస్తిగానే వుంటాయి'' అన్నాడు పెద్దమామయ్య.

''మీరంత బిరుదిస్తే కాదనలేనుగానండి బాబయ్యగారూ! నేను కమ్యూనిస్టుగా జీవించటంలేదు. ఏవో కొన్ని భావాలున్నాయంతే. సరే! నా గొడవ వదిలెయ్యండి. మీరు ఆ రెస్పెస్సని





చెప్పుకుంటున్నారుగదా. దేవుడూ, దెయ్యం మీకూ ఉన్నాయంటున్నారుగదా. మరి మీరు ఆవిడని ఎందుకు నమ్మలేదూ?'' అని ఆగారు.

మామయ్య ఏదో చెప్పబోయాడు.

''ఆగండి. ఆ ప్రశ్న నేను అడగగలను. కానీ అడగను. అవిడ కాళ్ళు పట్టుకోటమే ఆస్తికత్వానికో, హిందూత్వానికో చిహ్నమనిగాని, పట్టుకోకపోవటమే కమ్యూనిజానికో, నాస్తికత్వానికో అలాంటి దేనికో గుర్తనిగాని, చిన్నపిల్లల్లా నేను అనను. అనుకోను. అది మాత్రమే కమ్యూనిస్టు లక్షణమయితే అత్తగారికన్న అసలు కమ్యూనిస్టులేరు. ఆ మాటకొస్తే మీరూ కమూనిస్టే అవుతారు''

పెద్దమామయ్య నవ్వాడు ''నువ్వు ఆ మనిషి కాళ్ళు పట్టుకున్నావంటే నాకూ నమ్మబుద్ధికావటం లేదు''

''నేను నా కళ్లతో చూశాను. ఉట్టినే పట్టుకోటంకాదు. అయిదు నిమిషాలయినా తలమీద పెట్టుకున్నారు'' అన్నాను.

''నిజమే'' అన్నారు బావగారు.

''ఆ మనిషిలో ఏదయినా ఉందంటావా నాయనా'' అంది అమ్మ. అమ్మ నా మాట నమ్మలేదన్నమాట. నా కళ్ళతో చూడకపోతే నేనూ నమ్మను.

''ఆవిడలో ఏమీలేదు అత్తయ్యగారూ'' అనేసి ఊరుకున్నారు. పెదమామయ్య ఆయన దగ్గరకి వెళ్ళారు. భుజంమీద చెయ్యేసి ''నువ్వేదో సంశయించుతున్నావు సుధాకరం'' అన్నారు. చినబావగారు ఆయన చెయ్యి పట్టుకున్నారు.

''సంశయమెందుకు బాబయ్యగారూ! శాంత బతికింది. అది చాలు మనకి. కొన్నింటిని తర్కించుకోడం, తలచుకోడంకన్న మరిచిపోడం మంచిది''

''నువ్వు పూర్తిగా నీ మనసులోమాట చెప్పటానికి సంకోచపడుతున్నావు'' అన్నారు.

''చెప్పటానికి కాదు సంకోచం! మీరు ఒప్పుకుంటారా లేదా అనీ కాదు. కనీసం మీరు వింటారా ఆలోచిస్తారా అనే సందేహం''

''అన్నన్న! చెప్పవయ్యా ఎందుకు వినం?''

''ఆవిడ మాత్రం తెలివి తక్కువమనిషేం కాదు బాబయ్యగారూ! బహుశా పెద్ద చదువులు చదివినా చదివుండొచ్చు. కొన్నిరకాల మానసికరోగులు తమనితామే దేవుళ్ళుగా భావించుకోడమూ ఉంది. అలాంటి రోగులనీ వాళ్ళమీద జనానికి ఏర్పడుతున్న నమ్మకాలనీ ఆకర్షణనీ కొందరు సొమ్ము చేసుకోడమూ ఉంది. కనక ఆవిడ దొంగయినా అయ్యుండాలి. లేదా రోగయినా అయ్యుండాలి. దొంగయితే తోడుదొంగలు ఉండివుండాలి. రోగయితే ఆవిడని ఉపయోగించుకునే దొంగలు ఉండాలి. పోతే ఓ మోసానికీ, మరో మోసానికీ, ఓ రోగికీ, మరో రోగికీ రోగలక్షణాల్లో తేడా వుంటుంది. ఓ స్వామిపోతే మరోస్వామి వస్తుంటాడు. ఒకరిని నమ్మకపోతే మరొకరిని నమ్ముతుంటారు. మన విచిత్రదేశంలో నమ్మేవాళ్లకి కొదవలేదు. నమ్మించేవాళ్ళకి కొదవలేదు. అభివృద్ధి చెందిన దేశాల్లో నమ్మడం హాబీ. మనలాంటి దేశాల్లో అది జీవితం. దాని వెనకాల చాలా నేపధ్యముంది.

ప్రధానమంత్రులూ, రాష్ట్రపతులూ, స్పీకర్లతో సహా యావత్తు రాజకీయనాయకులూ ఎవరినో ఒకరిని నమ్ముకుంటారు. వాళ్ళచేత తలమీద తన్నులు తన్నించుకుంటారు. తన్నించుకుంటూ ఫొటోలు తీయించుకుంటారు. అవి పేపర్లలో వేయించుకుంటారు. జనం అవి చూస్తుంటారు. చదువుతుంటారు. ఆ స్వాముల్లో కొందరు విమానాల్లో తిరుగుతుంటారు. అనధికార దౌత్యవ్యవహారాలు సాగిస్తుంటారు. తుపాకులు చేస్తుంటారు. అమ్ముతుంటారు. తుపాకుల బేరసారాలను కుదుర్చుతుంటారు. వాళ్ళ దినచర్యలను పేపర్లు రాస్తుంటాయి. ఇందులో ఏదీ రహస్యంలేదు. దేశాన్ని మానేజ్ చేస్తున్న పెద్దలే నమ్ముతుంటారు. తాము నమ్మని నమ్మకాలని సామాన్య జనానీకం కోసం ప్రదర్శిస్తుంటారు. మతాలు లేవంటారు. అన్ని మతాలగుళ్ళనీ సందర్శిస్తుంటారు మతం వ్యక్తిగతమంటారు. దాన్ని వాడుకుంటారు.

వారలా ఉంటే జనాలకు ధార్మిక నాయకత్వం వహించాల్సిన మతసంస్థలు కూడా నమ్ముతాయి. న్యాయానికి అవి ఆధ్యాత్మికంగా

ప్రజలను జాగృతం చేయాలి. కనీసం తమ పవిత్రగ్రంథాల్లో వ్రాస్తున్న విషయాలనయినా అవి తమతమ మతస్థులకి తెలియజెప్పగల గాలి. కపటమేదో, వాస్తవమేదో అవి తేల్చుకోగ లగాలి. పదాలపట్ల, చిహ్నాలపట్ల, సంకేతాలప ట్ల ఉన్న భక్తిని అవి గ్రహించగలగాలి. వాటిని సామాన్య మతానుయాయులకి అర్థం చెయ్యగ లగాలి. అవి చెయ్యవు. కృత్రిమభయాలను సృష్టించే రాజకీయశక్తులను అవి నిర్ద్వంద్వంగా నమ్ముతాయి. తామే అంగీక రించరాని నమ్మకాలను భుజాన వేసుకొని రాజ కీయాలకు ఊడిగం చేస్తాయి.

ఏ జాతిలోనయినా మతనాయకత్వమూ, రాజకీనాయకత్వమూ తుప్పుపడుతున్నపుడు తప్పుడుదోవ పడుతున్నపుడు మేధావంతుల తాత్విక నాయకత్వం సమాజాలకు సమతూకా న్నివ్వాలి. మన జాతికి దాదాపు శంకరాచా ర్యుని తర్వాత తాత్విక నాయకత్వం లేకపో యింది. ఆ తర్వాత ప్రపంచగమనాన్ని గు రించిగాని, ప్రజాసమూహాల జీవనస్థితిగతుల గురించిగాని జాతి తన పరిస్థితులకి అవసర మయిన రాజకీయ ధార్మిక నాయకత్వాలను ఏర్పర్చుకోలేకపోవటం గూర్చిగాని సమగ్రమ యిన దృష్టితో కూడిన తాత్వికభావన ఏర్పడలే దు. నిరంతరం వచ్చిపడుతున్న విదేశీయుల వల్ల, విదేశీమతాలవల్ల, విదేశీ సంస్కృతులవ ల్ల, విదేశీ తాత్విక భావాలవల్ల మనకంటూ మనకి ఓ తాత్విక నాయకత్వం ఏర్పడలేదు. మన తాత్విక సంప్రదాయం కొనసాగలేదు. అసలే మతానికీ తత్వానికీ మధ్యనున్న విభ జన మనకి అనాదినుంచీ పలచనిదే. శంకరా చార్యుడు తత్వవేత్తో మతప్రచారకుడో కూడా స్పష్టంగా తెలియని పరిస్థితి ఉంది. ఆ తర్వాత క్రమంగా మనం పాశ్చాత్యతత్వశాస్త్ర ప్రభావంతోనే అక్కడా అక్కడా చిన్ని చిన్ని నాయకులను చేసుకున్నాం. తత్వం జాతులక తీతమయినదే అయినా, ప్రతీ జాతికీ, కాలానికీ ఉండే కొన్ని సాధారణతలను అది కలుపుకుని రాలేకపోయినప్పుడు అది ఆ జాతికీ ఆ కాలా నికీ స్వంతం కాలేదు.

క్రమంగా మనం ఈ మూడింటినీ కలిపే సిన ఓ విచిత్రదేశాన్నీ నిర్మించుకున్నాం. ఇక్కడ రాజకీయం, మతం, తత్వం మూడూ విడిగా ఉన్నట్టుంటాయి. ఒకదానొకటి నడుపు తున్నట్టుంటాయి. ఒకదానొకటి నమ్ముతున్న ట్టుంటాయి. ఒకదానొకటి నమ్మిస్తున్న ట్టుంటాయి. నాయకులూ మతాధిపతులూ మేధావులూ అందరూ నమ్ముతారు. కొన్ని నమ్మ కాలనునమ్ముతారు. కొన్ని నమ్మకాలను అమ్ము తారు. వారి వారి లాభాలు వేరుకావచ్చు. అందులో కొన్ని వ్యక్తిగతం కూడా కాకపోవచ్చు. అయినా జరిగేది అమ్మకమే, నమ్మకాల ఉత్ప త్తే. నమ్మకాల వ్యాపారమే. దేశమంతటా సాగు తూన్న ఈ భారీ నమ్మకాల వ్యాపారంలో ఒకచి న్ని అణువు ఆ స్వామి. ఆ స్వామిని నేను నమ్మినా మానినా ఆవిడ కాళ్లు పట్టుకున్నాను. ఆత్మమీదే నమ్మకంలేని నాకు తల ఓ మనిషి పాదాలమీద పెట్టడం ద్వారా ఆత్మార్పణ జరు గుతుందనీ లేదు. ఆత్మకి అవమానం జరుగు తుందనీలేదు. అయినా తలమీద పెట్టుకున్నా ను. అది ఓ వాస్తవం!"

"నువ్వన్నదేదో కొంత అర్థమయినట్టేఉంది గానీ"

"ఏముంది బాబయ్యగారూ ఇందులో తెలీక పోవడానికి మీరు ఆరెస్సెస్ అంటున్నారు. నన్ను కమ్యూనిస్టంటున్నారు. అవి ఎంతవ రకూ నిజమో అంతకన్న నిజం మనం మను షులం! మనకెదురయిన పరిస్థితిని మనం మన జీవస్వభావాలను బట్టి ఆయా సందర్భా లలో మన చాకచక్యాలను బట్టి మనం ఎదు ర్కొన్నాం. ఎవరయినా ఎదుర్కొంటారు. పోతే ఆ ఆరెస్సెస్సూ, కమ్యూనిస్టూ అనే వాటికింద జరుగుతున్నదేమిటి? కించిదనుమానం, కొంత అవహేళన, మరెంతో అసహనం, దానికి కా రణం ఏమిటి? మౌలికంగా మార్పు కావాల్సిన శక్తులు అవే! అది ప్రభుత్వంలో మార్పా! సమాజంలో మార్పా? సహజమైన మార్పా? కృత్రిమమైన మార్పా? ముందుకి తీసుకెళే దా? వెనక్కిలాగేదా? యథాతథంగా ఉంచేదా? లక్ష్యాలేమిటి? విధానాలేమిటి? ఇన్ని ప్రశ్నలూ ఇంత విభజనా ఉన్నప్పటికీ ఈ రెండూ వాస్త వానికి సమాజాన్ని గురించి ఆలోచించే, పట్టించుకునే తమ స్వంతజీవితాలను

అర్పించగలిగే బలీయమయిన శక్తులు. అయినా ఇవి సమాజగమనంలో ఉపపాత్రలు గానే తప్ప ముఖ్యపాత్రలు కాలేకపోతున్నాయేం? ఇవి ఏ మార్పులు కోరుతున్నాయో దానికోసం ఏం చేస్తున్నాయో ఆ లక్ష్యనిర్దేశాల మీదా, విధానాలమీదా వారికి ఎంత కంట్రోలున్నదో, మరెవరికి ఎంత కంట్రోలున్నదో వాటికే ఆలోచించే సమయంలేదు. జరుగుతున్న నమ్మకాల వ్యాపారంలో వారు అమ్మకాలకు ఉపయోగపడుతున్నారో అమ్ముతున్నారో అమ్ముడుపోతున్నారో ఎవరూ ఆగి ఆలోచించటమే లేదు. ఇదంతా మనలాంటి సామాన్యులు గూడా మన గురించి, మన భావాల గురించి, మనం చేస్తున్నపనుల గురించి, చేస్తున్న ప్రతిస్పందనల గురించి, ఆ లాభాలను పంచుకుంటున్న శక్తుల గురించి, ఎవరికి వాళ్ళం ఆలోచనలో పడినప్పుడే, ఆలోచన మొదలెట్టినప్పుడే మన చర్యలనూ నమ్మకాలను ఒకదానికొకదాన్ని అనుసంధానించగలిగినప్పుడే అర్థమవుతుంది''

''నన్ను ఆలోచించమంటున్నావని అర్థమయిందిగాని సుధాకరం- నువ్వు దాని కాళ్ళు పట్టుకు చేసినదేమిటో ఎందుకో చెప్పేద్దూ''

''ఆవిడ కాళ్ళను అత్తగారు ఎందుకు పట్టుకోలేదో నేను అందుకు పట్టుకున్నాను బాబయ్యగారూ! తన గురించి అబద్ధం చెప్పడంవల్ల అత్తగారు పట్టుకోలేదు. స్త్రీల కాపురాలకు వివాహేతర సంబంధాల గుర్చిన అపవాదులే ఆటంబాంబులు. వివాహమయిన క్షణంనుంచి స్త్రీకి కాపురం పోతుందేమోనన్నది ఓ భయానకమయిన భయం. చివరకి వృద్ధాప్యంలో కూడా ఆ భయంనీడలు ఉంటూనే ఉంటాయి. ఇది మన వివాహాల, కాపురాల పరిస్థితి. ఆవిడ ఆ భయాన్ని ఓ ఆయుధంలా వాడింది. అలా ఎందరిమీదో ప్రయోగించి ఉంటుంది. అయితే అత్తగారిమీద అది ఫలించలేదు. అది అత్తగారి వ్యక్తిగతమైనా అయ్యుండొచ్చు, పరిస్థితయినా కావచ్చు. నామీద ఫలించింది. శాంత దాంపత్యజీవితమే శాంత జీవితం అన్న భ్రమ నాకు లేకపోయినా దాంపత్యజీవిత భగ్నమే సంపూర్ణ జీవితనాశనంగా చాలామంది అనుకున్నట్టు నేను అనుకోలేకపోయినా మా మధ్య బంధుత్వాన్ని బట్టి, దూరాన్ని బట్టి ఆ భగ్నానికి నేను కారకుడిని కాకూడదని దానికి నా పేరు వాడుకోబడకూడదనీ బహుశా స్వార్థమేనేమో! పిరికితనమేమో''

చిన్నబావగారి గొంతుక విచలితమయింది.

''ఛత్! తప్పుడుముండ! ఆడదిగాదూ-'' అన్నాడు పెద్దమామయ్య.

''ఆడది గనకనే ఆ ఆయుధాన్ని కనిపెట్టిందేమో'' అన్నారు చిన్నబావగారు.

మళ్ళీ అలాంటిపని చేయనని నాచేత చేతిలోచేయి వేయించుకున్నాడు పెద్దమామయ్య. ఒకరూ ఒకరూ అంతా వెళ్ళిపోయారు. ఒక్కదానీ అమ్మా నాన్నగారూ పిల్లలం మిగిలాం. ఆ మనిషిమీద నమ్మకాలు పోయాయి.

రోజులు గడుస్తున్నాయి. జీవితంమీద ఆశ కలగలేదు. నిరాసక్తత వదలలేదు. మూడేళ్లకు పైగా ఆ సంఘటనల్నించి కోలుకోలేకపోయాను.

అయితే ఏడాదికిపైగా ఇది రాస్తున్నాను రోజుకో పేజీ అరపేజీ చొప్పున రాస్తున్నాను. నా జీవితాన్ని, మా కుటుంబాలలో మనుషులనీ, వాళ్ళ ప్రవర్తనలనీ, సంఘటనలనీ ఒకటి ఒకటి గుర్తుచేసుకునే వీలుచిక్కింది. ఇలా రాస్తూండగానే మళ్ళీ ప్రైవులో చేరాను. ప్రైవేటు పార్టుహేండూ చేశాను. హయ్యరు అయింది. మా దేవదత్తం మాస్టారు హెడ్మాస్టారు ఇప్పుడు! ఆయన నన్ను పిలిచి టైపిస్టు ఉద్యోగం ఇచ్చారు. చిన్నక్లాసు పిల్లలకి ఇంటి దగ్గర ట్యూషన్లు చెబుతున్నాను.

ఆరునెలల క్రితంనుంచి నెల్లిపాలెం కబుర్లు తెలుస్తున్నాయి.

మా పిచ్చిబావగారు ఆ మనిషిని పట్టుకుని చచ్చేలా కొట్టారుట. మా చిన్న తోటికోడల్లూ, వాళ్ళ అన్నదమ్ములూ పోలీసు రిపోర్టు ఇచ్చారట. ఇప్పుడు ఈయనకీ, మా అత్తారికీ ఆ మనిషిమీద నమ్మకాలు పోయాయిట. వెళ్తే రానిస్తారుట.

కానీ నేను వెళ్ళటంలేదు.

ఆయన వస్తారని నాకు తెలుసు.





నాకు ఆయన ఎంత అవసరమో ఆయనకీ నేనూ అంత అవసరమూ అయినపుడేగదా అందమూ బంధమూనూ! ఇద్దరమూ కలిసి కన్నబిడ్డలమీద నాదెంత బాధ్యతో ఆయనదీ అంతేగదా! ఆ అవసరమూ, బాధ్యతా ఏ ఒకరికి లేకపోయినా, ఏ ఒకరికో మాత్రమే ఉన్నా మేం కలిసున్నా లేనట్టేగదా!

తోలేసింది ఆయనే గనక రావాల్సిందీ ఆయనేగదా.

ఈయన ఏం చేసినా తెలియకే చేశారు. తెలిశాక కూడా చేస్తేగదా నేను కోపగించాలి. తిరస్కరించాలి.

ఈయన వస్తే మరో అవకాశమివ్వడానికి అభ్యంతరంలేదు.

రాకపోతే బాధాలేదు.

వస్తారన్న **ఆశాపోదు**. పూర్తిగా మారిపోయి వస్తారన్న ఆశపోదు.

తప్పులందరూ చేస్తారు. ఒప్పుకోడం కొందరే చేయగలరు. ఆ కొందరిలో ఒకరై నావారూ నావాడయి వస్తాడనే ఆశపోదు.

★ ★ ★

పూర్తిచేసిన పుస్తకం చిన్న బావగారికి ఇచ్చాను.

ఆయన చదవడం పూర్తిచేసి నాకు ఇచ్చారు.

"ఎలా ఉంది?" ఆతృతగా అడిగాను.

"నీకెలా ఉంది?"

"మొదదలెడుతున్నపుడు ఒకలా వుంది"

"ఎలా?"

"భయం భయంగా! అయోమయంగా, దుఃఖంగా"

"ఆ తర్వాత?"

"రాస్తూంటే నా చిన్నతనం, నా చదువూ, నా పెళ్ళీ కాపురం తలుచుకుంటుంటే... అందరి గురించి నేనేం అనుకుంటున్నానో తెలుస్తుంటే... నా ఊహలు మారుతూంటే... హాయిగా... కొత్తగా..."

"ఇంకా?"

"చావటానికన్నా బతకటానికి ఎన్ని కారణాలున్నాయో అర్థమవసాగింది"

"రాశాక...?"

"నా కసి, నా కోపం ఆ స్వామిమీద మాత్రమే ఉండటం కరక్టేనా?- అని అనుమానం మొదలయింది"

నవ్వారు ఆయన.

"మీకెలా ఉంది?"

"ఓ సామాన్యురాలు సామాన్యమయిన శక్తితో తన గొడవ చెప్పినట్టుంది"

"బావులేదాండీ?"

"నాకు నిన్నో కోరిక కోరాలనుందమ్మా!"

"ఏంటండీ?"

"ఆఖరు చాప్టరులో కొంచెం నేను రాయాలనుంది- నువ్వు అవకాశం ఇస్తే"

"అదేంటండీ. మొత్తం మీరే రాయండీ"

"కాదు. మొత్తమంతా నీ గొడవ! ఆఖరి చాప్టరు మాత్రం నా గొడవ..."

"మీ ఇష్టం బావగారూ... ఒక్క సందేహం..."

"అడుగు శాంతా!"

"మీకు... మీకు... నేనంటే ప్రేమా? ప్రేమ లేకపోతే ఆ మనిషి కాళ్ళు పట్టుకుని నా కాపురం నిలబెట్టాలనుకోరు..."

"నిజమే! నువ్వంటే నాకు ప్రేమే! నీ భర్తా, పిల్లలూ, తల్లీదండ్రీ, అక్కయ్యలూ, అన్నయ్యలూ... అందరన్నా నాకు ప్రేమే. అందరినీ అందుకే అర్థం చేసుకోవాలని ప్రయత్నం... అంతా సుఖపడాలని అందుకే కోరిక. కాని... ఎవరికి వాళ్ళుగా అర్థం చేసుకోడంకన్న మందిగా అర్థం చేసుకోడం అవసరం. ఎవరికి వారుగా సుఖపడటంకన్న మందిగా సుఖపడటం సహజమూ సాధ్యమూ! అవి నా విశ్వాసాలు. అందుకే అన్నిటిమీదా ప్రేమ! మనిషిగా నాకూ లోపాలు ఉండొచ్చు. శక్తి చాలకపోవచ్చు. నేను ఒక్కడినీ ఏదీ చేయలేకపోవచ్చు. నా లోపాలు దిద్దుకుంటూ నా శక్తిమేరకు మందితో కలవటానికి, పదిమంది నీ కలుపుకు రావటానికీ నా నిరంతర ప్రయత్నం. నా ప్రయత్నానికి చోదకశక్తి ప్రేమే!

నిన్ను ప్రేమించకుండా ఎలా ఉండగలను శాంతా?"

●

# చతుర మలిసంధ్యపై సమీక్షలు

ఏప్రిల్ చతుర మీకందించిన జి. లత నవల 'మలిసంధ్య'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరంటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## దర్పణం

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

'మలిసంధ్య' నవల ఈనాటి వృద్ధతరం జీవితాలకు దర్పణం... మనుషుల మానసిక విశ్లేషణ చక్కగా చేసి అద్భుతంగా నవల రాశారు. శరణాలయంలో వుంటున్న వృద్ధుల చిలిపిచేష్టలు, గిల్లికజ్జాలు, చాపల్యాలు అతి సహజంగా చిత్రించారు నవలలో.

చలపతి, రాజారాం, థామస్, విశ్వనాథం, మహాలింగం దాదాపు ఒకే వయస్సు మనుషులు... వాళ్ళు వృధ్యాప్యపు జీవితాలకు ప్రతినిధులు.

రాజు, రాణి, సుధ తదితరులు యువతరానికి ప్రతీకలు. ప్రగతికి మార్గదర్శకులు.

ఈ ఇరువర్గాల స్వభావాలను, స్వానుభవాలను, వాళ్ళ అంతర్గత భావాలనువాళ్ళ ఆశలను, ఆరాటాలను, వాళ్ళ నిరాశలను, నిస్పృహలను, వాళ్ళ ఉల్లాసాలను, ఉత్సాహాలను చక్కగా ఈ నవలలో పొందుపరిచారు. మహాలింగం, రాజులమధ్య అనుబంధాన్ని స్వంతకొడుకులకన్నా మిన్నగా చిత్రించి మానవ సంబంధాలను పాఠకుల మనస్సులకు పట్టేలా రాశారు రచయిత్రి

రాజు, రాణి ప్రేమకలాపాలను అత్యంత సహజంగా చిత్రించారు. రాజు మనస్తత్వాన్ని రాణి మానసిక స్థితిని ఎంతో రమ్యంగా రాశారు.

మహాలింగంగార్ని కొడుకు వచ్చి ఎంతో ఆప్యాయతను, ఆత్మీయతను ఒలకబోసి మళ్ళీ యింటికి తీసుకెళ్ళి మహాలింగంపేర ఉన్న యింటిని, యితర ఆస్తులను రాయించుకుని మళ్ళీ తరిమివేయటం, ఆయన తిరిగి రాజువద్దకు రావడం, డబ్బు అనేది మనుషుల్లో వున్న ఆత్మీయతను ఎలా తుంచి, తెంచివేస్తుందో స్పష్టంగా చూపించింది.

కరీమ్, శంకరరెడ్డి వగైరా ఎన్నెన్నో పాత్రలను సజీవంగా చిత్రీకరించారు.

మహాలింగం జబ్బుచేసి ఆస్పత్రిలో చనిపోతే శవాన్ని రాజు తను అద్దెకుండే యింటికి





తెస్తే, యింటాయన శవాన్ని యింట్లోకి తీసుకు రాకుండా ఆటంకం పెట్టినప్పుడు వెంకటేశు అనే సాదాసీదా మనిషి పలికిన పలుకులతో మన చెంపలమీద కొట్టి ఛెళ్ళుమనిపించారు. మన గుండెపైన కొట్టి, మన మనస్సులను మన హృదయాలని, మనలోవున్న మందగొడి తనాన్ని తిట్టి మనల్ని మేలుకొల్పారు.

చివరగా రాజు, రాణి వివాహానంతరం దశ రథరామయ్యని, జానకమ్మలను తన యింటికి సాదరంగా ఆహ్వానించి తీసుకుపోవడం, నేటి యువతకు కళ్ళు తెరిపించేదిగా, కనువిప్పు కల్గించేదిగా వుంది. 'మాతృదేవోభవ, పితృదే వోభవ' అని అందరిచే అన్పించారు రచయి త్రి.

ఇలాంటి వైవిధ్యంకల్గిన నవలలని మరిన్ని అందివ్వమనీ, అందిస్తారనీ ఆశిస్తున్నాను, ఆకాంక్షిస్తున్నాను.

**టి.వెంకటపతిరాజు**
విజయవాడ




**(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

**'మ**లిసంధ్య' నవల పేరుకి తగినట్లే జీవితపు మలిదశలో ఇటు పగటికీ, అటు రాత్రికి చెందని సంధ్యలా మిగిలిపోతున్న వృద్ధుల వ్యధార్త జీవిత యధార్థ సత్యాన్ని కళ్ళకు కట్టించింది. ఉద్వేగభరిత స్పందన, ఉత్తుంగ తరంగాల్లా ఎగసిన ఆలోచనా పరంపర ఈ నవల కలిగించిన భావోత్పాతాలు.

"ముసలాళ్ళంటే అరిగిపోయిన రికార్డు ల్లాగా, ఐపోయిన పేస్టు ట్యూబులాగా చెత్తకు ప్పమీద పడేయాల్సినవాళ్లనుకుంటారు..." అన్న వాక్యాలు మనస్సును మెలిపెట్టి మేథతో కాక మానవతతో ఆలోచింపజేశాయి. "ఒక తల్లి నలుగురు పిల్లల్ని సాకగలదు. కాని నలుగురు బిడ్డలు కల్సి ఒక్క తల్లిని సాకలేరు" అనే మాట అనాదిగా వస్తూన్నదే. మనిషి నాగరీకుడై మరింత ఇరుకైపోయాడేమో! లేకుంటే తల్లి దండ్రులు - పిల్లలుమధ్య అనుబంధం కాక అడ్డుబంధం అనే భావన పెరగటమేమిటి? ఒకరకంగా నేటి సమాజాన్ని బాధిస్తున్న సమ స్యగా దీనికి గుర్తింపుకోసమే ఈ నవల రాశారని పిస్తుంది.

ముఖ్యంగా అమ్మ-నాన్నల్ని దత్తత తీసుకోవ డమనే ఒక సరికొత్త ఆలోచనకు పునాదివేసి, ఆ భావానికి రూపుకట్టించేరు రచయిత్రి. అయితే ఇందులోని పాత్రలన్నీ అంతో ఇంతో ఆర్థికంగా నిలదొక్కుకున్నవే. అదీలేని నిరాధారులమాట, మానవత నెలకొల్పిన హెూమ్సు కూడా అందు బాటులో లేనివారి విషయం ఇక్కడ ప్రస్తా వించలేదు. బహుశా వారి పాట్లు రచయిత్రి ఊహకు కూడా అందలేదేమో!

రాజు, మహాలింగంల బాంధవ్యం, కృష్ణ మూర్తి మరణం పాత్రలుగా కాక సజీవ వ్యక్తుల్లా కన్నీరు పెట్టించాయి. ముఖ్యంగా రాణి కోరిక, దాన్ని రాజు నెరవేర్చిన విధానం సంచలనాత్మ కంగా ఉంది. రాజు చెప్పినట్లు 'సనాతన భారతీయ సంస్కృతి'పట్ల అవగాహన, ఆద రణ లోపించిన తరాల అంతరాలు సృష్టిస్తున్న సమస్యల వలయం ఇది. ఆనూచానిక సాంస్కృతిక విలువల్ని పరంపరగా అందించ డంలో పెద్దల పాత్రను కూడా సూచనప్రా యంగా చెప్పారు. ప్రేమకుగల బహుముఖాల ను సున్నితంగా ప్రదర్శించి వసుధైక కుటుంబ భావనను బలంగా ప్రేరేపించి, అంతరాంతర జ్యోతిసీమల్ని బహిర్గతం చే సిందీ రచన.

'హెూమ్ ఫర్ ఏజ్‌డ్' ఆవశ్యకత, నిర్వహణ, అందుకు శంకరరెడ్డిలాంటి వ్యక్తుల సేవాతత్ప రతతోబాటు యువత తమ ఖర్చులేని సేవల ను ఎలా అందించవచ్చునో ఆచరణాత్మకంగా చెప్పారు. శరీరం క్రుంగినా మనోదారుఢ్యం తరగని వృద్ధుల అనుభవం ఎదిగే తరానికి మార్గదర్శకమౌతుందే గాని కంటకప్రాయం కా బోదన్న ఎరుకను హృదయంలో ఇంకించిన అనుభూతినిచ్చిన గొప్ప నవల 'మలిసంధ్య'.

**-శ్రీమతి పదాల లక్ష్మి**
- వరంగల్



## తరాల అంతరం

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

'మలిసంధ్య' నేటి సమాజానికి దర్పణం పట్టేదిగా ఉంది. జీవితపు చరమాంకంలోనున్న వారికి కావలసింది నాలుగు మంచిమాటలు, కాస్తంత ప్రేమ, ఆదరణ అనే విషయం గుర్తించి, ఆచరించే తీరిక, ఓర్పు ఈతరంలో మృగ్యమవుతోంది. తమను తల్లిదండ్రులు ఎలా చూశారో అదేవిధంగానూ ఇంకా ఎక్కువగానూ తమ పిల్లలను కూడా చూడాలనుకుంటారుతప్ప తాము తమ తల్లిదండ్రులను ఎలా చూస్తారో అదేవిధంగా రేపు తమ పిల్లలు కూడా ప్రవర్తిస్తారేమో అన్న ఆలోచన రాదు. తాతలనాటి మూకుడు తరతరాలు ఉండాలి అనే విషయం గుర్తుంచుకుంటే అలా ప్రవర్తించరేమో అనిపిస్తుంది.

రాజారాం మిత్రుల సంభాషణ, వారి చిలిపితనం, ఒకరినొకరు 'ముసలిపీనుగా' అని తిట్టుకోవటం సరదాగానే ఉన్నా కృష్ణమూర్తి చనిపోయినప్పుడు ఏదో, సరదాగా 'ముసలిపీనుగంటే నిజంగానే పీనుగయిపోయావేంటిరా' అని ఏడ్వటం మనసును కలచివేసి చాలా బాధనిపించింది. అనాథాశ్రమంలో పెరిగిన రాజును సినిమాల్లోమాదిరి ఏ జమిందారు బిడ్డగానో చూపక అలా వదిలివేయటం చాలా సహజంగా ఉంది. అయితే ఇడ్లీలు, మిరపకాయ బజ్జీలు అమ్ముతూ, అంత తక్కువ వ్యవధిలో విశ్వనాథం దంపతులు లక్షాధికారులు కావటం అసహజం. ఏమైనప్పటికీ మొత్తంమీద ఈ నవల యువతరాన్ని ఆలోచింపజేసేదిగా ఉంది. కనీసం కొంతమందయినా ఈ నవల చదివి తమవారివిషయంలో సరైన అవగాహన కలిగి మంచి పిల్లలుగా మెలుగుతారని ఆశిస్తూ, ఈ నవల ప్రచురించినందుకు కొంతైనా ప్రయోజనం కలగాలని కోరుకుంటున్నాము.

-శ్రీమతి రుక్మారామం
పి.మల్లవరం





## గుండె గొంతుకలోన...

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

వృద్ధాప్యం మనిషి జీవితంలో చివరిదశ. ఆ దశలో వారు తమ తమ బిడ్డలతో మనవలు, మనవరాళ్ళతో హాయిగా కాలంగడిపేయాలనుకుంటారు. కాని, తమ కష్టార్జితమైన ఆస్తినంతా కాకులకన్నా హీనంగా ఎంగిలివిస్తరిని చీల్చినట్లుగా పంచుకొని, జీవనయానపు చివరిదశలోని తల్లినొకరు, తండ్రినొకరు పంచుకొని వారితో చాకిరీమాత్రం చేయించుకుంటూ, కుక్కలకన్నా హీనంగా ఇంట్లోంచి తరిమేయడం... నేటి సమాజంలో ఓవైపు జరుగుతోంది.

మరోవైపున... తమ కన్న తల్లిదండ్రులెవరో తెలియని స్థితిలో, అనాథాశ్రమానికొచ్చేవారెవరైనా తమని పెంచుకొంటానికి తీసుకెళతారేమోనని దీనంగా, ఆశగా కొన్ని పసిహృదయాలు పరితపించటం జరుగుతోంది.

నవల చదువుతున్నంతసేపూ నాకే ఆ పరిస్థితి ఎదురైతే...? నేనే వాళ్ళస్థానంలో ఉంటే...? అమ్మో! అనిపించి గుండె తరుక్కుపోతోంది. నేటి సమాజంలో జరుగుతున్న నిజసంఘటనలకు రచయిత్రి మంచి ట్రీట్‌మెంట్ ఇచ్చారనిపిస్తుంది ఈ 'మలిసంధ్య'లో.

సుధ, మాధవి, మరికొన్ని పాత్రలను అర్థాంతరంగా పెడదోవ పట్టించినట్లనిపించినా ముగింపు బాగుంది. రచయిత్రి ఓ మంచి థీమ్‌ను ఎన్నుకుని, విశాలదృక్పథంతో పాత్రలకు మెరుగులుదిద్ది, లోతైన ఆలోచనా రశితో ప్రతి సన్నివేశం కళ్ళకు కట్టినట్లుగా రూపొందించారనడంలో సందేహంలేదు.

ఈ సాహసం చేసినందులకు రచయిత్రిని, పాఠకుల ముందుంచినందుకు 'చతుర'ను అభినందనల మాలతో అలంకరించకుండా ఉండలేకపోతున్నాం. ముందుముందు మేము ఇలాంటి సమాజశ్రేయస్సుతో కూడుకున్న రచనలు మరిన్ని 'చతుర'లో చదువుతామనే ఆశతో...

-ఆర్.యాదయ్యా
షాద్‌నగర్

## ఆదర్శప్రాయం

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

అనాథాశ్రమంలోని బాలల, వృద్ధశరణాల యంలోని వృద్ధుల జీవితాలకూ, వారి మనోభా వాలకూ అద్దంపట్టిందీ 'మలిసంధ్య' నవల. వారి జీవితాలను సమగ్రంగా అధ్యయనం చేసి, స్పందించి, అద్భుతంగా మలచి పాఠక లోకానికి అందించిన నవలారాజం 'మలి సంధ్య'. నవలలో గుండెల్ని కదిలించే ఆర్ద్రత ఉంది. మానవత్వాన్ని మేల్కొలిపే సెంటి మెంటుంది.

నేటి ప్రతి కొడుకూ, రేపటి కాబోయే తండ్రే! నేడు తన తండ్రిని ప్రేమగా ఆదరిస్తేనే రేపు తన కొడుకూ తనను ఆదరిస్తాడనే సత్యాన్ని ప్రసాద్ పశ్చాత్తాపపడి, తన తండ్రిని తనతో తీసుకెళ్ళటంద్వారా చక్కగా వివరించారు. మరోవైపు 'తెప్పలుగ చెరువునిండిన కప్పలు పదివేలు చేరి'న చందంగా వ్యాపారంలో పుంజుకొన్న విశ్వనాథంగారి దగ్గరకు ధనాపే క్షతో వచ్చిన సుపుత్రులు రాజేశ్వర్, గంగాధర్ లకు విశ్వనాథంగారు చెప్పిన గుణపాఠం నేటి తరం కొడుకులందరికి కనువిప్పు కలిగించేలా ఉంది. రాజు, రాణి నాయక-నాయికా పాత్ర లకు ధీరోదాత్తత ఆపాదించి నేటితరం యువ తీయువకులకు ఆదర్శంగా నిలిపారు రచయి త్రి.

'వెయ్యిమైళ్ళ ప్రయాణం కూడా ఒక అడు గుతోనే ప్రారంభమవుతుంది. ఆ మొదటి అడు గే సంకల్పశుద్ధి. దాన్ని వేయించేది ఆత్మవిశ్వా సం'లాంటి ఆణిముత్యాలనదగ్గ భావ వ్యక్తీకర ణలు రచననిండా పుష్కలంగా కనిపించి రచ యిత్రి భావ పరిపక్వతను చాటిచెప్పాయి. వృద్ధాప్యంలో తల్లిదండ్రులు ఎదుర్కొంటున్న సమస్యను, వారిపట్ల నిర్వర్తించాల్సిన కొడు కుల బాధ్యతను ఈ నవలలో సహజత్వానికి దగ్గరగా రాశారు రచయిత్రి. చివరగా రాజు తాను పెరిగిన అనాథాశ్రమంనుండి కనీసం ఒకరినైనా తెచ్చుకొని పెంచుకోవాలని నిర్ణ యించుకోవడం నవలకు చక్కటి ముగింపు.

-యన్.మధుసూదన్‌యాదవ్
బాపట్ల

## సాహసోపేతమైన ఇతివృత్తం

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

మహోన్నతమైన మానవతను ఆవిష్క రించటం ఉత్తమ సాహిత్యానికి నిర్వచనంగా భావించగలిగితే, ఏప్రిల్ నెల 'చతుర'లో ప్రచురించిన 'మలిసంధ్య' నిస్సందేహంగా చక్కని నవల. 'వృద్ధాప్యజీవనం' వంటి సమ స్యను ఇతివృత్తంగా తీసుకోవడంలోనే రచయి త్రి ఎంతో సాహసాన్ని చూపించి నవలలో నవరసాలనూ సమర్థవంతంగా ఆవిష్కరించా రు. పాఠకుని మనసును ఆర్ద్రతతో ద్రవింపచే స్తూనే మనసారా నవ్వుకోగలిగేలా చక్కని హాస్యా న్ని కూడా అందించటం ఈ నవల మరో ప్రత్యేకత.

నవలలోని రాజు, రాణి, మహాలింగం, అన్న పూర్ణ, విశ్వనాథం, శంకరరెడ్డివంటి పాత్రలను పాఠకులు కొంతకాలం మరచిపోలేరు. స్వార్థం వెర్రితలలు వేస్తూ సున్నితమైన అనుబంధాల ను కాటువేస్తున్నాయనడానికి ఈ నవలలోని వృద్ధపాత్రలు నిదర్శనంగా నిలుస్తాయి. పిల్లల భవిష్యత్తుకోసం జీవితమంతా ధారపోసి, జీవన 'మలిసంధ్య'లో ఆ పిల్లల నిరాదరణకు, ప్రే మరాహిత్యానికి తల్లిదండ్రులు గురికావడంక న్నా దౌర్భాగ్యం మరొకటి ఉండదేమో!

సమాజాన్ని ముఖ్యంగా నేటి వృద్ధతరాన్ని పట్టిపీడిస్తున్న ఈ సమస్యను అనితరసాధ్యంగా తన నవలలో చిత్రీకరించటంతోపాటు, రాజు పాత్రద్వారా సమస్యకు పరిష్కారమార్గాన్ని కూడా రచయిత్రి సూచించారు. అయితే, కాకి గూడులాంటి ఈ లోకంలో కోకిలలు వంటిరాజు లు ఎందరు వుంటారు?

-కశింకోట ప్రభాకరదేవ్
శ్రీకాకుళం



# చిత్ర ప్రపంచం

## భారీ లేఖల రచయిత

'ఎవరి పిచ్చి వారికానందం' అని పెద్దలు ఊరికే అనలేదు. 'చాదస్తం' అనీ, 'తెలివిమాలిన పని' అని ఇతర్లకి తోచినా ఆయా పనులు వారికి అమితానందాన్ని కలిగిస్తూనే ఉంటాయి. అదుగో ఖచ్చితంగా అలాంటి పనే చేసి తనకుతాను అపరిమితానందభరితుడై పోతున్నాడు జోన్స్. కేరళకు చెందిన 30 ఏళ్ళ జోన్స్ ఎం.ఎ. ఇంగ్లీష్ లిటరేచర్‌లో పట్టా పుచ్చుకున్నాడు. ఏదో ఓ పని చేసి ఖ్యాతి పొందాలని తహతహలాడే జోన్స్ పదేళ్ళక్రితం నాటిఅమెరికా అధ్యక్షుడు రీగన్ మహాశయుడికి ఓ పేద్ద లేఖ రాశాడు. ఆ లేఖ 15 గజాల పొడవు, 5 గజాల వెడల్పుతో మహా 'భారీ'గా ఉండడంతో రీగన్ ఖుషీ అయిపోయి బహుమతిగా జోన్స్‌కు ఓ బొకే (పూలగుత్తి) పంపాడు. అంతేకాదు... అతని పేరు ముందు తన పేరును చేర్చుకొమ్మని ఉదారంగా అనుమతించాడు. అప్పటినుంచి జోన్స్ కాస్తా 'రీగన్ జోన్స్' అయిపోయాడు.

ఆ ఉత్సాహంతో మరింత భారీ లేఖ రాయడానికి పూనుకున్నాడు జోన్స్. ఈసారి తన లేఖాస్త్రాన్ని పోప్ మహాశయునిపైకి ప్రయోగించాడతను. ఆ లేఖ 2.4 కిలోమీటర్ల పొడవుంది. ఆశ్చర్యపోకండి అచ్చుతప్పేంకాదు... అక్షరాలా రెండూ పాయింట్ నాలుగు కిలోమీటర్ల పొడవు, మూడు గజాల వెడల్పు ఉందది. 100 కిలోలపైన తూగిన ఆ లేఖలో 10 కోట్లపైనే పదాలున్నాయట. పూర్తిగా ఇంగ్లీషులో సాగిన ఆ లేఖలోని ఓ పదానికి 150 అక్షరాలున్నాయట. ఇంకా ఆ లేఖలో 101 మంది ప్రపంచ ప్రముఖుల, నాయకుల ఫొటోలు అంటించాడట జోన్స్. ఆ లెటర్ రాయడానికి అతనికి మూడు అడుగుల వ్యాసార్థం, మూడు గజాల వెడల్పు ఉన్న పేపర్ రోల్స్ 24 దాకా ఖర్చయ్యాయట. అదిగాక నాలుగున్నర సంవత్సరాల కాలం, పదివేలపైన స్కెచ్ పెన్నులు ఆ లేఖా యజ్ఞానికి సమిధలయ్యాయి. ఆ భారీ లేఖని



పోప్‌గారికి చేర్చడానికి రవాణా ఖర్చులకింద అక్షరాలా రెండువేల నూటపధ్నాలుగు రూపాయల డెబ్బై పైసలు చేతి చమురు కూడా వదిలించుకున్నాడు జోన్స్. ఇంతా చేసి అతను సాధించినదేమిటో అతనికే తెలియాలి. నిరుద్యోగి కావడంతో ఏవో నాలుగు ప్రైవేట్లు చెప్పుకుని బతుకు వెళ్లదీస్తున్న అతగాడు ఇంతటి భారీ ప్రయత్నాన్ని ప్రారంభించడం - విజయవంతంగా ముగించడం అద్భుతమనే చెప్పాలి.

---

## ఇంజనీర్ జోస్యం

కౌన్పూర్‌కి చెందిన డాక్టర్ నందకుమార్ అగర్వాల్ ప్రపంచంలో ఎప్పుడు ఏ భూకంపం సంభవించేది కొన్నినెలలు ముందుగానే ఊహించి చెప్పగల మేధావి. వృత్తిరీత్యా సివిల్ఇంజనీర్ అయినప్పటికీ అతను అకుంఠిత దీక్షాదక్షలతో పరిశ్రమించి 'భవిష్యద్దర్శి'గా గణనీయమైన పేరుప్రఖ్యాతులు సముపార్జించుకున్నాడు.

విచిత్రమేమంటే- అతడు జ్యోతిష్కుడు కాడు. జ్యోతిశ్శాస్త్రానికి అతని ఊహాశక్తికి ఎలాంటి సంబంధమూ లేదు. కానీ అతనిమాట ఇంతవరకూ పొల్లుపోలేదు. 1977 జూలై నెలలో ఫిలిప్పీన్స్‌లో భూకంపం రాబోతోందని ఆ సంవత్సరం ప్రారంభంలోనే అతడాదేశాధినేతల్ని హెచ్చరించాడు. అన్నట్లుగానే ఆ సంవత్సరం జూలై 21న అక్కడ భయంకరమైన భూకంపం సంభవించింది. 1985 ఏప్రిల్‌లో భూకంపం సంభవించనున్నదని చిలీ దేశాధిపతులకు అతడు ముందుగా మార్చి నెలలోనే తెలియచేశాడు. అలాగే మెక్సికోలో 1985 జులై నెలలో వచ్చిన భూకంపాన్ని గురించి అతడు చాలా ముందుగానే చెప్పి అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాడు. అంతేకాదు చైనా, జపాన్, పెరు, ఇటలీ, ఇండోనేషియాలలో సంభవించిన భూకంపాలన్నీ అతడు ముందుగానే ఊహించాడు.




గత నూరేళ్లుగా ప్రపంచంలో సంభవించిన భూకంపాల చిట్టాను తన ముందేసుకొని, ప్రతి చిన్న విషయాన్ని బీరుపోకుండా నోట్సు రాసుకుని, దాన్ని కూలంకషంగా అధ్యయనం చేశాడు నందకుమార్. అంతేగాక భారతభాగవతాది పురాణేతిహాసాలలోనూ , ఉపనిషత్తులలోనూ అతనికి అపారమైన జ్ఞానం వుంది. "పురాణాల్ని ఉపనిషత్తుల్ని మనవాళ్లు కేవలం తత్వగ్రంథాలుగానే పరిగణిస్తారు. కానీ వాటిలో తరచి చూస్తే ఎన్నెన్నో శాస్త్రీయ అంశా

లు మనకు కనబడతాయి. అందుకే వాటిని శాస్త్రదృష్టితో పరిశీలించి ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. వాటిలో ఈ భూకంపాల గురించి, భౌగోళికాంశాల గురించి పరిపూర్ణమైన విజ్ఞానం నిక్షిప్తమై వుంది" అంటాడు నందకుమార్.

ఎన్నో ఏళ్లుగా భూకంపాల గురించి ఎన్నెన్నో పరిశోధనలు జరుగుతున్నాయి. భూమి కంపించడానికి గల రకరకాల కారణాలు వెల్లడవుతున్నాయి. అయినా ఒక్క మన నందకుమార్ తప్ప వేరెవ్వరూ వాటి ఉనికిని అంత స్పష్టంగా ముందే చెప్పలేకపోతున్నారన్నది నూటికి నూరుపాళ్ల నిజం.

## ...పాల్కేగారి ట్రిక్కు

దాదాసాహెబ్‌ను భారతీయ సినిమా పితామహుడిగా అభివర్ణిస్తారు. చిన్నప్పటినుంచీ సంగీతమన్నా చిత్రలేఖనం అన్నా నాటకాలన్నా యిష్టపడే పాల్కే, మహారాష్ట్రలోని, నాసిక్ జిల్లాలోని త్రయంబకేశ్వర్‌లో జన్మించారు. తన నలభయ్యవ ఏట చిత్రనిర్మాణ రంగంలో కాలు మోపిన పాల్కే 'రాజాహరిశ్చంద్ర' చిత్రాన్ని రూపొందించారు. తొలి భారతీయ మూకీ చిత్రంగా చెప్పబడే ఆ చిత్రానికి ఆరోజుల్లోనే పదిహేను వేల రూపాయల ఖర్చయింది. చిత్రం విడుదలయినప్పుడు తొలిదశలో కలెక్షన్స్ బాగానే ఉన్నాయి. కానీ కొన్నాళ్లయ్యాక హఠాత్తుగా కలెక్షన్లు పడిపోయాయి. ఒక థియేటర్ యజమానిద్వారా పాల్కేకు తెల్సిందేమంటే సుమారు ఆరు, ఏడు గంటలపాటు సాగే నాటకాలకు టిక్కెట్టు మూడు అణాలు. కేవలం 40 నిముషాలు సాగే 'హరిశ్చంద్ర' సిన్మా టిక్కెట్టూ మూడు అణాలే. అలాంటప్పుడు అంత సొమ్ము పెట్టి కనీసం గంటపాటైనా ఉండని సిన్మా ప్రేక్షకులకేం నచ్చుతుంది? అందుకే ప్రేక్షకులు తిరస్కరించారు.




అయితే దానికి విరుగుడుగా పాల్కే పబ్లిసిటీలో ఓ చిట్కా ప్రయోగించారు. "సుమారు 2 మైళ్ల పొడవు ఫిల్ములో 67,000 బొమ్మలున్న 'రాజాసత్యహరిశ్చంద్ర' సిన్మా కేవలం మూడు అణాలతోనే చూచి ఆనందించండి" అన్నదే సరికొత్త పబ్లిసిటీ సారాంశం. అంతే ఆ చిట్కాకి చిత్తయిపోయారు జనం. మళ్లీ కలెక్షన్లు ఊపు అందుకొన్నాయి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

